"స్త్రీ జాబితాకి మంచి అలవాట్లు అంటే, ప్రేమలొలకబోస్తూ, నీకు ఉత్తరాలు రాయటం - నీతో చెట్టపట్టాలు వేసుకుని షికార్లకి రావటం - కాలేజీ కెళ్ళివస్తూ, ఈ కాలపు నవలలు చదువుకోటం - ఇలాంటివేగా........" పెద్ద బావ హాస్యమాడాడు.

"నిజమే బావా! అవన్నీ నా దృష్టికీ మంచి అలవాట్లే. ఊరికే కాలం వృథా చేయటంకన్నా, 'చందమామ' చదివి తృప్తి చెందటం కన్నా ఉత్తమమయింది లేదని అనుకోటం కన్నా మూర్ఖత్వం లేదు - అయితే నా కనుకూలమైన విధంగా మలచుకోవాలనుకోటంలో తప్పే ముంది?"

కోమలాదేవి (కోమలా రత్నకుమారి) జననం - కర్నూలుజిల్లా ఆదోనిలో, 1935. B A., B.Ed పట్టభద్ర. బంగారు పంజరం (బహుమతి పొందినది), ఆరాధన, పునస్సమాగమం, ఉన్నత శిఖరాలు వగైరా నవలలతో ఆధునిక తెలుగు రచయిత్రులలో పేరు మోశారు. ఎమెస్కో పాఠకులకు "పూల తెరలు" నవల ద్వారా పరిచితులు. యువ దంపతులకు అవశ్య పఠనీయమైన ఈ కొత్త నవల ఈమె రచనా ప్రగతిలో మరో సోపానం.

**DAMPATYALU**

*By*

**KOMALADEVI**

*Publishers:*
**M. SESHACHALAM & CO.**

*First Edition:*
December, 1969

*Printers:*
Weldun Press,
Madras-21.

*Cover Design:*
Bapu

*Distributors:*
**Andhra Pradesh Book Distributors**
Rashtrapathi Road, Secunderabad.

Rs. 2/-




103

అంకితం:

అక్క

సరళాదేవికి

బావగారు

నాగభూషణంకు

హృదయపూర్వకంగా

# 1

మహీధర్ - వెంకటేశ్వరరావు స్నేహితులు. వాళ్ళిద్దరికీ స్నేహం కలవటం అందరికీ ఆశ్చర్యాన్ని కల్గించింది. ఎందుకంటారా....

మహీధర్ పుట్టటం పెరగటం-అంతా పట్నంలోనే. పట్నవాసపు హంగులు, మెరుగులు దిద్దుకుని టిప్‌టాప్‌గా కాలేజీలో అడుగుపెట్టాడు. కాని, వెంకటేశ్వర్రావుది-అంటే మాజీ వెంకటేశ్వర్లుది-లేక వెంకటేశులుది - నరసరావుపేట దగ్గర చిన్న పల్లెటూరు. ఆ ఊళ్ళో హైస్కూలు లేదు. మిడిల్‌స్కూలు చదువు అయిపోయిన తర్వాత ప్రక్క ఊరికి నడిచి వెళ్ళేవాడు. ఊరి బండ్లు ఆ వేపుగా వెళ్తాయి. చదువుకునే ఎనిమిది మంది కుర్రాళ్లూ ఏదో ఒక బండిమీద కూచుని గమ్యస్థానం చేరే వాళ్ళు. పిల్లలు పొరపాటున చిన్న నేరం చేసినా, తెలిసో తెలియకనో ఎవరికే విధమైన కష్టం కల్గించినా బండ్లలో ఉన్నవాళ్ళు - బండీ నడిపేవాడూ పల్లెకి చేరిన తర్వాత ఫిర్యాదుచేసేవాళ్ళు. ఇంట్లోవాళ్ల నడుములు విరగదన్నేవాళ్లు. పన్నెండేళ్ళ క్రితం అక్కడ సినిమాహాలుకూడ లేదు. మేష్టారు చెప్పింది శ్రద్ధగానో, అశ్రద్ధగానో విని, తెచ్చుకున్న చద్ది అన్నాలు తిని మళ్లీ ఆరుగంటలకు - గోధూళివేళ మెల్లగా ఇళ్లు జేరే వాళ్ళు. రాగానే స్నానాలు, కాసేపు గొడ్ల చావిడి పనులు, అవి లేని వాళ్లు బైట అరుగుమీద కూచుని వచ్చేపోయేవాళ్ళని చూస్తూ కాలం గడపటం-భోజనం పెందలాడే ముగించి దీపం దగ్గర కునికిపాట్లవరకూ కూచుని చదవటం-నిద్రపోవటం.

అంటే - పట్నవాసపు అలవాట్లుగానీ, దర్జాలుగానీ, టక్కరితనాలుగానీ, అల్లర్లుగానీ ఆనాటివరకూ అంటనివారిలో వెంకటేశ్వర్లు ఒకడు.

పరీక్ష మంచిమార్కులతో పాసయిన కారణంగా గుంటూరులో శ్రమలేకుండా కాలేజిలో సీట్ వచ్చింది.

ఏ మాలిన్యం, ఏ సమస్య చొరబడని జీవితం గడిపి - తల్లి చాటు బిడ్డగా పెరిగి పెద్దవాడై ఇప్పటివరకు స్వచ్ఛమైన జీవన ప్రవంతిలో తేలిపోయిన జీవితంలో పట్నవాసపు కాలుష్యాలూ, కాపట్యాలూ, టీన్‌ఏజ్ ఉద్రేకాలూ "టోర్నడో"ల్లా జొరబడుతూంటాయి.

ఏ. సి. కాలేజీలో చేరిన మొదటి రోజున వెంకటేశ్‌కు అన్నీ ఆశ్చర్యాన్నే కల్గించాయి. అన్నింటికన్నా అతణ్ణి ఆశ్చర్యంలో ముంచెత్తిన విశేషం అబ్బాయిలు, అమ్మాయిలు సర్దాగా నవ్వుకుంటూ మాట్లాడుకోటం! కొన్ని సినిమాల్లో మాత్రం ఇలాంటి సంఘటనలు చూశాడు. (అతడు చూసిన సినిమాలన్నీ భక్తి రసంతో నిండినవే-ఏ ఒకటో రెండో సాంఘిక చిత్రాలు చూశాడు.)

కాలేజీ తెరచిన మొదటి రోజున వెంకటేశ్‌లాంటి కుర్రాళ్లు చాలమంది తటస్థ పడుతూంటారుగాని, అందరూ ఇతనంత అమాయికంగా ఉండరు.

వెంకటేశ్‌కు తల్లీతండ్రీ, ఇద్దరు అక్కలు, ఒక చెల్లెలు ఉన్నారు. ఇంకో మగపిల్లడు లేనందువల్ల - ఒక్కగా నొక్క మగబిడ్డ అయినందువల్ల ఇంటిల్లి పాదికి అతడంటే అమితమైన ముద్దు-ప్రేమ గారాబం. తత్ఫలితంగా అమాయికంగా తయారయ్యాడేగాని, మొద్దబ్బాయీ మాత్రం కాడు.

హాస్టల్‌లో అతణ్ణి విడిచి తండ్రి నీతులు బోధించి, "డూస్ అండ్ డోంట్స్" పదే పదే వల్లించి, డబ్బులు చేతిలోపెట్టి-వార్డెన్‌ను ఓమాటు కలిసి "వెళ్లొస్తాను-పిల్లాడిని చూచుకోండి" అనిచెప్పగా వార్డెన్ తేలికగా నవ్వి "ఎందుకండీ-అంత భయం మీకు? ఒక్క నెలరోజులు పోనివ్వండి, అగ్గి పిడుగుగా తయారవుతాడు మీ అబ్బాయి. పదిమందిలో కలిసి తిరుగుతూంటే ఇట్టే నేర్చుకుంటాడు అన్నీ" అన్నాడు.

"అదదో....చెప్పేశారు....ఆ 'అన్నీ' నేర్చుకోకూడదనే నా తాపత్రయం....అన్నట్లు....అయ్యా, త్వరగా పెళ్ళిచేసేస్తే మంచి దంటారా?....అలా చూడకండి....ఎందరినో చూశారు....రకరకాల సమస్యలుంటాయి. మీరు ఎరుగుదురు. అందుకే అడుగుతున్నాను."

"ఫరవాలేదు. అలాంటివేం జరగవు లెండి. మీకా భయం ఇప్పుడప్పుడే అక్కర్లేదు. మీ అబ్బాయి బి. ఎ. లో జాయిన్ అయినప్పుడు చెయ్యొచ్చు." అంటూ వార్డెన్ ధైర్యం చెప్పాడు.

తండ్రి రాఘవయ్య మెల్లిగా వెళ్తూంటే వెనకాలే తను గూడా వెళ్ళాడు. వార్డెన్‌కు ఇలాంటి దృశ్యాలు సర్వసాధారణంగా ఏటా అనుభవమే. అందుకే, ఆయన అట్టే పట్టించుకోడు. సీనియర్ విద్యార్థులు-తుంటరి వెధవలు-అల్లరి పట్టించాలని....దొంగ ఏడుపు ఏడుస్తూ "....అయ్యో.. నాన్నా... వెళ్తున్నావా?....నా కెవరు దిక్కు?" అని ముక్కు చీదేస్తూంటే పదిమందీ జేరి ఫకాల్న గోల చేయటం లాంటి తమాషాలుకూడా క్రొత్తేమీ కాదు.

తండ్రిని పంపించి వెంకటేశ్వర్లు బిక్కు బిక్కుమంటూ గదిలోకి వెళ్ళాడు. గదిలో ఎవరూ లేరు. నాల్గు గోడలు - రెండు మంచాలు - రెండు బల్లలు - రెండు కుర్చీలు. అంతా సరిక్రొత్త వాతావరణం; సంశయాలు ముసురుకుంటున్నాయి. లేచివెళ్ళి తలుపువేసొచ్చి, మంచం మీద పడుకున్నాడు. అమ్మ, అక్కలు, చెల్లి గుర్తొచ్చారు. తండ్రి జాలిగొల్పే ముఖం కళ్ళలో మెదిలింది. కన్నీరు ఆగలేదు. ఎంత అణచుకున్నా వేడికన్నీరు వుబికి వస్తూంది. తలుపు చప్పుడైతే గబగబ ముఖం తుడుచుకునివెళ్ళి, తలుపు తీశాడు.

ఎదురుగా మహీధర్ నుంచుని ఉన్నాడు. పదహారేళ్ళు నిండని చిన్నవాడైనప్పటికీ మహీధర్ ముఖంలో నిండుదనం కొట్టవచ్చినట్టు కనిపిస్తూంది. చకచక లోపలికొచ్చి తలుపు గడియవేశాడు. వెంకటేశ్వర్లు ఏదో ఒకటి చేయాలని బల్లమీద ఉన్న పుస్తకాలు సరటం మొదలుపెట్టాడు.

"నీ పేరు?"

"వెంకటేశ్వర్లు."

"అలాచెప్పకోకు."

"ఏం?"

"ముద్దుగా, షోగ్గా, రెండక్షరాల పేరైతే అట్రాక్టివ్‌గా ఉంటుంది. వెంకటేశ్ అని చెప్పకోరాదూ!"

"అల్లా అయితే నాలుగక్షరాల పేరవుతుంది. నువ్వన్నట్లు రెండక్షరాలయితే వెంక - టేష్ - కటే - టేశ్వ ఇలా - ఏదైనా పెట్టుకోవాలి!"

మహీధర్ ఫకాల్న నవ్వేశాడు.

"అరె - తమాషాగా అన్నావే! .... ఇంకా .... ఆ కళ్ళలో నీరు చూస్తే ఒట్టి పల్లెటూరి బైతువనుకున్నాను. నీకూ చేతనౌనే సమయానుకూలంగా మాట్లాడడం....గుడ్...."

తనలా మాట్లాడడం తనకే ఎంతో ఆశ్చర్యం వేసింది. మహీధర్ రాకతో బిక్కచచ్చినవాడల్లా ఈ చిన్న సంభాషణతో కాస్త తేరుకున్నాడు.

"నీలాంటివాళ్ళనుచూస్తే మరీ ఏడ్పిస్తారు. నా మాట విని కాస్త హుషారుగా సరదాగా ఉండు. రేపు రాగింగ్‌లో నీ ప్రాణం తీస్తారు."

"అంటే?"

"అదో చిన్నతరహా ఏకపక్షయుద్ధం. అంటే సీనియర్స్ జూనియర్స్‌ను లాంఛనంగా సుస్వాగతపూర్వకంగా, సన్మానపూర్వకంగా తమలో జేర్చుకుంటారు, ఏడ్పించి-ప్రాణాలతోదేసి-బఫూన్స్‌ని జేసివదుల్తారు."

"అరే!....మనం క్రొత్తగా వచ్చాంకదా? ఎంతో దయతో ఆదరించి ధైర్యంజెప్పక ఇలాచెయ్యటం ఏమిటి?" వెంకటేశ్‌కి సగం ప్రాణాలు ఎగిరిపోయినట్లే అడిగాడు.

"అంతేలే. ఈరోజు నువ్వు, నేను, ప్రతిఒక్క జూనియరూ ఇదే ప్రశ్న వేస్తాడు. వచ్చేసంవత్సరానికి మనం సీనియర్స్‌ల మయిపోతాం. మనకు జరిగింది మర్చిపోతాం! ఈనాడు మనకు వాళ్ళుజేసినవన్నీ ఆనాడు తమాషాగా ఉంటాయి, పైగా రాగింగ్‌కు క్రొంగ్రొత్త మెరుగులుదిద్ది వచ్చేవాళ్ళను ఇంకొంచెం ఎక్కువగానే ఏడిపిస్తాం. కనుక దీన్ని భరించాలంటే వచ్చేఏడాది మనం మనజూనియర్స్‌ను ఇల్లాగే చేస్తామన్న ధీమాతో ఉన్నామంటే సరిపోతుంది."

"ఎప్పుడు ప్రారంభిస్తారు?" నిస్పృహతో అడిగాడు.

"మరో వారంరోజులకు. నీలాంటివారిని మూడుచెరువుల నీళ్ళు త్రాగిస్తారు. అందులో నిన్ను బాగా గుర్తు పెట్టుకున్నారు."

"నీకెలా తెలుసు?"

"అక్కడ నేనున్నాను కాబట్టి. నీకు పెళ్ళిజేస్తామన్నారట మీ నాన్నగారు. అది విన్నాడొకడు. రేపు నీకు వీళ్ళు పెళ్ళిచేసేస్తారు."

"అమ్మో.... పెళ్లే....ఉత్తుత్తి పెళ్ళేనా?....లేక...." కళ్ళింతవి చేసుకుని అడిగాడు.

"ఉత్తుత్తిది ఏం ఖర్మ....!"

వెంకటేశ్ అతడిచేయి గట్టిగా పట్టుకున్నాడు. గాభరాగా అడిగాడు, "చెప్పు....నీకు తెలుసంటున్నావు. ఏం చేస్తారు?....నా మీద దయలేదా? పల్లెటూరునించి వచ్చాను....ఇవేవీ నాకు తెలియవు. చెప్పవూ?" బ్రతిమాలుతుంటే మహీధర్ నవ్వేశాడు. జాలిగా చూశాడు.

"ఉత్తుత్తి పెళ్లే. కానీ నిన్ను చాల భయపెడ్తారు. అన్నింటికీ నవ్వేస్తుండు. తాళి కట్టమంటారు. ఓ....చక్కగా అందుకుని కట్టెయ్యి. చూడగానే తెలుస్తుందిలే పెళ్ళికూతురుగూడ ఒక అబ్బాయేనని. కానీ.... ఒక్కటి గుర్తుంచుకో. తెలిసినట్లుండకు. అన్నింటికీ విస్తుపోతూ, వద్దో - మొర్రో అని మొత్తుకో - నానా రభసాచెయ్యి. నిన్నులాక్కెళ్ళి ఈ తంతు చేయిస్తారు, నేను నీకు చెప్పానని తెలిస్తే నా ప్రాణం తీస్తారు."

"చెప్పను" అని ఒత్తి పల్కాడు.

వెంకటేశ్‌లో పౌరుషం తలెత్తింది. ఛాతీ కాస్త విరిచాడు. ముఖంలో కాఠిన్యం చోటుచేసుకుంది.

"నాకేం తెలీదా? ఏం ఎరుగనట్లుంటాను."

"ఆ....అల్లా స్పోర్టివ్‌గా ఉండాలి" అంటూ కరచాలనం చేస్తూ, "నా పేరు మహీధర్. మాది ప్రస్తుతం విజయవాడ. మా నాన్న ఎగ్జిక్యూటివ్ ఇంజనీరుగా పెద్దపెద్ద ఊళ్ళలో పనిజేశారు. నాకు నలుగురు అక్కలు," అంటూ తన్ను తాను పరిచయం చేసుకున్నాడు.

వెంకటేశ్ తనను గురించి చెప్పుకున్నాడు.

"నేను నరసరావుపేట తప్ప పెద్ద ఊరేదీ చూడలేదు. ఇక్కడ ఎన్నో విషయాలు నాకు క్రొత్తగా ఉన్నై. ఎవరి నడిగితే ఏమంటారో నని భయం. నాకు కాస్త సాయంచేస్తావా? విసుక్కోకుండా చెప్తావా?" అతను వేడుకున్నట్లు అడుగుతుంటే మహీధర్‌కు జాలివేసింది.

"ఓ....అలాగే....నీకేం ఫరవాలేదు."

"నీ రూంలో నేను పడటం నా అదృష్టం. నిశ్చింతగా నిద్ర పోతాను." ముఖంలోని ఆవేదన పటాపంచలై పోగా ప్రశాంత వద నంతో ఒక్క దూకునపోయి పరుపుమీద వాలాడు.

"పిచ్చి సన్నాసి" అనుకుని కుర్చీలో కూచున్నాడు మహీధర్.

భోజనానికి వేళ అవుతూంది. ఆకలి వేస్తోంది. వెంకటేశ్‌ను లేపుదామని ఇటు తిరిగాడు. నిశ్చింతగా గాఢనిద్రలో మునిగిపోయాడు వెంకటేశ్. లేపటానికి మనసు ఒప్పలేదు మహీధర్‌కి. ఇటువంటి నిద్ర మరెన్నటికీ రాదేమో. పడుకోనియ్. అంతరాత్మ హెచ్చరించింది. పాపం. రేపటినించి ఎన్నెన్ని అవమాన పరిహాసాలకు గురి అవుతాడో - అను కుని తను మాత్రం భోజనానికి వెళ్లిపోయాడు.

ఒకరాత్రప్పుడు వెంకటేశ్‌కు మెలకువ వచ్చింది. గదిలో అంధ కారం. లేచి తడుముకుని లైటువేశాడు. ఆకలిగా ఉంది. మధ్యాహ్నం తిన్నతిండి. టైంపీస్ పన్నెండు గంటలు చూపిస్తూంది.

మహీధర్ కళ్ళు తెరిచాడు. అంతలోనే మూసుకుని గోడవైపు తిరిగి - "వెంకటేశ్!-డ్రాయర్‌లో నాల్గు అరటిపండ్లూ, ఫలహారం ఉంది. తిను...." అని నిద్రలోకి జారిపోయాడు. వెంకటేశ్ మహీ ధర్‌కేసి ఎంతోసేపు రెప్ప వాల్చకుండా చూశాడు. మనసు కృతజ్ఞ భావంతో నిండిపోయింది. తనకొక స్నేహితుడు దొరికాడు ... తను నిశ్చింతగా నూతన జీవితంలో అడుగుపెట్టగలడు. పండ్లు తిని, మంచినీళ్ళు త్రాగి, ఎంతోసేపు స్నేహితుణ్ణిగూర్చి ఆలోచిస్తూ పడుకున్నాడు.

# 2

పది రోజులు హడావిడిగా గడిచిపోయాయి.

సమరోత్సాహం లాంటి ఉత్సాహంలో విద్యార్థులు 'రాగింగ్'లో పాల్గొన్నారు.

వెంకటేశ్‌ను ప్రత్యేకించి 'రాగ్' చేశారు. తీరా చేతికి పసుపు తాడు (పసుపు కొమ్ము కట్టినది) ఇస్తే భయపడిపోయాడు. ఆ గుంపులో అతడికళ్ళు ఆత్రంగా మహీధర్‌ను వెదికాయి. కాని, జూనియర్స్‌కు అంతా - తమ తమ రూపాలు గుర్తు తెలియకుండా చేశారు. కొందర్ని బుర్రమీసాలతో తయారుచేశారు. పౌడరు, కాటుక, స్నో డబ్బాలు విరివిగా వాడారు. పగటివేషగాండ్రలా ఉన్న సహ విద్యార్థుల్ని చూస్తూ మహీధర్‌ను గుర్తించలేక డీలాపడి చూస్తుంటే "మీ నాయన పెళ్ళి చేస్తాట్ట. అంతవరకు ఆగటం దేనికి? రావోయ్, కట్టు." అంటూ ఇద్దరు చెరొకజబ్బపట్టుకుని గుంపులోంచి బైటికి లాక్కొచ్చారు. ఎవడో తెల్లటి టవలుతెచ్చి పాగా చుట్టాడు. కొందరు నోళ్ళతో, చేతులతో పెళ్ళిబాజాలు వాయించారు. ఇంతలో ఆ గుంపు దగ్గర చిన్నరకం అలజడి ప్రారంభమైంది. నలుగురైదుగురు అమ్మాయిలొచ్చారు!

"అమ్మ బాబోయ్!" అనుకున్నాడు వెంకటేశ్.

"పెళ్ళంటే అంత భయమేమిటోయ్!" ఎవరో బిగ్గరగా అన్నారు. బురఖావేసిన 'పిల్ల'ను తెచ్చి కూచోబెట్టారు. గాజులు గలగలమన్నాయి!

ఆడపిల్లలు కిలకిల నవ్వుతున్నారు.

చేరిన మగపిల్లలు విరగబడి నవ్వుతున్నారు.

"కట్టవోయ్!" అరుస్తున్నారు.

"కట్టవోయ్ తాళి!
తీయవోయ్ బురఖా
చూడవోయ్ మోము
పోవోయ్ మూర్ఖ!"

కవాలీస్టైల్లో చప్పట్లు చరుస్తూ పాడాడు - ఒకడు. "కట్టవోయ్!" ఆ స్వరం స్పష్టంగా వెంకటేశ్ కర్ణపుటాలను సోకింది. కలియ జూశాడు. తనకు బాగా తెలుసు - అది మహీధర్ స్వరం.

ఇక ఆలస్యం చేయలేదు. తాళి కట్టేశాడు. విజయగర్వంతో ఛాతీ విరిచి చూశాడు. అందరూ తెగ నవ్వుతున్నారు. 'పెళ్ళికూతురు' గుంపులో కలిసిపోయింది.

పాపం-వాడొక జూనియర్ వెధవ-అనుకున్నారు.

ఆడపిల్లలు వెళ్ళిపోయారు.

"వెంకటేశ్!....పిరికివాడివనుకున్నాము....ధైర్యవంతుడివే!" అంటూ కొందరు అభినందించారు.

"నా భార్య ముఖాన్ని చూడనీయలేదు!" దిగులుగా అన్నట్లు నటించాడు. 'హ్హ హ్హ హ్హ' అంటూ చుట్టూఉన్నవారు హాయిగా నవ్వేశారు.

రాత్రి వేషాలన్నీ తీసిపారేసి స్నానాలుచేసి భోజనము ముగించి పక్కలపైకి చేరారు.

"గాజుల చప్పుడు విని నిజంగానే భయపడ్డాను....ఐనా ఆ ఆడ పిల్లల్ని ఎలా పట్టుకొచ్చారు?"

"ఇన్వైట్ చేశారు. కొంతమంది ఆడపిల్లలుకూడా ఉంటే పెళ్ళికొడుక్కు ధైర్యం చాలదు. నిజమైన ఆడపిల్లే అనుకుంటాడని వాళ్ళు ప్లాన్ వేశారు, నువ్వుకట్టాక వాళ్ళు చక్కగా వెళ్ళిపోయారు.... ఐనా నువ్వు చాలా బాగా నటించావ్లే! నిన్నెంతో ఏడ్పించాలను కున్నారు. ఏమీ ఎక్కువ 'ఫస్' చేయకుండానే తాళి కట్టేశావుకదూ! పాపం, వాళ్ళే ఓడిపోయారు."

"నీ గొంతు వినగానే ఎక్కడలేని ధైర్యం పుట్టుకొచ్చింది."

"ఐతే ఇక ఎప్పటికీ నాకోసం, నా స్వరంకోసం ఎదురు చూస్తూంటావేమిటి?" తమాషాగా అడిగాడు మహీధర్.

"ఔను....నీస్వరంవింటే నాకు ఉత్సాహం-ధైర్యం-తెగింపు వస్తాయి. నా కొక మంచి స్నేహితుడు దొరికాడన్న ఆనందం నన్ను బలపరుస్తుంది."

మహీధర్ తేలికగా నవ్వేశాడు.

"నాపైన నీకింత జాలి ఎలాకల్గింది? చెప్పవూ?" అని అడిగాడు ఒకరోజున వెంకటేశ్.

"మా నాన్నగారు చెప్పారు....మరిట, మా నాన్నగారు పల్లెటూర్లో ఎస్. ఎస్. ఎల్. సి. పాసయి, ఒక్కసారి ఇంటర్ చదవడానికి మెడ్రాస్ వెళ్ళారట. పట్నంచదువంటే అదొక దర్జా. నాన్న అక్కడ అడుగు పెట్టగానే, అక్కడ మిగతా విద్యార్థులు ఎంతో అల్లరి పెట్టారట. అందులోనూ లయోలా కాలేజి. ఆ నూత్న వాతావరణానికి, వాళ్ళ పద్ధతులకీ అలవాటు పడటాని కెంతో కష్టపడ్డారట. నిక్కరు వేసుకున్నారటలే....ఇక చూసుకో...." అంటూ మహీధర్ పగలబడి నవ్వాడు.

వెంకటేశ్ కూడ నవ్వాడు. ఐతే తను అంతకన్న చాలా మెరుగేనేమో అనుకున్నాడు.

"నిన్ను చూడగానే నాన్నగారు పడ్డ అవస్థ గుర్తొచ్చింది. నువ్వుకూడా అలాగే బాధపడ్తావనిపించింది. మా నాన్నను ఒక మళయాళపు అబ్బాయి ఆదుకున్నాట్ట. వాళ్ళిద్దరు ఇప్పటికీ చాలా స్నేహంగా ఉంటారు."

"ఐతే—మనంకూడ అంత మంచి స్నేహితులౌతాంగా!" వెంకటేశ్ కంఠంలోని ఆసక్తి, అతని చూపుల్లోని వేడికోలు, ఆ అడుగుతున్న తీరుచూసి మహీధర్ చలించి పోయాడు.

పదహారేళ్ళు నిండని వయసు వాళ్ళది. జీవితం అంటే ఏమిటో తెలియదు. సుఖాల వెనుక కష్టాలు నీడల్లా వెన్నంటి ఉంటాయని, బాధ్యతలను నిర్వహించాలంటే సమస్య లెదురౌతాయని, చేతిలోని మంచు ముక్క కరిగిపోయినట్లు విద్యార్థి దశ తెలియకుండానే గతించి

పోతుందని-ఇప్పుడు వృధాగా కాలయాపనచేస్తే ముమ్ముందు పరితపించ వలసి వస్తుందని గ్రహించలేని అమాయకత్వంతో కూడిన వయసది.

"నీ స్నేహం-నాకు కావాలి-" అని వెంకటేశ్ అడుగుతున్నట్లు, "ఓహ్...." అని ఆనందంతో పొంగి పోయాడు మహీధర్.

కాని, తెలియకుండానే- ప్రయత్న రహితంగానే వారిరువురు చేరువయ్యారు. మూడవ వ్యక్తి ఒకడుకూడా ఆ గదిలోకి వచ్చినప్పటికి అతడితో వారికి స్నేహం కలవలేదు.

కాలేజీకి వెళ్లిన తరువాత ఎవరి వ్యాపకాలు వారివి. ఇద్దరూ తెలివిగల వాళ్లే. శ్రద్ధాసక్తులతో చదివేవాళ్లు.

కాని—

మహీధర్‌కు కాళ్ళు ఒకచోట నిలవవు. నాల్గు స్థలాలు తిరిగి రావాలి. నోరు ఊరకుండదు. ఏదో చిలిపిమాట అనాలి. చేయీ ఊరు కోదు. ఏదైనా రాయాలి. ఒంటరిగా గడపలేడు. తన చుట్టూ ఒక గుంపు ఉండాలి. అంటే - మహీధర్‌వి అన్నీ 'నాయకుడి' లక్షణాలే.

వెంకటేశ్ బుద్ధిగా చదువుకుంటాడు. క్లాస్‌లోనే కూచుం టాడు. ఎక్కువ తిరగడు, మాట్లాడడు. అనవసరమైన రాతలతో పనిలేదు.

కాని, ఒకరి నొకరు ఎన్నడూ ఎగతాళి చేసుకోలేదు. ఒకరి ప్రవర్తనను మరొకరు గర్హించలేదు. వారివారి పరిధులలో వారు విజయులై ముందుకు సాగిపోతున్నారు. కాలేజీ ఆవరణ దాటిన వెంటనే ఇద్దరూ కలిసి హాస్టల్‌కు వెళ్లేవాళ్ళు. ఒకరి నొకరు గౌరవించుకుంటూ కలిసి చదువుకునే వాళ్లు.

ఇద్దరికీ మార్కులు బాగా వచ్చేవి. అందుకని మహీధర్‌ను ఎవరు ఏమీ అనేవాళ్ళు కారు.

మహీధర్‌కు కమ్యూనిస్టులపైన అభిమానం. వెంకటేశ్‌కు కాంగ్రెస్‌పైన. అక్కడా ఇక్కడా గుంపుల్లోజేరి తమతమ భావాలను పైకి చెప్పుకుంటారు. కాని, వాళ్ళిద్దరు ఒకచోట కూడితే ఇటువంటి విభేదాలను ప్రక్కకుత్రోసి-ఇద్దరికీ అనుకూలమైన, ఇష్టమైన అంశాలను గూర్చి ముచ్చటించుకునే వాళ్లు.

మొదటినించీ ఈ విధంగా కలిసి మెలిసి తిరుగుతూ తమ స్నేహాన్ని అభివృద్ధి చేసుకున్నారు.

విభిన్న దృక్పథాలు కలిగినవారైనప్పటికీ, ఉత్తర దక్షిణ ధ్రువాల్లాంటి వారైనప్పటికీ- కలకల నవ్వుతూ సరదాగా మాట్లాడుతూ తన చుట్టూ అయస్కాంతశక్తి ప్రసరించే మహీధర్‌కు; మితభాషి, కాస్త సీరియస్ టైప్, ఏకాంతంగా ఉన్నప్పటికీ ఆనందించగల దివ్యశక్తి గల్గిన వెంకటేశ్‌కీ చిత్రంగా స్నేహం కలిసింది.

వారి స్నేహాన్ని విచిత్రంగా పరిగణించేవాళ్ళు మిగతా విద్యార్థులు. కొందరు ఎగతాళి జేసేవారు—

"సీమ టపాకాయి-చింతకాయ పచ్చడి" అని, "స్ఫుత్నిక్కూ-గొంగళి పురుగూ" అని.

ఇద్దరూ నవ్వేసి వెళ్ళిపోయేవాళ్ళు.

విడదీయరాని స్నేహం వాళ్ళది.

ఆ విధంగా పి. యు. సి. ముగించి పరీక్షలు రాసి ఇళ్లకు వెళ్ళిపోయారు.

కాని, వారి మధ్య ఆ స్నేహబంధం సడలిపోలేదు. ఉత్తరాల ద్వారా దానిని నిల్పుకున్నారు.

కొడుకును చూడగానే ఆనాడు వార్డెన్ అన్నమాటలు యథాతథంగా గుర్తొచ్చాయి వెంకటేశ్ తండ్రికి. ఫరవాలేదు. ఈ లోకంలో బ్రతగ్గలడు. తాను భయపడ నవసరంలేదు.

దినాలు ఇట్టే గడిచి పోయాయి.

ఇద్దరూ పాసయ్యారు. బి. ఎస్. సి. కి అప్లయి చేశారు. సీట్లొచ్చాయి. వెళ్లి జాయిన్ అయ్యారు. తమ జూనియర్స్‌ను క్రొత్త పద్ధతుల్లో 'రాగ్' జేశారు. తరువాత చదువుల్లో, సందడుల్లో నిమగ్నమయ్యారు. కాలం ఎవరి మాటా వినకుండా పరుగు దీస్తోంది.

విద్యార్థులంతా విద్య పూర్తి చేసినట్లే వీరిద్దరూ పూర్తి చేశారు. అంటే-స్ట్రయికులు, గొడవలు, పోట్లాటలు, ప్రైవేట్ క్లాసుల్లో అల్లర్లూ-హడావిడిగా గడిచిపోయినై రోజులు.

బి.ఎస్.సి. మూడో సంవత్సరంలో ఒక చిన్న సంఘటన

జరిగింది. మహీధర్ జీవితంలో ఒక అమ్మాయి ప్రవేశించింది. రూంలో అడుగుపెట్టిన తక్షణం ఆ సంగతి స్నేహితుడి చెవిని వేశాడు. వెంకటేశ్ విస్తుపోయాడు-ఎన్నడూ లేనిది, నోటివెంట హితవచనాలు వచ్చాయి. "ఒరేయ్! ఇంకా బి.ఎస్.సి. లోనే ఉన్నాం. ఇంకా పై చదువులు వెలగబెట్టాలి- నా సంగతేమోగాని మీ నాన్న నీ విషయంలో ఎన్నో ఆశలు పెట్టుకున్నాడని నువ్వే చెప్పావు. ఇప్పటినించి ఈ ప్రేమకలాపాలేమిటి? కాస్త ఆగు. ఎం.ఎస్సీలో, ఆఖరు సంవత్సరంలో ఏరిచూసుకుని ఓ పిల్లను ప్రేమించు." చాలా సీరియస్‌గా చెప్పాడు వెంకటేశ్.

మహీధర్ పెద్దగా నవ్వేశాడు.

"వెంకీ.... నీ మాట విన్నాననుకో. ఎవరిని ప్రేమించాలా, అని వెతుక్కుంటూ ఉండాలన్నమాట. కనబడిన ఆడపిల్లలో ఉత్తమ నాయికాలక్షణాలున్నాయా, లేదా? నా ప్రేమను స్వీకరించగల స్తోమత ఉన్నదా? తీరా ప్రేమించానే అనుకో- చెప్పు అందుకోదు గదా! ఇన్నీ ఆలోచిస్తే ఒక్కర్తిగూడా మనకి నచ్చదు. జీవితాంతం బ్రహ్మచారిగా ఉండిపోవలసివస్తుందేమో! ఫరవాలేదనుకో! నీలాటివాడుండగలడు. కానీ, నాలాటివాటి కది అసాధ్యంరా. చూడు - చెట్టుమీద కాయలు నిండుగా కాసి ఉన్నాయనుకో, క్రిందనుంచుని పైకిచూసి వెతుక్కుంటాము. అన్నీ ఒకే చెట్టుకాయలే - కానీ మన కంటి నాకర్షించేది ఒకే ఒక పండు. దాన్ని కోసుకుంటాము.... అంతేరా.... అంతే.... మనం పుట్టిందిమొదలు అసంపూర్తిగానే పెరుగుతాం. మన వ్యక్తిత్వానికి సంపూర్ణత్వాన్ని సిద్ధింపజేయాలంటే - సిద్ధింపజేయగల ఆ శక్తి కోసం సదా వెతుక్కుంటూ ఉంటాము. ఒక అమ్మాయిని చూశామనుకో, ఆమె మనలో చలనంరేపి ఒకవిధమైన అనుభూతిని మనలో కల్గించిందంటే, ఆ అయస్కాంత శక్తి మన దిశగా ప్రసరించిందంటే మనం ఈ ప్రేమమైకంలో పడిపోతాము. ఇదొక పరస్పరాకర్షణ......."

ఇలా ఇంకా వాగేవాడేగాని, వెంకటేశ్ ఆపేశాడు. ఇలాంటి వారికి చెప్పి లాభంలేదు, అతిగా పోకుండ చూడాలి - అనుకుని, "ఆఁ, సరేలే.... కానియ్.... ఒప్పుకున్నా" అన్నాడు.

"వెరీగుడ్ ....అందుకేరా మనం ఇంత స్నేహితులం," అన్నాడు. ఆ అమ్మాయి బి. ఎ. మొదటి సంవత్సరం చదువుతూంది. ఒకనాడు స్నేహితుడికి చూపించాడు.

కాస్త బొద్దుగా, తెల్లగా ఉంది. ఆకర్షణీయమైన ముఖం-పొట్టి జడ- సొట్టలుపడే బుగ్గలతో బాగానే కనబడింది. ఆ అమ్మాయి చూసీ చూడకుండా దాటిపోయింది. వాళ్లు చూస్తున్నారని తెలిసికూడ ఏమీ పట్టనట్లు గంభీరంగా నడుస్తూ వెళ్ళింది.

"మొదట్లో అంతేలేరా- ఆ తర్వాత చూడు. మనకోసం ఆ కళ్ళు వెదుకుతాయి....ఎందుకనుకున్నావ్?...."

"ఏమోలే....చేతిలో చెప్పుచ్చుకొచ్చి వెదకవచ్చు."

"ఛట్....నీ కసలేం తెలీదు....పద!" అంటూ స్నేహితుడి భుజంమీద చేయివేసి తీసుకెళ్ళిపోయాడు. ఈ ప్రేమాయణం ప్రోగ్రెస్ తెలుసుకోవాలని ఉన్నా వెంకటేశ్ మౌనం వహించాడు. ఒకనాటి రాత్రి మెలకువ వచ్చిచూస్తే మహీధర్ టేబిల్ ముందు కూచుని బరబరా రాసి పారేస్తున్నాడు. లేచి కూర్చున్నాడు. ఏమిటి రాస్తున్నాడు? ఎస్సేలా? రికార్డులా? ఏమిటి?

అ రాస్తున్న తీరు చూస్తే అనుమానం వేస్తూంది. కాస్త రాయటం, కొట్టి పారేయటం, కళ్ళు పైకెత్తి ఆలోచించటం - ఏమిటిది...? దాని అర్థం స్ఫురించగానే, గట్టిగా నవ్వేశాడు. మహీధర్ చటుక్కున తిరిగి కోపంగా చూశాడు.

"ప్రేమలేఖా?" వెంకటేశ్ లాలనగా అడిగాడు.

"నీకు వ్రాయటం చేతనవునా?"

"ఊహుఁ."

"ఐతే నిదపో. అలా లేచి కూచుని, అపశకునంగా నవ్వకు.... ఈ గంభీరమైన రాత్రిలో, చుక్కల చీరె ముసుగులాక్కుని ప్రియుని దగ్గరకు వెళ్తున్న అభిసారికలా ఉన్న నిశీథిని....చల్లని గాలి వీస్తూ హృదయాన్ని కలవర పెడ్తుంటే- ఈ నిశ్శబ్దతలో నా ఉచ్ఛ్వాస నిశ్వాసాలు నీ కోసం...."

"గుడ్‌నైట్. మనసులో అనుకుంటూ రాసుకో....మన రూం మేట్ మేలుకుని దండోరా వేయగలడు...." అదేం పట్టలేదు మహీధర్‌కు. గొణుక్కుంటూ రాస్తున్నాడు. తెల్లవారగానే ముందర వెంకటేశ్ లేచాడు. అతడి దృష్టిలో పడినది మూలగా సుమారైన రాసి-ఉండలు చుట్టి పారేసిన కాగితాలు! నవ్వుకున్నాడు.

వాటిని ప్రోగుచేసి చిన్నపొట్లంగా చుట్టి తన పెట్టెలో భద్రపర్చాడు.

తెల్లవారాక మహీధర్ లేచి చూశాడు. గది శుభ్రంగా ఉంది. చెత్త ఏమైందని అడగలేదు. వెంకటేశ్ ఎప్పుడూ గది శుభ్రంగా ఉంచుతాడు అని అతడికి తెలుసు. మహీధర్ ముఖం నిద్రలేమిని ప్రస్ఫుటం చేస్తూంది. ఓమాటు పక్కమీద బద్ధకంగా మళ్ళీ పొర్లి, తీరికగా లేచాడు. రాత్రి జరిగిన విషయాన్ని వెంకటేశ్ ప్రస్తావించలేదు.

కొన్నాళ్లు ఈవిధంగా గడిచిపోయినతర్వాత మహీధర్ తను ప్రేమికుడన్నమాట మర్చిపోయాడు.

అతడు మామూలు వ్యక్తిగా మారినతర్వాత, ఓరోజున వెంకటేశ్ మెల్లిగా అడిగాడు, "ప్రేయసి ఏమంటుంది?"

"ఆ....ఆ పిల్లకసలు ప్రేమఅంటే ఏమిటో తెలియదులాగుంది. ఎదుటి వ్యక్తి హృదయవేదన గ్రహించలేని హృదయం! అదెలాంటిదో! పాషాణమే అయిఉండాలి. ఎంతకూ నా తాపత్రయం- నా బాధను- ప్రేమను వెళ్ళబోసుకోవటమేగాని, ఆమెలో రవ్వంతైనా చలనం లేనట్టుంది. పైగా, నన్నుచూస్తే మూతి ముడుచుకుంటుంది - లేదా ఫక్కున నవ్వి వెళ్ళిపోతుంది...."

"బహుశా ఆమె నిన్ను చూసినప్పుడు తన సగభాగం అని గుర్తించి ఉండదు. ఆమెలో ఆ భావం కల్గలేదు కాబట్టి ప్రేమించలేదు. అంతేగా!"

"ఊ" అంటూ, గడ్డాన్ని మునివ్రేళ్ళతో రాచుకుంటూ, దీర్ఘాలోచనలో మునిగిపోయాడు మహీధర్.

"అంత ఆలోచన ఏమిట్రోయ్! మళ్ళీ ఎవరిని ప్రేమించాలా

అనేనా? ఈసారి జాగ్రత్తపడు. వృథాగా రాత్రుళ్లు కూచుని రాని ప్రేమ లేఖలకు జవాబులురాస్తూ పేపర్ తగలెయ్యకు."

"నిజమే....ఈసారి ప్రతివిషయం పరిశీలించి, జాగ్రత్తగా ఆమె హృదయాన్ని గ్రహించి, ప్రేమించాలి."

వెంకటేశ్ నవ్వుకున్నాడు. అన్నింటిలో విజయం సాధించే మహీధర్; హుషారుగా, ఆనందంగా చొరవ చేసుకుని పదిమందిలో మెలిగే అతడు; ఉద్రేకంతో - ప్రతి సమ్మెలో పాల్గొని నోరు అరిగి పోయేలా కేకలేసి తన వాగ్ధాటినంతా ఉపయోగించి, ఉల్లాసంగా ముందంజవేసే విద్యార్థి - మహీధర్ 'ప్రేమ' పథంలో ముందడుగు వేయలేక, చేతకానివాడై పోయాడు. తప్పటడుగు వేశాడు. ఇది సహజమేనేమో అనుకున్నాడు. స్నేహితుణ్ణి చూసి జాలిపడ్డాడు. చిన్న సలహా అందిచ్చాడు వెంకటేశ్: "ఈ సంవత్సరం పూర్తిగానియ్. తర్వాత మనం ఏదో చూసుకోవచ్చు. లేదా, తల్లిదండ్రులే చూస్తారు."

"ఉహూఁ....ప్రేమించి పెళ్లాడాలనుంది. అందులోనే ఉంది ఆనందం; ఆ విరహంలోనే తీయదనం ఉంది. ప్రేమబాట పూలబాట కాకపోయినా ఆ కష్టాలను _ సమస్యలను ఎదుర్కోవాలనుంది."

"మంచిదే. ఇక పడుకుందాం," అంటూ దుప్పటి ముసుగు తన్ని పడుకున్నాడు వెంకటేశ్.

అంతవరకు జరిగిన జీవితంపై ముసుగులాగుకున్నట్టు, మహీధర్ కూడా దుప్పటి లాగుకుని నిద్రకుపక్రమించాడు.



ఆ సంఘటన మహీధర్‌లో ఎటువంటి ముద్రవేసిందోగాని ఆ తర్వాత బుద్ధిగా చదువుకున్నాడు. పరీక్షలు రాసి, ఇళ్ళకి వెళ్లిపోయారు.

ఇంకా రిజల్ట్స్‌రాలేదు. స్నేహితుల మధ్య మామూలుగా ఉత్తర

ప్రత్యుత్తరాలు నడుస్తున్నాయి. ఉన్నట్లుండి ఒకనాడు వెంకటేశ్‌నించి మహీధర్‌కు ఉత్తరం అందింది. ఉత్తరం చదివి అతను విస్తుపోయాడు. అందులో విశేషం ఇది- వెంకటేశ్‌కు పెళ్ళి నిశ్చయమైంది....వధువు స్వంత మరదలుపిల్లే. పేరు నాగరత్నమ్మ. ఐదో క్లాసువరకు చదువు కుంది. అందరికీ ఇష్టమైన సంబంధం. చిన్నప్పటినించి అనుకుంటు న్నదే. "నాకు కూడ అభ్యంతరం లేదు. ఏదెలా ఉన్నా అందంగా ఉంటుంది," అని రాశాడు.

"హయ్యో...." అని నెత్తిబాదుకున్నంత పనిజేశాడు మహీధర్.

"మై డియర్ బోయ్! యూ మిస్ ఎవ్రి థింగ్!" అంటూ ఉత్తరాన్ని పునఃపునః చదువుకుంటూ డీలాపడిపోయాడు.

జవాబుగా, ఇల్లా రాశాడు: "...నాకు తెలుసురా, నువ్వు వట్టి దద్దమ్మవి. ఐదో క్లాస్ చదువుకున్న పిల్లనించి ఏ మాశించ గలవు నువ్వు? ఉద్యోగరీత్యా పట్టణాలకి పోతే చదువుకుని, అధునాతనంగా అలంకరించుకుని, సీతాకోకచిలుకల్లా అందంగా తిరిగే పడతులతో తులతూగ గలదా? నీ బుద్ధి వికాసానికి తగి నట్టు నీతో సరదాగా సంభాషించగలదా? నీ సరదాలతో, నీప్రవర్తనతో సరితూగ గలదా? పార్టీలకు, ఉపన్యాసాలకు, దానికీ దీనికీ నీతోవచ్చి - నీప్రక్కన కూచుని ఎంజాయ్ చెయ్యగలదా? అప్పుడు నువ్వు.... 'ప్చ్'- ఇప్పుడు అనుకుని ఏంలాభం! చదువుకోనిపిల్లని జేశారని నువ్వు ఆ సమయంలో మీ ఇంట్లోవాళ్ళందరినీ తిట్టుకుని లాభంలేదు. ఇతర స్నేహితుల చదువుకున్న భార్యలదగ్గర ఈమె నా భార్య అని చెప్పగల్గే ధైర్యం ఉందా? మామూలుస్త్రీగా అలంకరించుకుని నీప్రక్క నడుస్తూంటే - అందరూ వింతగా చూస్తూంటే సిగ్గువెయ్యకుండా ఉంటుందా....? ఏమిత్రా....పల్లెటూరిపిల్లను చేసుకున్నానని అప్పుడు వాపోతావేమో! అన్నీ ఆలోచించుకో....! బాగా తీక్ష్ణంగా ఊహించి చూడు, నా మాటల్లో ఏదైన అబద్ధం ఉందేమో! నిన్ను పదేపదే హెచ్చ రిస్తున్నాను. తొందరపడకు!"

వెంకటేశ్ ఒక మాటు కాదు, పది సార్లు చదువుకున్నాడు మిత్రుడి ఉత్తరం. మొదటిసారి చదివి, తేలికగా నవ్వేశాడు. కానీ,

తరువాత చదివినకొద్దీ అందులో దాగినసత్యం క్రమంగా బహిర్గతం అవుతూంది. సీరియస్‌గా ఆలోచించటం మొదలుపెట్టాడు. నిజమే, మహీధర్ మాటల్లో సత్యం లేకపోలేదు. కొన్నాళ్లుపోయేక ఈ పెళ్ళి జరక్కుండాఉంటే బావుండేది అనుకోకుండా ఉండగలడా తను? ఎంత పొరపాటు చేశానని పరితపించకుండా ఉండగలడా? ఆలోచించేకొద్దీ అధైర్యంతో కృశించుకుపోయాడు. కాని, తను పెద్దలమాటకి ఎదురు జెప్పేస్థితిలో లేడు. పెళ్లిపనులు చకచక జరుగుతున్నాయి.

ఇక మూడురోజులకు తనొక ఇంటివాడవుతాడు.

'నాకొద్దు!' అనటానికి చాలా దమ్ములుండాలి. అవే లేవు తన దగ్గిర.

'పోనీయ్' అనుకుని విధికి తలొగ్గదలచుకున్నాడు.

పెళ్ళికి మహీధర్ ఒకరోజుముందుగానే దిగాడు. ఏకాంతంగా స్నేహితుణ్ణి చూచినవెంటనే అడిగాడు- "ఆలోచించావా?" అని.

"ఊ." గొణుక్కున్నాడు.

"ఐతే ఇదేమిటి?" పరిహసిస్తున్నట్టుంది కంఠం.

"నాకు వద్దనటానికి ధైర్యం చాల్లేదు."

"అఘోరించు" అంటూ మాట మార్చేశాడు మహీధర్.

పెళ్ళి నిర్విఘ్నంగా అట్టహాసంగా జరిగిపోయింది.

'నాగరత్నం అందంగానే ఉంది — పోనీలే పాపం —' అనుకున్నాడు మహీధర్.

స్నేహితుడి ముఖంలో కనబడిన తృప్తిని చూసి వెంకటేశ్ అతడు అంగీకరించాడని సంబరపడిపోయాడు.

"విష్ యూ బోత్ ది బెస్ట్ యిన్ యువర్ మేరీడ్ లైఫ్!" అని స్నేహితుడి చేయిపట్టుకుని మనస్ఫూర్తిగా విష్ చేస్తుంటే, వెంకటేశ్ హృదయం తేలికపడింది.

"చెల్లెమ్మా!" అంటూ తెలుగులో ఆమెను ఆశీర్వదించి చిన్న వెండిపళ్ళెం ఆమెకు, కొన్ని పుస్తకాలు వెంకటేశ్‌కు బహూకరించాడు.

నాగరత్నానికి పధ్నాలుగు సంవత్సరాలు నిండలేదు. కాని,

చెల్లెమ్మా - అంటూ ప్రత్యేకంగా తన్ను సంబోధించిన వ్యక్తిమీద వెంటనే గౌరవం - అభిమానం పెంచుకుంది.

పెళ్ళిసందడి తగ్గిపోయింది. మహీధర్ వెళ్ళిపోయాడు.

వెంకటేశ్‌కు చదవడమా- లేక, పల్లెలో ఉండి తండ్రికి సాయ పడటమా- లేక, ఉద్యోగంలో, జేరడానికి వేరే ఊరు వెళ్లటమా- అన్న సమస్యలు ఎదురయినై.

వాటిని పరిష్కరిస్తూ మహీధర్‌నించి ఉత్తరం వచ్చింది.

"నేను వాల్తేరు వెళ్తున్నా, ఎం. ఎస్. సి. కి సీట్‌కోసం. రేపు రిజల్ట్స్ వస్తాయి. వెంటనే ప్రయత్నించాలి మనం. నాన్నగారి స్నేహితు లున్నార్లే........"అంటూ రాశాడు.

ఆ 'మనం' అన్నమాట వెంకటేశ్ భవితవ్యాన్ని నిర్ధారణ చేసేసింది.

ఉత్తరంలోని విషయాన్ని తండ్రికి ధైర్యంగా చెప్పగల్గాడు. ఆయన కిష్టంలేదు. మామకు అంతకన్నా లేదు. ఇంట్లో ఎవ్వరూ సుముఖంగా లేరు. కాని, అతడి ఉత్సాహాన్నిచూసి ఎవ్వరూ వద్దు-అని అదేశించలేకపోయారు.

చిటికెలు వేసినట్లుగా పాసవటం - వాల్తేరులో సీటు రావటం - అక్కడికి వెళ్లి యూనివర్సిటీలో జేరిపోవటం, అన్నీ జరిగిపోయినయి.

నూత్న వాతావరణం, అందమైన భవనాలు, విశాలమైన ఆవర ణాలు, అందులో చలాకీగా తిరిగే అబ్బాయిలు, చిలుకల్లా సీతాకోక చిలుకల్లా అలంకరించుకుని, గుంపులు గుంపులుగా తిరిగే అమ్మాయి లతో నిత్యకళ్యాణం పచ్చతోరణంలా కలకలలాడే యూనివర్సిటీ ప్రాంగణంలో అడుగుపెట్టటమే భాగ్యంగా భావించాడు వెంకటేశ్. అదంతా మహీధర్ పుణ్యం అనుకున్నాడు.

హాస్టల్‌లో జేరిపోయి కొంత అలవాటు అయ్యేసరికి వారం పది రోజులు పట్టింది. పెళ్ళయినట్లు ఫీలవుతూ వెంకటేశ్ మర్యాదగా తన చుట్టూ ఒక గిరి గీచుకుని అందులోనే విహరించేవాడు. కాని, మహీ ధర్‌కు అటువంటి అభ్యంతరాల్లేనిమూలాన హాయిగా, స్వేచ్ఛగా అమ్మా

యిలవంక చూడటంమొదలు చిలిపి రిమార్క్‌లు చేస్తూ, ఏదో సాకుతో పలుకరించి, వారితో ఫ్రీగా మాట్లాడటంవరకు సాగిపోయింది.

పెళ్లికాకముందు వెంకటేశ్‌కు ఏవేవో భయసంశయాలు కల్పించాడు గాని, ఇప్పుడు అతడు పెళ్లిచేసుకోకుండాఉంటే బావుండేది - అని వెంకటేశ్ బాధపడకుండాఉండేలా చూసేవాడు.

"నీ పనే బావుందిరా. అంతా సెటిల్ అయిపోయింది. ఇక పరస్త్రీవైపు కన్నెత్తిచూడకుండా సిన్సియర్‌గా, సీరియస్‌గా చదవగలవు. టైం వేస్టుకాదు. ఇకమీదట యూనివర్సిటీకి వచ్చేవారి క్వాలిఫికేషన్స్‌లో పెండ్లయినవాళ్లకే ప్రిఫరెన్స్ ఇస్తాం అంటే....వహ్.... ఎంత బావుంటుందో! సగం గొడవలు తగ్గిపోతాయి," అనేవాడు.

వెంకటేశ్ పదిమందిలో తిరిగేరకంకాదు. మితభాషి.అదొహలాంటి మనఃప్రవృత్తిగలవాడు కాబట్టి ఆట్టే బాధపడలేదు. "నాకు పెళ్ళవకపోయినా నీలా చొరవజేసుకుని కలిసిమెలిసి తిరిగే ధైర్యం నాకు లేదులే! అందుకని అయిందని బాధపడను. నువ్వుమాత్రం జాగ్రత్త. ఎన్నితిరుగుళ్ళైనా తిరుగు, ఎంతైనా వాగు- ఎందరినైనా ప్రేమించు - కాని, చదువులో వెనకబడితేమాత్రం నేను నువ్వునుకునేటంత పిచ్చి నాగన్ననుగాను, జాగ్రత్త - గుర్తుంచుకో!" అన్నాడు. ఈ చివరి మాట లంటూన్నప్పుడు గంభీరమైన ముఖంపెట్టి తీక్షంగా స్నేహితుడి ముఖంలోకి చూశాడు.

మహీధర్ నవ్వలేదు. మెల్లగా అతణ్ణి సమీపించి రెండు భుజాల మీద తన రెండు చేతులూ వేసి సీరియస్‌గా చూస్తూ అన్నాడు: "నువ్వు నాకు గార్డియన్ ఏంజల్‌గా ఉంటావన్న ధైర్యంతోనే ఈ మహాసముద్రంలో పడ్డాను. చదువులో వెనకబడ్తే నీ పడవలోకి ఎక్కించుకుని రక్షించు."

ఇద్దరూ కొన్ని క్షణాలు అలా చూసుకున్న తర్వాత, ఫకాల్న నవ్వేశారు. బిగిసిన వాతావరణం సడలినట్టయింది. ఇద్దరూ తీరికగా చెరోకుర్చీలో కూచున్నారు.

బల్లమీద రెండు ఇన్‌లాండ్ కవర్లున్నాయి.

తండ్రికి - మామగారికి వెంకటేశ్ వ్రాసిన ఉత్తరాలవి.

"మరి చెల్లెమ్మకు రాయలేదేంరా?"

నవ్వి ఊరుకున్నాడు.

"ప్చ్ - ఈ పెద్దవాళ్లకేమీ తెలీదు. భార్యకుగూడ రాసుకో నివ్వరు- ఇక ప్రేయసికి ప్రేమలేఖ లేం రాసుకోనిస్తారు?" అంటూ పెదవులు విరిచాడు.

వెంకటేశ్ మిత్రుడి వాలకం చూసి నవ్వకుండా ఉండలేక పోయాడు.

భూమి తన చుట్టూ తాను తిరుగుచూ, తాను సూర్యునిచుట్టూ తిరుగుచూ - చంద్రుణ్ణి తన చుట్టూ త్రిప్పుకొనుచూ సాగిపోవును అన్నంత సాధారణంగా దినాలు గడిచిపోతున్నాయి. మహీధర్‌కూడా తన కాలాన్ని ఇలాగే గడుపుతున్నాడు. వెంకటేశ్‌మాత్రం అదృశ్య మైన శృంఖలాలతో స్నేహితుణ్ణి తనదగ్గిరకు రప్పించుకుంటూ, చదువు కుంటుబడకుండా జాగ్రత్త పడ్తున్నాడు.

ప్రేమలో పడినట్లులేదు అని ప్రతిరోజు రాత్రి వెంకటేశ్ అనుకునేవాడు. "ఫరవాలేదు - ఇలాగే సాగితే ఎంత బాగుండును!" అనుకున్నాడు ఆవేళ.

అతని ఆశలు ఫలించినట్లే ఉంది. దాదాపు సంవత్సరంవరకు తన మిత్రుడు ఏ గొడవల్లోనూ పడలేదు. ఆ సంవత్సరం పరీక్షలు రాసి ఇంటికెళ్తున్ననాటికి మహీధర్ హృదయం ఎవరికీ దత్తం కాలేదు.

# 4

సెలవలకు ఎవళ్ళ ఇళ్ళకి వాళ్లు వెళ్ళిపోయారు.

వెంకటేశ్ నాల్గురోజులు పోనిచ్చి మామగారింటికి బయలు దేరాడు. భార్యనుచూసి ఆరు మాసాలవుతూంది. ఆమెను చూడాలని ఆత్రపడ్తున్నాడు.

స్వంత మేనమామ. అల్లుణ్ణిచూసి ఆదరంగా ఆహ్వానించాడు.

"అంతా క్షేమమా? అక్కా- బావ బాగున్నారా? ఎప్పుడొచ్చావు విశాఖ పట్నం నించి?" అని ప్రశ్నిస్తూనే అల్లుడి అవసరాలు తీరుస్తున్నాడు.

జవాబులు చెబుతూ, కళ్లను ఓసారి చుట్టూ త్రిప్పిచూస్తున్నాడు వెంకటేశ్. అవతలి గుమ్మంలో మనిషి నుంచున్న గుర్తుగా గాజుల సవ్వడి వినబడింది. ఆ సన్నని శబ్దం అతనిలో అనూహ్యమైన బాధను రేపింది! ఏమిటా సందడి? హృదయంలో ఆరాటం ఎందుకో! కాళ్ళు కడుక్కొని లోపలికి వెళ్లాడు- తలుపు చాటునించి నాగరత్నం టవల్ అందించింది. సుకుమారమైన తెల్లని చెయ్యి- నిండుగా ఎఱుపు గాజులు, బంగారు గాజులతో మెరిసిపోతోంది. అలా అందుకుని ఒక్కసారి హృదయానికి హత్తుకోవాలనిపించింది,

"ఎందుకమ్మా - అంతసిగ్గు? బావేగా-వెళ్లు" అంటూ తల్లి మెల్ల మెల్లగా మందలిస్తోంది.

"పానకంలో పుడకను- నేనెందుకు?" అనుకుని పెద్దమనిషి- మెల్లగా జారుకున్నాడు మామగారు.

నాగరత్నం కాస్త ధైర్యాన్ని పుంజుకుని కాస్త ఇవతలి కొచ్చింది. భర్త కళ్ళలోకి ఒక్కక్షణంచూసి సిగ్గుతో తలవంచుకుంది.

టవల్‌తో తుడుచుకోవటం పూర్తయినా దాన్ని అందివ్వకుండా భార్యను గమనించాడు. మధ్య పాపిడితీసి వాళ్లమ్మ బిగించి జడ వేసింది. నాగరం గజ్జెలు కనబడ్తున్నాయి. చెవులకు ఏడురాళ్ళ కమ్మలు, మెడలో రెండు వరుసలు పెద్దరకం నల్లపూసలు, నాల్గుపేటలో ఐదు పేటలో చంద్రహారం, ఒక రాళ్ళ నెక్లెస్- ఆమెకు ఊపిరి సలపనివ్వ నట్లున్నాయి. ముదురు రంగు నెమలి పింఛం రంగు సరిగంచు నేత చీర - ఎన్ని గజాలో! మోయలేక మోస్తున్నట్లుంది. ఆ కట్టిన తీరు బావులేదు. అంత చీరకట్టుకొకపోతే పరికిణీ, ఓణీ వేసుకుంటే బావుండే దేమో!

అలా టవల్‌తో ముఖాన్ని ఒత్తుకుంటూ భార్య ముఖాన్ని పరీక్షగా చూశాడు.

ఈ ఆరునెలల్లో నిండుదనం దాల్చింది ముఖం.

ఆ బుగ్గల్లోని నిగ్గుల్లో సిగ్గులు, ఆ పెదిమలమీది అరుణిమలో

మధురిమ,ఆ భ్రూవిలాసం,ఆకర్ణాంత నేత్రాలలోని విభ్రమం, మొనదేరిన గెడ్డంచూసి క్షణం తనను తాను మరచిపోయాడు. భర్త శల్యపరీక్షకు సిగ్గు దొంతరలచాటున నక్కుతూ టవల్ లాక్కుని తుర్రుమని పారిపోయింది నాగరత్నం. కాసే, పదినిమిషాలకు మళ్ళీ కాఫీ ఫలహారం తెచ్చింది. 'ఫరవాలేదు, ఈ పెద్దలకు కొన్ని విషయాలు తెలుసు' అనుకుని తృప్తిపడ్డాడు వెంకటేశ్.

కాఫీ గ్లాసు బల్లమీదపెట్టి నుంచుంది.

"కూర్చో!" అన్నాడు.

ఆమె కూర్చోలేదు.

ఒక గారె తను తీసుకుని, మరోటి ఆమె కందించాడు. ఆమె తీసుకోలేదు.

"ఎవ్వరు లేరులే, తిను."

"ఉహూ" అంటూ దూరంగా జరిగింది.

"ఐతే, రాత్రికి వెళ్ళిపోతాను-నన్నెందుకు రమ్మనాలి?" కనుబొమలు ముడిపెట్టి అడిగాడు.

ఆమె బెదరిపోతూ చూసింది.

"నాన్నగారు....రాశారు, కాని....నాకూ....మిమ్మల్ని చూడాలనిపించింది!" కాస్త దగ్గరగా వచ్చి మెల్లగా అంది.

వెంకటేశ్ నవ్వేశాడు. పాపం- ఎంత బెదరిపోయిందో! తను ఆమెనించి ఇంతకన్నా చనువు కోరటం అసహజమే. ఆమె పెరిగిన వాతావరణం అలాంటిది. తీసుకోమనగానే, తీసుకుని తినటం అమర్యాదకరంగా ఉంటుంది. సినిమాల్లోలా- లేక, ప్రేమికుల్లా కలిసి తింటూ ఆనందించటానికి ఇంకా సమయం రాలేదు అనుకున్నాడు.

"చూశావుగా-వెళ్ళనా?" చిలిపిగా చూస్తూ అడిగాడు. అలాంటి చూపుల్నే ప్రసరింపజేస్తూ, "ఊఁ-వెళ్ళి రండి!" అంటూ ఫక్కున నవ్వింది.

లోపలినించి తల్లి మందలిస్తున్న దానిలా "రత్నా!" అని హెచ్చరించింది.

నాలిక కఱచుకుని కొంగు అడ్డం పెట్టుకుంది.

"ఆ చీర బాగులేదు. ఎన్ని గజాలేమిటి? ఇందులో మునిగి పోయావు."

రత్న నిలువునా చూసుకుంది. "అమ్మ కట్టుకోమంది" అన్నది.

"ఓహో" అనుకున్నాడు.

"రోజంతా ఏం చేస్తూంటావు?"

"అమ్మకు సాయం చేస్తాను."

"తీరిక వేళల్లో?"

"ఏమీలేదు. ఎప్పుడైనా ప్రక్కింటినించి చందమామ తెప్పించుకుని చదువుతాను."

వెంకటేశ్ ఎంతో విచారించాడు. కాని, ఆమెను ఏమి అనలేదు.

"రత్నా! చదువుకోకూడదూ?"

"నేనా? ఎలా?" అదేదో జరక్కూడని విషయమైనట్లు ప్రశ్నించింది.

"ఎలా ఏమిటి? పుస్తకాలు తెప్పించుకుని చదువు. అంతే. ఏ పరీక్షకు కట్టక్కర్లేదు. లోకజ్ఞానం అభివృద్ధి పర్చుకుంటే నీకేమంచిది."

"నాకెవరు కొంటారు? నాన్న పట్టించుకోరు."

"నేను కొని పంపుతాను, చదువుకుంటావా?"

"ఓ...." అంది ధైర్యంగా.

పెద్ద సమస్య పరిష్కారమైనంతగా ఆనందించాడు వెంకటేశ్.

"నాకు ఉత్తరాలు రాయవెందుకు?"

"రాయటానికేముంది?... సిగ్గు...." అంటూ ముఖం త్రిప్పుకుంది. "నాన్నను-కవరు అడగటానికి-భయం!"

వెంకటేశ్ నిట్టూర్చాడు. అంతే మరి- ఏం రాస్తుంది? బహుశః రాసినా - 'శ్రీవారి పాదపద్మములకు....' అంటూ రాసి, 'నేను క్షేమం-మీ క్షేమం తెలుప గోరుచున్నాను....మీరు పంపిన పుస్తకాలు సగం చదివాను... ఇప్పట్లో పంపకండి....ఇట్లు మీ చరణదాసి....' ఈ పక్కిలో నడుపుతుందేగాని అంతకన్నా ఏం రాయగలదు? అంత మాత్రానికి రాయటం దేనికి?

మంచిదే. రాయనంటే మంచిదే - అనుకున్నాడు.

"మీకు కోపం వచ్చింది. రాస్తాను లెండి."

"వద్దు....ఏదో తమాషాకు అడిగాను," అంటూ —

ప్రేమమాట ఎత్తని లేఖల విషయం మర్చిపోవాలనుకున్నాడు. ఏదో మాట్లాడాలి మరి.

"సాయంత్రం అలా చెరువు గట్టుకేసి వెళ్దామా?"

"అమ్మో! మీరు వెళ్ళండి. నన్ను పంపరు." భయం భయంగా అంది.

'భలే - ఏం మనుష్యులు!' అనుకున్నాడు.

ఐనా, తాను అడగటంలో అర్థంలేదు. ఇది పల్లెటూరు. తగినట్లు మసలాలి.

మనసులోనే 'ప్చ్' అనుకున్నాడు.

"మహీధర్ - నిన్ను మరీ మరీ అడిగాడు. నిన్ను విశాఖపట్నం తీసుకురమ్మన్నాడు."

"ఐతే....మరి ఎప్పుడు తీసుకువెళ్తారు?" ఆతురతతో అడిగింది.

వెంకటేశ్ విస్తుపోయి చూశాడు.

'ఫరవాలేదు. నాగరత్నం తను అనుకుంటున్నంత అమాయకురాలు కాదు,' అనుకున్నాడు.

భర్త జవాబుకోసం నిరీక్షిస్తూ సూటిగా చూసింది,

"ఇప్పుడే కాదులే. ఎలా తీసుకెళ్తాను? చదువు సాగొద్దూ! క్రొత్త ఊళ్లో - అందులోనూ విశాఖపట్నంలో సంసారం పెట్టటం మాటలుగాదు!"

రత్నం నిరాశపడిపోయినట్లు ఆ ముఖం చెబుతూంది. ఏమీ అనలేక విస్త్రాణతో తలదించుకుంది.

"కోపం వచ్చిందా?"

"లేదు....నిజమే....మీరు తీసుకెళ్తానన్నా అమ్మా వాళ్లూ పంపరు. ఏమిటో....నా....ఆత్రం!" గొణిగింది.

"పోనీ....దసరా సెలవలకు రాకూడదూ? అన్నీచూసి వద్దువుగాని. తోడు ఎవరైనా వస్తారులే."

"ఊఁహూ. పంపరు."

"ప్చ్" అన్నాడు. ఒకవైపు పెద్దలమీద కోపం- ఓవైపు తన మీద తనకే కోపం - రత్నమీద కోపం. కానీ, ఏం చెయ్యగలడు?

"ఏం చేద్దాం? చదువు పూర్తికాకుండా కాపురం పెట్టేది వట్టిదే! ఎలాగో ఈ రెండేళ్లు గడపాలి. ఒక ఏడాది అయేపోయింది."

బైట చప్పుడైతే గ్లాసూ, పళ్ళెం తీసుకుని లోపలి కెళ్లి పోయింది రత్నం.

మామ లోపలి కొచ్చాడు.

"ఆ....మరి అక్కా- బావ ఏమైనా కబురు బెట్టారా?....అదే అమ్మాయి విషయం...."

"ఏంలేదు. నాకు ఉద్యోగం దొరికేవరకు ఏ ప్రయత్నాలు వద్దని చెప్పేశాను."

"ఆఁ....సరే....!"

ఆ తర్వాత సంభాషణ మామూలుగా జరిగింది.

రెండు రోజులుండి మూడవ నాడు తన ఊరు జేరాడు. వేసవి కాలం. కత్తెర ఎండలు. ప్రకృతి కాంత నీరుకావిపట్టిన వస్త్రాలు వేసుకున్నట్లుంది. చెట్ల ఆకులు దుమ్ముకొట్టుకుని పచ్చదనాన్ని కప్పి వేసుకున్నాయి. పొలంపనులు అయిపోయి కర్షకులూ, పశువులూ విశ్రాంతి తీసుకునే సమయం అది. పగలంతా ఇళ్ళల్లో - సాయంత్రాలు అలా తిరిగిరావటం - అందరికీ మామూలే. స్త్రీలు గుంపులుగుంపులుగా నీళ్ళబావులదగ్గఱజేరి ఉన్నవీ లేవివీ చెప్పుకుని తృప్తిజెంది ఆనందించే వారు. వెంకటేశ్‌కు ఇతర వ్యాపకాలు లేనందువల్ల వార్తాపత్రికలు, మేగజీన్లూ చదివినతర్వాత తన పుస్తకాలు చదువుకుంటూ గడిపేవాడు.

మహీధర్‌నించి క్రమంగా ఉత్తరా లొచ్చేవి. తనుగూడ రాసే వాడు.

"నీ ఉత్తరాలూ చప్పగానే ఉంటాయిరా బాబూ!" అని మొత్తు కునేవాడు మహీధర్.

దానికి నవ్వుకునేవాడు వెంకటేశ్.

"ఇక్కడికొచ్చి చూడు. ప్రకృతిలో కలకలం లేదు. ఏ శోభా లేదు. నా స్నేహితులంతా రైతుబిడ్డలు, కొద్దో గొప్పో చదువుకున్న

వారు. వాళ్ళ సంభాషణ ఎంతసేపూ పొలాలు - పంటలు - ఎవరి కెంత పంట రాలింది- ఊరి రాజకీయాలు- క్రొత్త సినిమాలో మోటు హాస్యం తాలూకు కొటేషన్స్ - అదీ వారి లోకం. వారితో కొంతసేపు అదే స్థాయిలో సంభాషించి ఇంటికొస్తాను. రాయటాని కేముంటుంది? చప్పగా ఉండక తీయగా ఎలా ఉంటాయి? పోనీ....నీలా కవిత్వంరాద్దామంటే కిటికీలోంచిచూస్తే కళ్ళుమూయించేస్తుంది ఎండ. ఇక మధురమైన భావాలు- ఉద్రేకం ఎక్కడినించి వస్తయి?...." అని రాస్తే—

"ఈసారి నీ ఉత్తరం కాస్త కాలక్షేపం కల్గించింది," అంటూ రాశాడు మహీధర్.

అంటే ఏదో ఒకటి రాయాలన్నమాట, సోది రాసినా ఆనందమేనేమో అనుకున్నాడు వెంకటేశ్.

పెద్దలు మాత్రం తన ఒంటరితనాన్ని గుర్తు తెస్తున్నట్టు "ఏమయ్యా - ఇంకా చదువై పోలా?" అని ముసిముసిగా నవ్వేవారు. "కాలేదండీ!" అంటే—

"అయ్యో - పోనీ, ఓ ఇల్లు అద్దెకు తీసుకుంటే...."

"అదంతా కుదరదు లెండి. క్రొత్త ఊరు - పట్నవాసం - ఈ సంవత్సరంతో అయిపోతుంది."

"ఊఁ" అనుకునేవారు.

ఇలాంటి జవాబులు చెప్పలేక విసుక్కునేవాడు. కోపంకూడ వచ్చేది.

అక్కలు, బావగార్లు అంతావస్తే ఇంట్లో సందడిగా ఉంది.

"నాగరత్నాన్ని రమ్మని రాయకూడదూ!" పెద్దక్క సలహా.

"మావయ్య, అత్తయ్యకూడా వస్తే బావుంటుంది. చాలా రోజులైంది చూసి." అన్నగారిమీద అభిమానంకొద్ది, చూడాలన్న ఆశతో వెంకటేశ్ తల్లి అంది.

"ఎవ్వరూ వద్దు. ఈ ఎండాకాలం ఇలాంటివేం పెట్టకండి. కావలిస్తే నే వెళ్ళిపోయింతర్వాత పిల్చుకోండి."

"ఆహా....కోపం వచ్చింది.- ఎందుకో!" అంటూ చిన్నక్క కనుబొమలెగరేసి చేయి గడ్డంమీద పెట్టుకుంది. చేరినవారంతా ఫకాల్న నవ్వేశారు.

వెంకటేశ్ ఉడుక్కో లేదు. తనూ నవ్వేశాడు.

"మొన్ననే చూసివచ్చాను. ఏదడిగినా సరిగ్గా జవాబు చెప్పదు. చదువుకోమంటే అంతఇష్టంఉన్నట్లు లేదు! ఏమాటచెప్పినా అమ్మా-నాన్న అంటుంది - ఆ స్టేజ్ - అంటే, ఆ పరిస్థితులు - బాగా దాటిపోయే వరకు చూడగూడదనుకున్నాను. ఈ పల్లెల్లో - ఈ వాతావరణంలో ఇంతకన్నా ఆమె ఏమీ చెయ్యలేదు."

"ఏవిట్రోయ్! పట్నంలో చదువుకుంటున్నావుకాబట్టి పల్లెటూరి పిల్లను అంత చులకనగా మాట్లాడుతున్నావు. పట్నంపిల్లల్లా ఉండా లంటావా?" పెద్దక్క మందలించింది.

"చులకనజేయటంలేదు. కొన్ని మంచి అలవాట్లు అలవర్చు కోమన్నాను. అంతే."

"అంటే....నీ జాబితాలో మంచి అలవాట్లు అంటే—ప్రేమ ఒలకబోస్తూ నీకు ఉత్తరాలు రాయటం - నీతో చెట్టపట్టాలువేసుకుని షికార్లకిరావటం - కాలేజీకెళ్ళివస్తూ ఆపైన ఈకాలపు నవలలు చదువు కోటం—ఇలాంటివేగా....?" పెద్దబావ హాస్యమాడాడు.

వెంకటేశ్‌కి ఒక్కక్షణం నోరు తడారిపోయింది. విస్తుపోయి చూశాడు.

ఆ విషయాలన్నీ వీళ్ల కెలాదెలిసినయ్? అంటే....నాగరత్నం ....తమమధ్య జరిగిన సంభాషణఅంతా వివరించి చెప్పేసిందన్నమాట. 'ఏమన్నాడే?' అని ముద్దుముద్దుగా అడిగివుంటారు - అన్నీ చెప్పింది. పెద్దక్కావాళ్ళకు- మామయ్యకు రాకపోకలు ఎక్కువ. అందరు కూచుని విని వ్యాఖ్యానించి వదిలుంటారు. ఐనా దానికి బుద్ధుండక్కర్లేదూ!

కానీ, తన ఆగ్రహాన్ని అదుపులోపెట్టుకుని ముఖాన్ని ప్రశాంతంగా జేసుకుని గంభీరంగా అన్నాడు: "నిజమే బావా! అవన్నీ నా దృష్టిలో మంచి అలవాట్లే. ఊరికే కాలం వృధాచేయటంకన్నా, చంద మామ చదివి తృప్తిచెందటంకన్నా, ఉత్తమమైందిలేదని అనుకోటం

కన్నా మూర్ఖత్వం లేదు. ఆమెను నాకు అనుకూలమైనరీతిలో మలచు కోవాలనుకోవటంలో తప్పేముంది?"

"ఆ....అంతేలే. నువ్వెలా మార్చుకుంటావో మాకెందుగ్గాని ఆ పిల్లనుమాత్రం కష్టపెట్టి ఇరకాటంలో పడెయ్యకు. దీనికంతా చాలా కాలంపడ్తుంది." చిన్నబావ అన్నాడు.

"ఔను. సినిమాల్లో మంత్రించినట్లు నేనేం మంత్రం చేయ బోవటంలేదు. కాలానికి విలువ ఇస్తాను. వ్యవధి ఇస్తాను. ఆమెకు కావలసినంత టైం ఇస్తాను."

అదంతా వింటున్న తండ్రి హృదయంలో మారుమూల చిన్న అనుమానం అంకురించింది. చదువులేనిపిల్లని - పల్లెటూరిదని - వీడి కసంతృప్తిగాని కల్గలేదుగదా! ఏమో - కల్గినా- అందులో ఆశ్చర్యంగాని, అసందర్భంగాని లేదు అనుకుని సరిపెట్టుకున్నాడు.

సెలవలయిపోయి తిరిగి విశాఖపట్నం బయలుదేరిననాడు వెంకటేశ్ అనిర్వచనీయమైన ఆనందానికి లోనయ్యాడు. చదువు- మహీధర్ - ఆ స్నేహంలోని ఆనందం - ఆ నూతనవాతావరణం తనకు పెళ్ళయినట్లు మరపింపజేస్తుంది. కొన్నాళ్లు హాయిగా దినాలు గడిచి పోతాయి-

అనుకుంటూ వాల్తేరులో దిగాడు.

స్టేషన్‌లో మహీధర్ కాచుకొనున్నాడు, నోట్లో సిగరెట్‌తో. దిగుతున్న వెంకటేశ్‌నుచూసి కౌగలించుకున్నంత పని జేశాడు.

"చెల్లెమ్మ క్షేమంగా ఉందా! కూడా వస్తుందేమో అను కున్నాను."

"తీసుకు రావలసింది సుమా! నీ ఆటలు కట్టిపెట్టేది. ఎందుకూ- రేపు వైర్ ఇవ్వనూ!"

"మా బాబుగా- వద్దులే. చాలా అడిగేనని రాయి. కావలిస్తే పన్లో జేరగానే చీరకొని పెడ్తానన్నానని రాయి. ఇదంతా, రాకుండా ఉంటేనే సుమా!" ఇద్దరూ నవ్వుకున్నారు.

కూలీ సామాను వెంట తీసుకురాగా బైటికి నడిచారు.

అంతే. మహీధర్ మానుపడిపోయి గ్రుడ్లప్పగించి ఎదుట నుంచున్న వ్యక్తులకేసి చూస్తున్నాడు. సామాను భద్రంగా తీసుకెళ్తున్నాడో లేదో అని కూలీని గమనిస్తూ వెళ్తున్న వెంకటేశ్, అతను నిలబడి పోవటం గమనించలేదు. రిక్షాలో సామాను పెట్టించి తిరిగి చూస్తే- లేడు. ఏమయి పోయాడా అని-చుట్టూ కలియజూశాడు. అప్పుడే హడావిడిగా తనవేపు వస్తున్న మహీధర్‌నుచూసి 'హమ్మయ్య!' అనుకున్నాడు.

"ఏమిటి-క్షణంలో మాయమయ్యావు?"

"ఒకానొక - అతి సుందరమైన స్వాప్నిక జగత్తులోకి.... కాదు కాదు....ఇక్కడే....అదో- ఆ స్థలంలోనే నా హృదయం మాయమైంది."

"బాన్లే. మాయమయే ఉన్నట్టుంది. అందుకే అంత పిచ్చిగా వాగుతున్నావు. ఏమైంది?"

ప్రయాణపు బడలికలో విసుగు జెందిన స్నేహితుడి భుజం ప్రేమగా తట్టాడు. "ఐ మిస్ద్ వన్ హార్ట్ బీట్."

"ఐతే ఇంకా నిలబడే ఉన్నావేం?...." తెచ్చికోలు ఆశ్చర్యాన్ని ప్రదర్శించాడు.

"వెంకటేశ్! ...ఒరేయ్ ...ఒక చక్కని అమ్మాయిని చూచాన్రా. ఎవరో పెద్ద మనిషి వెంట వచ్చింది. ఆయన పేరు డాక్టర్ యం. యస్. ఆర్. రావు ఫ్రమ్ గుంటూర్ టు వాల్తేర్ ..."

"అవన్నీ ఎందుకు _ ఆ అమ్మాయి పేరు?"

"శానాసేపైంది దండీ, బాబుగోరూ...." రిక్షా అతడు తన బాధ వెళ్ళబోసుకున్నాడు.

"సర్లే. ఎక్కుతున్నాం" అంటూ ఎక్కారు.

"అమ్మాయిపేరు.... తెలీదు."

"బ్రతికించావు."

"నేను చస్తున్నా!....ఎంత అందంగా ఉందనుకున్నావు. అబ్బ....చూసి తీరాలి....బంగారు బొమ్మలా ఉందనుకో. ప్రయాణపు బడలికతో అలసిన ఆ ముఖం వాడి అందంగా కనబడింది. నిద్రలేక

బరువెక్కిన ఆ కనురెప్పలు కలువ రేకుల్లా ఉన్నాయి. ఆ నడకలో హొయలు, ఆ పెదిమల కదలికల్లోని సౌకుమార్యం- ఆ చెక్కిళ్లలోని అరుణిమ- ఆ ఆకర్ణాంత నేత్రాల్లోని చంచలత్వం నన్ను ముగ్ధుణ్ణి చేసి, నన్నో శిలా ప్రతిమనే చేసేసినైరా. అలా రిక్షా ఎక్కుతుంటే.... అయ్యో!....వెళ్ళిపోతూంటే-రిక్షా వెంట బడిపోదామా అనిపించింది."

"ఇంకా నయం - పోలీసులు నీ వెంటబడేవారు."

"ఆగరా! సాంతం చెప్పనియ్. ఆయన రిక్షావాడితో ఏదో చెప్తున్నాడు. ఆడ పిల్లల హాస్టల్ అంటూంటే అది విన్నాను. ధైర్యంగా పోనిచ్చాను....అంతేకాదు....విను! ఆ అమ్మాయి రెండు మూడుసార్లు నన్ను పరీక్షగా చూసింది."

"బాగా గుర్తుపెట్టుకుని, వెధవ్వేషాలువేస్తే తన్నించటానికి.... బహుశః కాలికి క్రొత్త జోళ్ళుకూడా ఉన్నాయేమో!"

"వెయ్‌రా....ఎగతాళి చెయ్!....కాని,....వెంకటేశ్! ఒక్కటి నిజంరా....నాలో ఏదో శక్తి బహిర్గతమై....ఆమెలో చేరిపోయింది. నాలో సగ భాగాన్ని కనుక్కున్నానన్న జ్ఞానం కల్గింది. ఆమెకూడా అలాగే ఫీలయినట్లుంది....ఈ పరస్పర ఆకర్షణ....ప్రథమ వీక్షణం లోనే ఒకరికొకరు అర్పించుకోవటమే ప్రేమరా!"

"అయి ఉండొచ్చు. ఏ. సి. కాలేజిలో ఆనాడు ఒకమ్మాయి నిన్ను ప్రేమించినట్లే ఈమెకూడ ప్రేమిస్తుందన్నమాట! పోనీలే, నీ పుణ్యాన ప్రేమలేఖ లెలా రాయాలో నేర్చుకుని నేను రాస్తాను."

"ఛా! భార్యకు రాసుకుంటారా?" ఫక్కున నవ్వాడు.

"లేదులే! వాటిని ఉండలుగా జుట్టి మూలపారేస్తారు." ఇద్దరూ నవ్వుకున్నారు. వాతావరణం కాస్త హాయిగా ఉంది. "ఆ పిల్ల రెస్పాండ్ చేస్తే నువ్వు అదృష్టవంతుడి వన్నమాట."

"ఔను. అలా జరిగితే నీకు...."

"నాకేమీ అక్కర్లేదు. నీ ప్రేమాయణంతో నన్ను చంపకు, అంతే చాలు!" అంటూ దండం పెట్టాడు. మరో మారు స్నేహితులు నవ్వుకున్నారు.

రిక్షా సాగిపోతూంది.

# 5

ఆడపిల్లల హాస్టల్ అన్నమాట విన్నాడేగాని అది ఏదో వివరంగా తెలీదు. యూనివర్సిటీ తెరవటానికి రెండు రోజులు వ్యవధి ఉంది. ఆ సాయంత్రమే కాస్త శ్రద్ధగా తయారై గదిలో పచార్లు చేస్తున్నాడు మహీధర్. స్నేహితునిలో మార్పు స్పష్టంగా కనపడుతూంది. రోజూ చూస్తూంటే భేదం కన్పించదుగాని ఒకానొకనాడు అకస్మాత్తుగా గమనిస్తే అతడెంతగా పెరిగింది, ముఖంలోని చాపల్యం—కుర్రకారుతనం - క్రమబద్ధంగా పెరగని గెడ్డం వయసు ఎక్కేకొలది తుడుచుకుపెట్టుకొని పోయినట్లు గమనించాడు. ఇప్పుడు నీటుగా పెరిగిన గెడ్డాన్ని క్షవరం చేసుకుంటే తెల్లని చెంపలమీద నీలినీడలు ప్రసరించి హుందాగా కనబడుతున్నాడు. వయసుతోపాటు ఇప్పుడు వచ్చేది యౌవనం. దాని ప్రభావం మహీధర్‌పై బాగా పనిజేస్తోంది.

"ఎక్కడికిరా.... పెళ్ళి చూపులా?" సీరియస్‌గా అడిగాడు. మహీధర్ నవ్వేశాడు. అది హాస్యంగా నవ్వినట్లు లేదు. ఏదో ఆందోళనని దాచుకోటానికి ముఖంమీదికి లాక్కున్న ముసుగులా వుంది.

ఇక పలుకరించరాదనుకున్నాడు.

ప్రయాణపు బడలికను వదిలించుకోవాలని మంచంమీద మేను వాల్చాడు. ఏమీపట్టనట్లు గోడకేసి తిరిగి పడుకోటానికి మనస్కరించలేదు.

లాలనగా అడిగాడు: "నా సాయం ఏమన్నా కావాలా?"

"సాయం....బహుశః ఆమె ఎక్కడ కనబడవచ్చు?"

చిలిపిగా జవాబివ్వాలనుకుని మరుక్షణమే వద్దనుకున్నాడు.

"బీచ్....పార్క్....సినిమాహాల్స్.... కానీ ప్రయాణంచేసినవా

దెవడూ ఎక్కడికీ వెళ్లడు. నీలాంటి పిచ్చిదైతే బీచ్‌లో కనబడ వచ్చు."

"వెరీ మెనీ థాంక్స్ మై డియర్ బాయ్!" అంటూ తలుపుచేర వేసి వెళ్లిపోయాడు. క్రమబద్ధంగా టకటకమని బూట్ల చప్పుడు వరండా లోంచి వినబడ్తూ తగ్గిపోవటంవరకు విని కళ్లుమూసుకున్నాడు వెంక టేశ్. అలసినప్రాణం వెంటనే నిద్రాదేవి కౌగిలిలో ఆదమరచి నిద్ర పోయాడు.

ఎవరో లేపుతుంటే మెలకువ వచ్చింది.

"ఎనిమిదిన్నరౌతుంది- భోంచెయ్యి-" ప్రక్కరూం అబ్బాయి లేపుతూ అంటున్నాడు.

లేచికూచుని "ఆ.... వెళ్తాను" అంటూ మహీధర్ తిరిగి వచ్చిన చిహ్నాలు కనబడ్తాయేమో నని చూశాడు. ఏమీలేవు. ముఖం కడు క్కొని భోంచేసివచ్చాడు. అప్పుడే మహీధర్‌కూడా వచ్చాడు.

"భోంచెయ్యి. ఆలస్యమైపోయింది."

"ఔనుగాని, ఆకలిగాలేదు."

ఆ జవాబుతో ఇక తను అడగదలచిన ప్రశ్న నోట్లోనే ఇగిరి పోయింది - ఆమె కనబడలేదని తేలిపోయింది. జాలివేసింది. దగ్గరగా వెళ్ళి భుజంమీద చేయివేసి సూటిగా కళ్ళల్లోకి చూసి అన్నాడు: "ప్రేమ పథం పూలబాట కాదని నీకు తెలుసు. కొన్ని గంటల క్రితం చూశావు. అప్పుడే మళ్లీ నీకు కనిపించాలని ఆశించావు.అదెంత అసాధ్యమో రవంత ఆలోచించు. దేనికైనా వ్యవధి కావాలి. ఓర్పు కావాలి. జయాపజయా లను సహించగల మనసు కావాలి. అప్పుడప్పుడు కల్గే నిరాశను భరించగల ధీరత కావాలి. ఆగు....తొందర పడకు....పద....రెండు మెతుకులు తిని పద్దువు గాని. ఇంటి భోజనం తిన్న తర్వాత ఈ భోజనం ఎక్కువ తినలేములే...." స్నేహితుణ్ణి బ్రతిమాలి, బల వంతంగా లాక్కు వెళ్లాడు.

ఆ రాత్రి మహీధర్‌కు ఎప్పుడు నిద్రపట్టిందో తనకు తెలియదు గాని, తను మాత్రం పక్క జేరిన వెంటనే గాఢ నిద్రలో మునిగి పోయాడు.

# 6

రెండవ రోజు కూడ మహీధర్ తిరిగి తిరిగి విసిగి వేసారి హాస్టల్ చేరాడు. ఆ ముఖం అడగకుండానే చెబుతూంది.

"కాలేజిలు తెరవనీ - అంతా సెటిల్ అయ్యాక - ఇంటిమీద బెంగపోయాక అప్పుడు గుంపులు గుంపులుగా బయలుదేరుతూంటారు. అప్పుడు తప్పక కనబడ్తుందిలే" అంటూ ధైర్యం చెప్పాడు వెంకటేశ్. "ఇంతకీ ఎక్కడెక్కడ హంట్ చేశావేమిటి?"

"నువ్వు చెప్పిన స్థలాలే."

"సినిమా హాల్స్ తప్ప.... అంతేనా?"

"ఆ."

"ఏదైనా - వెంటనే దొరికితే ఆనందం లేదురా. శ్రమించాలి, దానికోసం నీ కాలమంతా, ధ్యానమంతా వెచ్చించాలి, నిరాశతో జీవితం భరింపరానిదే అయినట్లు బాధపడాలి. అప్పుడు ఆ వస్తువు దొరికితే ఎంతో ఆనందం, తృప్తి. శ్రమకు ఫలితం దక్కిందన్న ఉత్సాహం ఆ వస్తువుకు లేని విలువ తెస్తుంది. అసమర్థుడిలా, మూర్ఖుడిలా అసలు మొదలంటూ లేక ముందే నువ్వు నిరాశ పడటం ఏమిటి? ఒక వేళ ఆ పిల్లకి పెళ్ళయిందనుకో- ఏం చేస్తావ్? వేరే ఎవరైనా ప్రేమిం చిందేమో! బావ ఉన్నాడేమో? అన్నీ తెలుసుకోవాలి. అప్పుడు వే క్లియర్‌గా ఉందంటే మహారాజులా ప్రేమించు! ప్రేమకు పునాదులు వేసి కట్టుకుపో! - బ్రహ్మాండంగా.... తెలిసిందా?" మహీధర్ ఫకాల్న నవ్వేశాడు. క్షుతిమించినట్లుగా నవ్వాడు. ఆ నవ్వుకు ముఖమంతా ఎర్రబడింది. కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. నవ్వి నవ్వి తనే ఆగిపోయాడు.

"నిజమే. నిరీక్షిస్తాను....కానీ వెంకటేశ్! ఇలా చూడు. యూని వర్సిటీలో ఎందర్ని చూడలేదు! నా కెప్పుడూ ఈ విధమైన భావం కల్గ లేదు. కాని, నిన్న ఆ అమ్మాయిని చూడగనే చలించి పోయాను. హృదయం అనూహ్యమైన అనుభూతికి లోనైంది....పోనీయ్, నీ సలహా పాటిస్తాను. అదెంతో అవసరం కూడా."

మహీధర్ కంఠంలో, కళ్ళల్లో కూడా సీరియస్‌నెస్ తొంగి చూస్తూంది. 'అయ్యో - పాపం - ఇదేదో సీరియస్ అయ్యేట్లుంది.' అనుకున్నాడు వెంకటేశ్.

ఆనాడు చిన్నతనంలో ప్రేమించినట్లు కాదు. తెలియని వయ సది. ఇది నూటికి నూరు పాళ్లు నిజమైందిలా ఉంది.

ఆ రోజు కాలేజీలు తెరిచే రోజు. యూనివర్సిటీ ప్రాంగణంలో పెళ్లి పందిట్లోలా సందడి! నూతన విద్యార్థులతో, వారితోకూడా వచ్చిన పెద్దలతో, పాత విద్యార్థుల పునర్దర్శన సంభ్రమాలతో కలకలలాడు తోంది.

ఒకరి నొకరు పలుకరించుకుంటూ సరదాగా సందడిగా ఉన్నారు. మహీధర్, వెంకటేశ్‌లు మొదటి రోజున ముచ్చటగా ఒక్కొక్క నోట్‌బుక్ మాత్రం పట్టుకెళ్ళారు.

కాసేపు తెలిసిన వాళ్ళను పలకరిస్తూ అక్కడక్కడ తిరిగి వచ్చారు. తర్వాత ఆఫీస్‌కి కొంత దూరంలో చెట్టు క్రింద నుంచున్నారు. వచ్చే పోయే వాళ్ళతో ఆ దారి కిటకిట లాడుతూంది. కానీ, క్రొత్తగా జేరటానికి వచ్చిన వాళ్ళ సంఖ్య అంతగా లేదు. దాన్ని గమనించాడు వెంకటేశ్.

"ఈ రోజు మంచిది కాదు," అన్నాడు.

మహీధర్ ముఖంలో నిస్పృహ గోచరించింది.

"అయితే అమ్మాయిలు రారు" అన్నాడు నిస్తేజంగా.

"ఆ....వాళ్లకు—వాళ్ళతో వచ్చిన పెద్దలకు ఈ పట్టింపు లెక్కువగా ఉంటాయి."

"ఊఁ" అంటూ చెట్టు నానుకుని ఉస్సురని నిశ్వసించాడు.

"ఇంకా....ఈ కాలంలో గూడ ఇల్లాంటి పిచ్చి నమ్మకాలతో ఉన్నారంటే....!"

"అంతే మరి....కానీ, నమ్మకమున్నవాళ్ళ ఈ గడియ వారి కేదో ఉపకారం కలుగనీయదని భావిస్తారు. ఒక్క గడియ శుభాశుభాలు కలిగించ గలదని విశ్వసిస్తారు. ఇదే గడియ ఒకరికి శుభప్రదమౌ తుంది. మరొకరికి అశుభం కల్గిస్తుంది....మంచి రోజు చూసుకుని వద్దాం పద...." అన్నాడు.

కానీ, మహీధర్ కదల్లేదు. నోట్ బుక్ ఖాళీగా ఉంది. తెరిచి చూస్తూ నుంచున్నాడు. ఎవరైనా చూస్తే 'ఎంత బుద్ధిమంతుడు!' అనుకుంటారు. సందేహం లేదు.

పన్నెండు గంటలు కొట్టింది.

క్రింద కూచుని మాట్లాడుకుంటున్న స్నేహితులు లేచి నుంచు న్నారు. ఎక్కువమంది ఆ వేపు తిరగటం లేదు.

"ఇక వెళ్దాం. నాకు ఇక కూచోవాలని లేదు." వెంకటేశ్ కదలటాని కుద్యుక్తుడయ్యాడు.

ఆవేపుగా ఎటో చూస్తున్న మహీధర్ స్నేహితుడి జబ్బ గట్టిగా పట్టుకున్నాడు. ఆ వ్రేళ్లు లోనికి దిగి బాధపెట్టినై. "అబ్బ!" అంటుంటే, మహీధర్ ముఖం వికసించింది. అతడు దృష్టి మరల్చ లేదు. "వెంకటేశ్, అదుగోరా - వస్తుంది. ఆయనకూడా వెంట ఉన్నాడు... చూడు!"

వెంకటేశ్ చెయ్యి విడిపించుకుని తిరిగిచూశాడు. దూరంలో ఒకమ్మాయి, ఒక పెద్దాయనా వస్తున్నారు. మహీధర్ రెప్పవాల్చ కుండా చూస్తూన్న ధోరణిచూసి జబ్బమీద బలంగా చేయి వేశాడు.

"అలా చూడకురా! నీ ఆత్రం, ఆనందం అల్లా వెళ్లబో సెయ్యకు. కాస్త తగ్గి మామూలుగా వ్యవహరించు. పిచ్చివాడను కుంటారు. లేకపోతే పట్టీ పట్టనట్టు గంభీరంగా వుండి జయించాలి. నువ్వు ఇలా ప్రవర్తిస్తే చులకనజేస్తుంది- భద్రం. తర్వాత ఫేలయి లాభంలేదు."

స్నేహితుడి హితవచనాలు చెవినసోకినై. అర్థం గ్రహించాడు. అతి ప్రయాసతో ముఖం త్రిప్పుకొని ఎటో చూస్తున్నట్టు భ్రమ కల్గించాడు. వారు సమీపిస్తున్నారు. మౌనంగా వుండటం సబబు కాదని ఉత్కంఠతో అంటున్నాడు వెంకటేశ్: "ఈ సంవత్సరం ఆడపిల్లలు ఎక్కువగా రావచ్చుట. చదువుల్లో వాళ్లదే పైచెయ్యి. వారి కితర వ్యాపకలూగట్రాలేవుగా. మా చెల్లినికూడ జేర్పించాలనుకుంటున్నాను. రమ్మని రాశాను. ఇంకా రాలేదు. హాస్టల్ నచ్చలేదేమో! ఇల్లు అద్దెకు తీసుకుని మా అత్తయ్యను పిలిపించి...." మహీధర్ శ్రద్ధగా మొదలు తుదిలేని వెంకటేశ్ సంభాషణను వింటున్నాడు. ఆ వచ్చినవారు సమీపించారు. వారిచెవి సోకిన మాటలు సహజమైనవి, మామూలువీను. వారు ఆగారు. మహీధర్ గుండె ఆగింది.

తర్వాత మహీధర్ గుండెదడ మరీ ఎక్కువైంది.

తిరిగి చూశాడు. ఆ అమ్మాయికూడా అతణ్ణి చూసింది. గుర్తించినట్లు ఆ కళ్లు చెబుతున్నాయి.

"ఏం కావాలండీ?" వెంకటేశ్ అటుదిరిగి అడిగాడు.

"ఐదురూపాయలకు చిల్లరుందా? తీరా వచ్చాక రిక్షావాడు చిల్లరలేదంటున్నాడు."

"ఈ రిక్షావాళ్లంతే లెండి. చిల్లరలేదంటారు, ఇచ్చిన నోటు పుచ్చేసుకోవాలని." ఇద్దరు జేబుల్లో చేయిపెట్టారు. కాని, వెంకటేశ్ ఆ పని కొంచెం ఆలస్యం చేశాడు....మహీధర్ పర్స్ తీశాడు. చూస్తే కొద్ది చిల్లర, పదిరూపాయల నోట్లున్నాయి.

"మన కవసరమైనప్పుడు దొరకదు, ఉండదు. నాదగ్గర ఒక్కరూపాయిమాత్రం ఉంది" అంటూ ఒకటి తీశాడు వెంకటేశ్. నిజానికి అతడిదగ్గర మూడురూపాయ లున్నై.

"ఎంత కావాలి మీకు?"

"మూడు రూపాయలు."

"ఐతే ఒక పని చేద్దాం. మేమెలాగో చిల్లరతీసుకునివచ్చి రిక్షా వాడి కిస్తాం. ఏడీవాడు?"

"ఎత్తుగావుంది - రానన్నాడు."

"మేంవెళ్లి ఇస్తాంలెండి. మీరు వెళ్లండి" అంటూ వెంకటేశ్ స్నేహితుడి చెయ్యిపట్టుకుని గబగబ వాళ్లొచ్చినవైపు కెళ్లటంచూసి ముసలాయన అన్నాడు: "మళ్లీ కనబడతారుగా?"

"ఓ....తప్పక....నా పేరు వెంకటేశ్ ఎం.ఎస్.సి. మేథ్స్ ఫైనల్. నా స్నేహితుడు, క్లాస్‌మేట్ మహీధర్....మీరు వెళ్లండి" అంటూ అవసరంగా ముందుకెళ్ళాడు.

మహీధర్ విసుక్కున్నాడు. "నువ్వూ నీ పాడుచిల్లరా- నీ బోడి హెల్పునూ...."

"ఉండరా....! దీంతో మన స్నేహం పెరగాలని నా ఆశ. నా జేబులో చిల్లరుంది"

వెనక్కితిరిగిచూస్తే డొక్కలో పొడుస్తాడేమో నని భయం వేసింది మహీధర్‌కు.

వాళ్లు కాస్తదూరం వెళ్లగానే రిక్షా కనబడింది.

"ఎందుకలా నిలబడ్డావ్, రిక్షా కడ్తావా?"

"కడ్తానయ్య - గానీ, ఒకయ్యగోరూ, అమ్మాయిగోరూ ఎక్కొచ్చి డబ్బు సిల్లర్లేదని పోయినారు...."

"ఓ ...నువ్వేనన్నమాట. ఇదిగో, మూడు రూపాయలు నీకు ఇమ్మన్నారు. ఐనా డబ్బుతీసుకోకుండానే వాళ్ళను నమ్మి పంపావే!"

"అదండీ....!" అంటూ రూపాయలు జేబులో వేసుకున్నాడు. "ఆ అయ్యగార్ని సూత్తే అనుమానం ఎయ్యాలా. సూద్దాం. మడిసిని నమ్మకుంటే ఎల్లా లెండి!... ఎక్కండి తీసుకెళ్తా."

"వద్దులే. డబ్బివ్వటానికే వచ్చాము."

రిక్షా వెళ్లిపోయింది. వెంకటేశ్ మరో దారి తీశాడు.

"వాళ్ళను కలవొద్దూ?"

"ఒద్దు. ఆ పిల్ల డబ్బివ్వటానికి నీకోసం వస్తే....అంటే నీ పేరు గుర్తుంచుకుందంటే అది మంచి శుభప్రదమైన ఆనవాలన్న మాట. పద....పోదాం."

"ఏమిటో....నీ వాలకం....వెళ్ళి అక్కడే నిలబడి చూస్తేనేం కాసేపు?—"

"అదే వద్దనేది. ఆ పిల్ల మనచేయి దాటి పోదు. అంటే- మన యూనివర్సిటీ దాటిపోదు."

"నీ కెలా తెలుసు? సీట్ లేదు పొమ్మంటే....?"

"అలాంటి వారైతే రిజ్మను పంపరు. వెయిట్ చేయమంటారు. వాళ్ళకి సీట్ డెఫినెట్ అన్నమాట."

స్నేహితుడి ముఖంలోకి ఆశ్చర్యంగా చూశాడు మహీధర్.

"అలా చూస్తావేం! నేను వెంకటేశ్వర్లుని. పెళ్ళయిన వాడిని ....కాస్త లోక జ్ఞాన ఎక్కువ. నడు నడు!" అంటూ మెడమీద చేయి వేసి త్రోసుకెళ్లినట్లు నడిపించుకుంటూ రూంకు తీసుకెళ్ళి పోయాడు.

"ఏమో, నాకు భయంగా ఉంది."

"ఏం భయం లేదు. ఎలాగో ఆ మూడు రూపాయలు మనకి జేరుస్తార్లే. పేర్లిచ్చాను. తండ్రి పంపితే యం. ఓ జేస్తాడు ఏకంగా పెళ్ళి పెత్తనానికే వెళ్లొచ్చు."

నిజమే ననుకున్నాడు, మహీధర్. ఐనా లోపల పీకుతూనే ఉంది. ఈ వెంకటేశ్ పెద్దరికం వహించి, అంతా తారుమారు చేస్తాడేమో నన్న భయంతో కుంగిపోయాడు. వెంకటేశ్ సగం బెంగ తీరినట్లు హాయిగా ఫీల్ అయ్యాడు.

ఆ మరుసటి రోజు ఎంతసేపు పడిగాపులు పడినా ఆ పిల్ల జాడలేదు.

# 7

ఆ మరుసటి రోజుకూడ మార్పులేదు.

పోనీ అని మూడవ రోజు పోస్ట్‌మాన్‌కోసం చూశారు. యం.ఓ. రాలేదు.

కోపంతెచ్చుకోకుండా - ఆశావాదిలా నిరీక్షించాడు పోస్ట్‌మాన్

కోసం - నాలుగవరోజు వెంకటేశ్. నిరాశే ఎదురైంది. పలుకరిస్తే భగ్గున మండిపోతున్నాడు మహీధర్. ఐదవరోజు వెంకటేశ్ ఏమీ చెప్పకుండా బయలుదేరాడు. ప్రప్రథమంగా ఇంత సాహసం చేస్తున్నాడు. తనకే ఆశ్చర్యంగా వుంది. ఏదో ఒకటి తేల్చుకుని మహీధర్‌కు చెప్పాలి. తనమీద ఏపాపం ఉండరాదనుకున్నాడు.

లేడీస్ హాస్టల్‌కు బయలుదేరాడు. ఏమని అడగాలో? ఆ అమ్మాయి పేరయినా తెలీదు. అస లక్కడ ఉందో లేదో! తండ్రిపేరు తెలీదు. వెళ్లి ఏమని అడగాలి?

సరే - అనుకున్నాడు,

హాస్టల్‌లో అడుగుపెట్టాడు గాని ఒళ్ళంతా కంపరం పుట్టింది. ధైర్యం కూడగట్టుకుని వెళ్ళాడు,

మంచివేళకు తెలిసిన అమ్మాయి కనబడింది,

"నమస్కారం" అంటూ పలుకరించాడు,

ఆమె ప్రతినమస్కారంజేసి ఆశ్చర్యపోతూ చూసింది- ఇతను ఎవరికోసం వచ్చాడా- అని.

"ఓ చిన్న సాయం చేయగలరా? ఏడురోజులక్రితం ఒకమ్మాయి వచ్చింది. నాకు పేరు తెలీదు. రైలు దిగాము. చిల్లరలేక మూడు రూపాయలు తీసుకున్నాను. నేను చిల్లర తెచ్చిఇస్తానంటే హాస్టల్‌కు రమ్మని చెప్పింది. యూనివర్సిటీలో కలుసుకుని ఇద్దామంటే రాలేదు. దయచేసి మీ అన్నయ్య వచ్చాడు - రూపాయలు తెచ్చాడు - అని చెబితే గుర్తుకు తెచ్చుకోగలదు...."

ఆ పిల్ల ముసిముసిగా నవ్వుతూ - 'ఎంతనాటకం! ఎంత తమాషాగా వివరాలు చెబుతున్నాడో? క్రాస్ ఎగ్జామిన్‌చేస్తే అసలు రంగు బైటబడుతుంది - కానీ, ఇతడు మంచివాడే! ఏమో - ఎవరికి తెలుసు?' అనుకుని క్రొత్తగా జేరినవాళ్ళదగ్గరవెళ్ళి—

"మీ అన్నయ్యట- మూడురూపాయలు తీసుకున్నాట్ట-వచ్చాడు" అంటే ఎవ్వరూ పట్టించుకోలేదు. దొంగవేషాలనుకుని నవ్వినవాళ్ళు - పొగరుగా మాట్లాడినవాళ్ళు లేకపోలేదు.

చెట్లను చూస్తున్న వెంకటేశ్ చప్పుడైతే తిరిగి చూశాడు. ఆ అమ్మాయి వచ్చింది, "ఎవ్వరు మాకు తెలీదన్నారు. బహుశః సీట్ దొరక్క...." అంటూనేవుంది - వెంకటేశ్ దృష్టి మరోవైపు నిల్చింది. ముఖం ఆనందంతో విప్పారింది. "అదుగోండి .... వచ్చింది" అంటూ లేచి నుంచున్నాడు.

ఆమె తిరిగిచూసి నవ్వింది. 'పాపం, నిజమే చెప్పాడు' అనుకుని 'వెళ్తాను' అంది.

"చాలా థాంక్స్" అన్నాడు.

ఆ అమ్మాయి మెల్లగా వచ్చింది.

"ఏమ్మా.... కులాసాగా లేదా?.... కూచో....ఇల్లా కూచో.... ఏమైంది?"

ఆ పిల్ల విస్తుపోయి గ్రుడ్లప్పగించి చూస్తూ కూచుంది.

కుర్చీ దగ్గరగా లాక్కున్నాడు. "నేను డబ్బుకోసం రాలేదు. మళ్ళీవస్తానని నాన్నగారికి మాట ఇచ్చినందు కొచ్చాను. నా పేరు వెంకటేశ్. ఏం చదువుతున్నానో నీకు తెలుసు. మాది పల్లెటూరు. నాకు పెళ్ళయింది. ఆవిడపేరు నాగరత్నం. ఐదోక్లాస్ చదువుకుంది. అందుకని నిర్భయంగా రాగలిగాను. నన్ను అన్నయ్యా అంటే బావుంటుంది. నీపేరేమిటమ్మా!"

"ప్రతిమ....ఆరోజు సాయంత్రమే నాన్నగారు వెళ్ళిపోయారు. తలనొప్పి, జ్వరం వచ్చింది. అందుకని కాలేజీకి రాలేదు. మీరు రాలేదని, డబ్బు ఇవ్వలేదని చాల ఫీలయ్యారు. మరునటిరోజు ఇవ్వమని చెప్పి వెళ్ళారు. రాలేకపోయాను."

"ఈ ఊళ్ళో మీకు చుట్టాలు, స్నేహితులు లేరా?"

"లేరండీ!"

"అదో, అండీ అనకమ్మా! అన్నయ్యా అను.... నువ్వు వెంటనే ఉత్తరం రాసేస్తే బావుండేది. ఏదైనా మందు - అదీ...."

"తీసుకుంటున్నాను. ఇప్పుడు బాగానే ఉంది."

"చాలా నీరసంగా ఉన్నట్లున్నావు. టానిక్ తీసుకుంటే బావుంటుంది. ఇంటిమీద బెంగపెట్టుకున్నట్లున్నావు."

ఆమె సిగ్గుతో తలవంచుకుంది.

"మరి వెళ్ళొస్తాను. నీకు అప్పున్నట్లు చెప్పాను. ఇదిగో, మూడు రూపాయలు."

ఆమె అశ్రుపూరితనేత్రాలు తుడుచుకుంది.

"అంటే దీంతో ఆరు బాకీ అన్నమాట."

"అలాగే అనుకో. ఏదైనా అవసరమైతే ఈ అడ్రస్‌కు రాసెయ్యి. ఇంటికి ఉత్తరం రాసేటప్పుడు నాన్నగార్కి నా నమస్కారాలందజెయ్యి."

"అలాగే" అంటూ లేచి నుంచుంది.

"వస్తానమ్మా!" అని తనూ లేచి వెనక్కి తిరిగి చూడకుండానే ఠీవిగా నడుస్తూ వెళ్తోన్న వ్యక్తిని సంభ్రమాశ్చర్యాలలో చూస్తూ నుంచుంది. అతని మాటల్లో - ప్రవర్తనలో ఏదో ఉదాత్తత గోచరించింది. ఇంటిమీద బెంగతో దిగులుగా ఉన్న తనకు కొంత ఉపశమన కలిగినట్లుంది. మనసు నిర్మలంగా ఉంది. చేతిలో అడ్రస్ కాగితం. ఒకసారి చదువుకుంది. ఎవరో ఆప్తులు దొరికినట్టు ఆనందపడి తన గదిలోకి వెళ్ళిపోయింది.

గాల్లో తేలిపోతున్నట్లు మనసు తేలిక పడగా గదిలో అడుగు పెట్టాడు వెంకటేశ్. మహీధర్ గదిలో లేడు. బహుశః ఏ బీచ్‌లోనో, సినిమా హాల్ దగ్గరో పడిగాపులుపడి చూస్తూండవచ్చు.

స్నేహితుడికి చెప్పటమా - మానటమా? సందిగ్ధావస్థలో పడ్డాడు. తనకు ప్రతిమను గూర్చిన వివరా లేవీ తెలియవు. ఒక్క పేరు మాత్రం తెలుసు. ఆ అమ్మాయి చరిత్ర క్లుప్తంగా తెలుసుకుని - మహీధర్ ఆమె ప్రేమను పొందగలడన్న విశ్వాసం కుదిరిన తర్వాత అన్ని వివరాలు స్నేహితుడికి చెప్పవచ్చనుకుని ఆ నాటికి వాయిదా వేయటానికే నిశ్చయించాడు. రాత్రి ఎనిమిది అవుతూంది. నిస్పృహతో అడుగిడుతున్న స్నేహితుణ్ణి గమనించనట్లే పుస్తకం ముందు పెట్టుకున్నాడు.

ఆ రాత్రి వెంకటేశ్ ఉల్లాసంగా, హుషారుగా మాట్లాడుతుంటే

మహీధర్‌కి చికాకుగా ఉంది. గట్టిగా అరవాలన్నంత కోపం వస్తూంది. అది గమనించి వెంకటేశ్ కాస్త తగ్గాడు.

మరుసటి రోజు సాయంత్రం కూడా మహీధర్‌కు ఏమీ చెప్ప కుండా బయలు దేరాడు.

దార్లో పండ్లు కొనుక్కున్నాడు.

వెళ్ళగానే 'ప్రతిమగారు' కావాలని చెప్పాడు.

కొందరు ఆడ పిల్లలు ముసిముసిగా నవ్వుకున్నారు. ప్రతిమ వెంటనే వచ్చింది.

ఇంకా నీరసం పోలేదు. ఆమె ముఖం బాగా తీసిపోయి కళా విహీనంగా ఉంది. నమస్కరించి కుర్చీలో కూచుంది. పళ్లు ఇస్తూ కుశల ప్రశ్నలు వేశాడు.

"జ్వరం తగ్గిపోయిందండీ! కానీ, నీరసం. ఇవన్నీ ఎందుకు?"

"ఆ నీరసం ఇప్పుడే పోదు. ఇంటికి రాశావా?"

"రాశాను. ఇవ్వాళ ఇంకొకటి రాశాను. మిమ్మల్ని కలుసు కున్నట్లు. నాన్నగారు పెద్ద బరువు దిగిపోయినట్లు ఫీలవుతారు లెండి."

"అంటే మూడు రూపాయల సంగతేనా?"

"ఉహూ. ఆరు రూపాయల సంగతి."

వెంకటేశ్ నవ్వాడు.

"ఏ ఊళ్ళో ఉన్నారు నాన్న, అమ్మగారు?"

"గుంటూర్లో."

"ఇంత బెంగ బెట్టుకున్నారే, మీ రొక్కరేనా?"

"ఒక తమ్ముడు, ఒక చెల్లి ఉన్నారు."

"పోనీలెండి. ఏం చదువు తున్నారు?"

"తమ్ముడు పి. యు. సి, పాప ఫిఫ్త్ ఫామ్."

"ఐతే చిన్నవాళ్ళే. అందుకే మీ కంత బెంగ. నాన్న గారేం చేస్తుంటారు?"

"ప్రైవేట్ డాక్టర్."

ఇంతకన్నా వివరాల దిగితే అసభ్యంగా ఉంటుందని వెంకటేశ్ ఆ కబురూ, ఈ కబురూ చెప్పి పది నిమిషాలు గడిపాడు. తర్వాత

కొన్ని పుస్తకాల పేర్లు గల కాగితం అందిస్తూ అడిగాడు. "నా భార్య అట్టే చదువుకోలేదు. కాలం వృధా చెయ్యకుండా పుస్తకాలు చదివితే మంచిదని ఈ పుస్తకాలు పంపాలనుకుంటున్నాను. చూడండి. ఇవి ఫరవా లేదు కదా?"

ప్రతిమ జాబితా చూసి వస్తున్న నవ్వును పెదిమల మీదనే అట్టిపెట్టుకుని అంది: "పురాణేతిహాసాల తాలూకు పుస్తకాలు పంపితే మహాపతివ్రత అయిపోతుందనా? ఆ కాలంలో వాళ్ళ సాహస క్రియలు చదవాల్సిందే. వద్దనను. కాని, ప్రస్తుతం మన స్త్రీలను గూర్చిన చరిత్ర పుస్తకాలు, ఆధునిక వీరనారీమణుల సాహస గాథలూ వారి తెగింపునీ గురించి చదివితే ఆమెకి లాభదాయకం కాదా? మన స్త్రీలెంత ముందంజ వేసిందీ, పురుషులతో సరిసమానంగా స్వాతంత్ర్యపోరాటంలో పాల్గొన్న కథలూ తెలుసుకోవాలి. ఏమంటారు? అవి చూడండి. ఇవి మరెప్పుడైన పంపవచ్చుగా!"

వెంకటేశ్ నోరుతెరచుకుని విన్నాడు. ఐతే ఈ పిల్లలో ఇలాంటి భావాలున్నాయా? నిజమే. ఈ అంతరిక్షయాన యుగంలో ఆమె మనఃప్రవృత్తి ఈవిధంగా ఉందంటే ఆశ్చర్యపడ నవసరం లేదు.

"అవునమ్మా.... అక్షరాలా నిజం. ఏమిటో ఇవంటే ఇష్టంగా చదువుతుందిగదా అనుకున్నాను."

"నే చెప్పినవికూడ బావుంటాయి. మా చెల్లి తమ్ముళ్లకు ఉపవాచకా లుండేవి. సరళంగా సులభశైలిలో ఉండేవి ఎక్కడైనా దొరుకుతాయి."

"మీ సలహాకు చాలా థ్యాంక్స్. ఇప్పుడే, అలాంటివి ఏరి కొంటాను. నీలాంటి చెల్లి దొరికిందని రాస్తాను."

"మీరు ఉత్తరాలు రాసుకుంటారా? వాళ్ళవాళ్ళు రాసుకోనిస్తారా?" ఆశ్చర్యంతో అడిగింది.

"లేదు. నేను మామగార్కే రాస్తుంటాను."

"ప్చ్. పెద్దవాళ్ళతో - అందులో పల్లెటూరివాళ్ళతో ఇదే న్యూసెన్స్. ఏమంటారు?"

"అక్షరాలా నిజం.... మరి వెళ్ళొస్తాను. కాలేజి కెప్పు డొస్తారు?"

"ఇంకా పాఠాలు మొదలుపెట్టలేదు. ఎల్లుండి వస్తాను."

"గుడ్. వీలయితే ఎల్లుండి కలుస్తాను," అని వెళ్ళిపోయాడు.

పుస్తకాలు కొనుక్కొని రిక్షా తీసుకుని బయలుదేరాడు. తను మహీధర్‌కోసం ఎంత శ్రమపడ్తున్నాడు; తన వ్యక్తిత్వమే మారినట్లుంది. తన స్వభావమే మార్పుజెందుతుందా? కాకపోతే ఏమిటి అంత చొరవగా, ధైర్యంగా వెళ్ళి ఆమెను కలిసి మాట్లాడిరావటం? నిజంగా తను ఎంత సిన్‌సియర్‌గా స్నేహితుడికోసం పాట్లుపడ్తు న్నాడు! ఫలితం దక్కాలి, అనుకున్నాడు.

ఆ ఎల్లుండి రానేవచ్చింది. కాలేజిలో ఆమెను చూడలేక పోయాడు.

ఆ సాయంత్రం మళ్ళీ హాస్టల్‌కి వెళ్ళాడు.

పుస్తకాలు పార్సిల్ చేసినట్లు చెప్పాడు. ప్రతిమ సంతోషించింది. ఎంతో చొరవగా 'అన్నయ్యా' అని పిలిస్తే వెంకటేశ్ ఎంతో ఆనందించాడు.

"అన్నట్లు—ప్రతిమ అనే పేరెవరు పెట్టారమ్మా? మనకు లేదే?" అని అడిగాడు. దీంతోనైన కొంత ఆమే చరిత్ర తెలుసుకో వచ్చునన్న నెపంతో.

ప్రతిమ కిలకిల నవ్వింది.

"అప్పుడు—ఏనాడో- ప్రతిమా దాస్‌గుప్త అనే నటీమణి ఉండే దట.... విన్నారో లేవో ...మా అమ్మ చెబుతుంది. మా అమ్మది ఉత్తర ప్రదేశ్. పిలిబీత్. మా నాన్నగారు రెండో ప్రపంచ యుద్ధంలో పాల్గొ న్నారు. కాన్పూరులో మీట్ అయి పెళ్ళి చేసుకున్నారు. చాలా గొడవ అయిందట. ఇంటర్ కాస్ట్ మేరేజ్. మా అమ్మ ఎప్పుడూ పుట్టింటి కెళ్ళదు. వాళ్ళు మా నాన్నగార్ని ఆహ్వానించలేదని కోపం. మా అమ్మ అలా బాధపడ్తుందేగాని వెళ్ళదు. తమాషా ఏమిటంటే- మా తాతగారు రమా శంకర్ మిశ్రా విదేశాల్లో చదివిన పేరు మోసిన ప్లీడర్. కూతు ళ్ళను కొడుకులను అంతా వెస్టరన్ స్టయిల్లో పెంచారుట. తలకొకరు

తమకు నచ్చిన వాళ్ళను ఎంచుకుని నిజంగానే వెస్టరన్ అయిపోయారు. అది ఆయనకు నచ్చలేదు. ఒక కొడుకు కర్నల్ మిశ్రా-అంటే మా పెద మామయ్య ఒక జర్మన్ ఆవిడను పెళ్లాడాడు. ఆవిడను చూస్తే కాశ్మీర్ పడుచులా ఉంటుంది. అంత భారతీయత్వం పుంజుకున్నా మా తాతగార్కి ఇది నచ్చలేదు. ఇంకో పిన్ని బెంగాలీ బ్రాహ్మణ్ణి చేసుకున్నా ఆయన అంగీకరించలేదు. అలా తిట్టుకుంటూనే సంవత్సరానికొకసారివచ్చి చూసి వెళ్తారు."

"మరి మీ అమ్మమ్మగారు?"

"ఆమె ఎప్పుడో పోయారు. మా అమ్మా వాళ్ళు చిన్నవాళ్లట. అసలు గుర్తు లేదంటుంది అమ్మ."

"అందుకే అంత ప్రేమగా మా తాతగారు వచ్చి చూసి వెళ్తారు. తల్లి తనే అయి పెంచినందుకు-మరి."

"అదే మేమూ అనుకుంటాము. మా తాతగార్కి ఎంత టెక్కు! మా అమ్మా నాన్నల ఎదుట మమ్మల్ని ఆప్యాయంగా దగ్గిరికి పిలవరు, మాట్లాడరు. కాని, వాళ్ళు లేనప్పుడెంత ప్రేమ వొలకబోస్తారో! నాకు ప్రతిసారి ఏదో ఒక నగ తెస్తారు. ఆయనకి మొట్టమొదటి మనమరాల్ని నేనే."

"ఐతే ఆయన పెట్ వి అన్నమాట."

ప్రతిమ నవ్వింది. "ఏదేదో- వాగాను....ఇంకొక్కటి చెప్తాను. మా ఆఖరి మామయ్య పెళ్ళిమాత్రం మా తాతగారు కుదిర్చిన పిల్లతో అయింది. అందరం వెళ్లాము. జస్ట్- పెళ్లికూతురు వచ్చిన రోజున మాత్రం అక్కడుండి వచ్చేశాము. ఆ ఇంట్లో ఎన్నిరకాల మనుష్యులు! నిజంగా ఓ మినియేచర్ ఇండియాలా ఉందేదనుకోండి."

"చాలా సరదాగా ఉండి ఉంటుంది."

"ఆ(....ఉండాల్సింది. కాని, ఉంటేగా! నీవెంత - అంటే నువ్వెంత అన్నట్లు ఎవరికివారు, హల్లో హల్లో అనుకుని బళ్లెక్కారు. నాకేమో అలాంటిచోట నాల్గురోజు లుండా లనిపిస్తుంది."

"ఔను. ఎన్నో విషయాలు తెల్సుకోవచ్చు. ఏమిటో ఈ వయసులో అంతా అన్నీ గమనించాలని ఉత్సుకత, ఆరాటం!"

"మీ ఇంటినిగూర్చి చెప్పారుకారు?"

వెంకటేశ్ తనను, తన కుటుంబాన్నీగూర్చిన వివరాలన్నీ చెప్పాడు.

"మా ఇంటి వాతావరణం అంతా సిసలయిన పల్లెటూరి రైతు ఇంటి వాతావరణం. భార్యా భర్తలు కలిసి జంటగా వెళ్తే చోద్యంగా చూస్తారు. అలాంటి పల్లె మాది. వస్తారా ఎప్పుడైనా!....మా నాగ రత్నం సరేసరి, ఇక చెప్పక్కర్లేదు...."

"మంచివారే! పల్లెటూరి పిల్ల యితే నేం? కొన్నాళ్లు పోయాక అన్నీ నేర్చుకుని పట్నం పిల్లల్ని తలతన్నదూ? చదువుంటేనేనా సంస్కారం ఉండేది? మీరింత చదువుకున్నారు. మీ సన్నిధిలో, మీ సాహచర్యంలో ఆమెను మీరు కోరుకున్నరీతిలో మలచుకోగలరు. మీరంతగా ఫీలవ నవసరంలేదు, మాటమాటకు ఆమె చదువుకోలేదని, పల్లెటూరిపిల్లని అనకండి."

ముద్దుముద్దుగా మందలిస్తుంటే నేరంజేసినవాడిలా తలొంచు కుని సమర్థించుకునేవాడిలా అన్నాడు :

"అలాఅని చిన్నచూపుచూస్తూ అనటంలేదమ్మా! మామూలు వివరాలు ఇస్తున్నాను. అంతే. పెళ్లిచేసుకున్నతర్వాత ఫీలవుతున్నా ననుకోకు. ఇంకా టైం ఉంది."

"ఔను. చాల టైం ఉంది. ఆ పుస్తకాలు చదివిన తర్వాత పరీక్ష పెడ్తారా?" నవ్వుతూ అడిగింది.

"చదివేశాను-అని రాస్తే గదా పరీక్ష పెట్టటానికి!"

"అంటే ఉత్తరం వ్రాయదనా? లేక అసలు చదవదనా?"

"రెండూ జరక్కపోయినా ఆశ్చర్యపడ నవసరం లేదు."

"అప్పుడే అంత నిరాశా వాదిలా మాట్లాడుతున్నారు. ఆమె తప్పక చదువుతుంది. నా భర్త అంత ఉన్నత విద్యనభ్యసించాడు, నేనూ కొద్దో గొప్పో చదువు కోవాలన్న ఆత్రం ఆమెకూ తప్ప కుండా ఉంటుంది."

"పోనీ అలాగే అనుకుందాం .... చాలా ఆలస్యమైంది ....

టానిక్ తీసుకుంటున్నావా? త్వరగా బలం పుంజుకోవాలి. లేకపోతే యూనివర్సిటీలో తిరగలేవు."

"తీసుకుంటున్నాను."

"మరోమాట. ఈసారి నాన్నగారికి రాసేటప్పుడు ఆరోగ్యంగా ఉన్నానని రాయండి-ఇంటికి. లేకపోతే పరుగెట్టు కొస్తారేమో!"

"నాన్నగారు వస్తామన్నా- మా అమ్మ రానివ్వదు. అలవాటు కావాలంటుంది."

"గుడ్. వస్తా నమ్మా!" అని బయలు దేరాడు వెంకటేశ్. గేట్ వరకూ వచ్చి "ఉంటా నన్నయ్యా!" అంది.

వెంకటేశ్ అడుగులో అడుగు వేసుకుంటూ రోడ్డు ప్రక్కగా నడుస్తున్నాడు. ఈమె కథ అంతా తెలుసుకున్నాడు. వీరిద్దరికి పెళ్ళి అవుతుందా? అమ్మాయి వైపు వాళ్ళంగీకరిస్తారేమో. కానీ, మహీధర్ తలిదండ్రులు! ఒక్కపొద్దు పోకుండా జీవితాన్ని గడిపే వాళ్ళు- అందులో ధనవంతులు - ఇలాంటి పెళ్లికి ఒప్పుకుంటారా? తనే రెండు రోజులు ఫ్రీగా ఉండ లేక పోయాడు వాళ్ల ఇంట్లో. ఇక యాతావతా జరిగిందే అనుకుందాం - మరి ప్రతిమకు ఆ ఇంట్లో ఎటువంటి స్థానం ఉంటుంది? వారిలో పొందికగా అమర లేదే! పోనీ వాళ్ళైనా తమలో ఒకతెనిగా అంగీకరిస్తారా అంటే- అది మరీ అనుమానంగా ఉంది. వెంకటేశ్ తను ఎరిగిన మహీధర్ జీవితాన్ని - అతడి స్వభావాన్ని నెమరు వేసుకున్నాడు. ప్రతిమ అతడి జీవితంలో ప్రవేశిస్తే అతడి జీవితం ఆనందపు టంచులవరకు సాగిపోగలదు.

ప్రతిమనుగూర్చిన సంగతులన్నీ విపులంగా చెప్పినా మహీధర్ తగ్గడు. మంచిదే - అనుకున్నాడు. కాని, ఏ అవాంతరాలూ లేకుండా చివరివరకు విధాత ఎలా నడిపిస్తాడో అని ఆలోచిస్తూ వెళ్తూన్న వెంకటేశ్‌ని ఎవరో పేరుపెట్టి పిల్చారు. సుపరిచిత కంఠాన్ని విని ఉలికిపాటుతో చుట్టూ కలియజూస్తున్నాడు.

"వెంకటేశ్—ఇల్లా వచ్చావేమి?" అంటూ అత్యాశ్చర్యంతో ప్రశ్నించిన మహీధర్ వేపు అంత ఆశ్చర్యంతోనూ చూచాడు.

"నువ్విలావచ్చావేం?"

"ప్రశ్నకు ప్రశ్న జవాబా?"

"పోనీలే. చెప్పరాదూ?"

"ఈ హాస్టల్‌దగ్గ రేమైనా తారసపడ్తుందేమోనని వచ్చాను."

"పిచ్చి తండ్రి!" అని రెక్కపుచ్చుకున్నాడు. "నే చూశాలే. పద, ఇక్కడ కనబడదు."

"ఏం? వేరే రూంగాని, ఇల్లుగాని తీసుకుందా?" మహీధర్ ఆత్రం పట్టలేక పోయాడు.

"చెప్తాలేరా, అన్నీ చెప్తాను, రా!" అని రెక్కవదలకుండా నడిపించుకుని తీసుకెళ్ళాడు.

సముద్రతీరం జేరారు. అంత రద్దీగా లేదు. చల్లగా హాయి గొల్పుతూంది వాతావరణం. అక్కడక్కడ జంటలు జంటలుగా కూచుని మాట్లాడుకుంటున్నారు కొందరు. అనంత జలరాశి ఘోషిస్తూ సైకత స్థలి పైకి దొరలివస్తూంది. అంత ఉద్రేకాన్ని, అంత బీభత్సాన్ని దోచుకుంటూ అలలు తీరానజేరి శాంతిస్తున్నాయి. చల్లని ఇసుకలో కాళ్లుపెడితే చిన్న పిల్లల్లా అల్లరిచేయాలని మనసౌతుంది. ఇద్దరూ కెరటాలు తాకేంత దూరంలో కూచ్చున్నారు.

"ఆ అమ్మాయి పేరు ప్రతిమ," అని ప్రారంభించాడు.

"ప్రతిమ - ప్రతిమ" అని వల్లించుకున్నాడు మహీధర్. అతని ముఖంలో ప్రతిఫలిస్తోన్న ఆనందాన్ని చూసి, తేలికగా నిట్టూర్చాడు వెంకటేశ్....

"ఇక విను...." అని ఆమెను గూర్చిన వివరాలన్నీ చెప్పాడు. ఈ భోగట్టా అంతా రాబట్టటానికి తను పడిన శ్రమకూడా వివరించాడు.

"ఐతే నువ్వు నే ననుకునేటంత చేతకానివాడివి కావన్న మాట. ఇంత పుష్షింగ్ నేచర్ ఉందిట్రా నీలో! లేక నా కోసం నువ్వు ధీరుడవై ...."

"నీ కోసమే ఇంత ధైర్యం తెచ్చుకున్నాను. నా కారణంగా ఆమె చెయి దాటి పోయిందేమోనని భయపడి, ఏదో ఒక విధంగా ఆమె ఉనికి కనుక్కోవాలనుకున్నాను. దైవికంగా, అంతా సానుకూల

పడింది. ఆమెను కనుక్కోవటం, ఆమెతో మాట్లాడటం - ఆమెను గూర్చిన చరిత్ర అంతా తెలుసుకున్నాను."

మహీధర్ స్నేహితుడి చెయ్యి గట్టిగా పట్టుకున్నాడు. కళ్ళల్లో ఉత్సాహం, ఆనందం తొంగి చూస్తున్నాయి. అంత క్రితం కొన్ని నిమిషాలవరకు అలవోకగా కదలాడుతున్న నిరాశాచ్ఛాయలు తొలగిపోయి, ముఖం ప్రశాంతమయింది. ఒక చేత్తో నుదుటిపై పడ్తున్న వెంట్రుకల్ని వెనక్కు తోసుకున్నాడు. ఎడతెగకుండా ఎగసిపడ్తూ ముత్యాలు వెదజల్లుతున్న కెరటాలకేసి చూస్తూ కూచున్నాడు. ఒక కెరటం మరీ సమీపంగా వచ్చింది. దోసిటి నిండా నీళ్లు పట్టి, సరదాగా ఎగరేశాడు. చిందిన నీటి తుంపరలు పెదిమలమీదపడి ఉప్పగా, కటువుగా ఉన్నాయి. 'థూ! థూ!' అని ఉమ్మేశాడు.

"అంతే రా....నోటి దాకావస్తే తూతూనే మరి దూరంగా ఉన్నంత సేపు ఉల్లాసంతో మైమరచి పోతాము. అనుభవంమీద అసలు రుచి తెలిపోతుంది. ఇక వెడదాం పద!" అంటూ లేచాడు.

ఇద్దరూ మౌనంగా నడిచి వెళ్లారు,

ఎవరి ఆలోచనలు వారివి. హాస్టల్ చేరేవరకు ఎవ్వరూ మాట్లాడలేదు.

ఆ రాత్రి భోజనం చేసిన తర్వాత ఇద్దరూ పచ్చిక మీదికి పోయి కూచున్నారు. ద్వాదశి వెన్నెల చలువ పందిరి పరిచింది. మరి కొంత మంది చేరటంతో, సంభాషణ కుంటువడింది.

"ఈసారి క్లాస్ బ్యూటీ - యూనివర్సిటీ బ్యూటీ ఎవరో?"

"మా క్లాస్‌లో కొత్తగా ఒక ముస్లిం అమ్మాయి జేరింది. ఆమె వెంట ఎప్పుడూ ఒక ట్రైన్ ఆఫ్ హ్యూమన్ బీయింగ్స్ ఉంటారు. ఆమె వెనక్కి తిరిగితే ఠక్కున ఆగిపోతారు. అంత వెర్రిగా ఆమెని అనుసరిస్తున్నారు. ఆ పిల్ల 'కేర్‌నాట్' లా తిరుగుతుంది. ఈ మధ్య ఎవరికో చెప్పు దెబ్బలు తప్పవు."

"అందుకు సిద్ధపడిన వాడే ఆమె ప్రేమకు పాత్రుడు కాబోలు!"

"సినిమాల్లో లాగానా? చెప్పుతో కొట్టి - నాల్గు రీల్స్ తిరిగాక చెప్పులు తొడుగుతుంది."

కొందరు నవ్వేశారు.

"మా క్లాస్ అమ్మాయి ప్రతిమ. అదొహలాంటి అందంరా. చూస్తేగాని తెలియదు. అబ్బో- ఏం గిర! చాలా రిజర్వ్‌డ్ టైప్."

"ముందు అల్లాగే ఉంటార్లే - క్రమంగా తేలుతుంది ఏ టైప్ అయిందీ!"

"ఆఁ, ఆర్డినరీ టైప్ మడిసే లేవోయ్!" ఒకడు తేల్చిపారేశాడు.

"నీ కళ్ళకలా ఉందేమో! - మా అందరి కళ్లకు ఆమె ఒక అప్సరస."

"ఓహో - అప్సరసల్ని చూసేసొచ్చావు కామా!" చచ్చే సీరియస్‌గా అన్నాడొకడు.

"ఏం - చూళ్లేదనుకున్నావా? ప్రతిమ - అమ్మా అప్సర ప్రతిరూపం!"

"సరేగాని, ఎంతమందిరా - ఆమెను చూసి గంగ వెర్రులెత్తిపోయింది....?"

"అంతేగాదు - ఆమెవాడి చూడ్కుల ధాటికి భస్మం అయినంత పని ఎందరి కైంది? చెప్పు చూసి పారిపోయిన దెందరు? పలాయన మంత్రం జపించిం దెందరు? ప్రిన్సిపాల్ గది ఇవతల పచార్లు చేస్తూ చెమటలు తుడుచుకున్న దెంతమంది?"

"అంతవరకు రాలేదులే!....ఏదీ ...ఇప్పుడేగా. ముందుందిలే అసలు తపన."

ఆ సంభాషణ వింటూ కూచున్నారేగాని అందులో పాల్గొనలేదు మహీధర్, వెంకటేశ్‌లు.

అంతా ఒక్కొక్కరుగా లేచి వెళ్లిపోయారు. మనసులో ఆమె రూపం నిండుకున్నది. ఆమె కళ్ళను పదేపదే గుర్తుకు తెచ్చుకుంటూ పరధ్యానంగా కూర్చున్న స్నేహితుడి తొడమీద గట్టిగా చరిచాడు వెంకటేశ్.

"అబ్బ -" అని ఉలికి పాటుతో వెంకటేశ్ వైపు చూశాడు.

"నువ్వే మాలోచిస్తున్నావో నాకు దెలుసు - మా చెల్లినిగూర్చి. కానీ, ఒక్క ప్రశ్న వేస్తాను. ఆలోచించి సూటిగా జవాబు చెప్పు.

ఏనాటి అనుబంధమో! మన ఇద్దరికీ వీడిపోని స్నేహం కుదిరింది. ఆనాటి నించి నిన్ను చూస్తున్నాను. బాల్య చాపల్యమే అను, టీన్ ఏజర్ వయసు ప్రభావమే అను, లేక నీ స్వభావమే అను - పేలపు గింజలా ఎగిరెగిరి పడ్తూంది నీ హృదయం. ఆ ఉద్రేకం-ఆ పొంగులో నువ్వు ప్రేమించి పెళ్లి చేసుకుంటేనే జీవిత మాధుర్యాన్ని సంపూర్ణంగా అనుభవించవచ్చు అనుకున్నావు. అదేమాట నాతో అన్నావు. ఆనాడు నేను అంతగా ఆలోచించలేదు. సరే- ఇప్పుడు ఈ అమ్మాయి మీద వాలింది నీ మనసు. ప్రేమిస్తున్నా ననుకుంటున్నావు. ఆమె ఉదంతమంతా కనుక్కొచ్చి నీకు చెప్పాను. ఎన్నో ఇబ్బందులు - ఆటంకాలూ ఉన్నాయి. మీ వాళ్ళు ఈ పెళ్లి కంగీకరిస్తారన్న విశ్వాసం నాకు లేదు. ప్రేమించే పిల్ల అన్ని విధాలా నీతో, మీ కుటుంబంతో సరితూగ గలదని ఎలా అనుకుంటావు? పిల్ల కులగోత్రాలు, పుట్టు పూర్వోత్తరాలు, ఆస్తిపాస్తులు - వ్యవహారాలు తెలుసుకుని ప్రేమించరుగా! ప్రేమ అనేది ఒకానొక సమయంలో అకస్మాత్తుగా జరిగే ఒక విస్ఫోటం. ఆ హృదయ పరిపాకం ఏ క్షణంలో, ఎవరిని చూస్తే కల్గుతుందో చెప్పలేము. నువ్వు నిజంగా ఆమెను చేసుకుంటావా? తలిదండ్రుల నెదిరించి, ధైర్యంగా ఆమె కోసం నిలబడతావా? ప్రేమిస్తున్నా ననుకుని అదృష్ట వశాత్తు ఆమె ప్రేమను పొంది - ఆమెలో కోరికలు రేపి, చివరికి ఇంట్లో చెప్పే ధైర్యం లేక నిస్సహాయతతో ఆమెను వదులుకో గలవా? ఆలోచించుకో! ప్రేమించి పెళ్లాడుతా నన్నావు-మరి ఇటువంటి సమస్య ఎదురైతే ఏం చేయ దలుచుకున్నావు? పోనీ, ముందరే రాసి కనుక్కుంటావా?" చివరి మాట అంటూ మెలిగా నవ్వాడు.

మహీధర్ ఉద్రేకపడి అన్నాడు:"ఉహుఁ. ఏమీ రాయను. చదువు పూర్తయ్యేవఱకు ఏదీ చెప్పను."

"అంటే- నువ్వు భయపడ్తున్నా వన్నమాట. నీ చదువు పూర్తి అవటానికి వారి సాయం కావాలి. ఆ తర్వాత మీ రెంత, మీ డబ్బెంత అని ఎదురు తిరుగుతావు!"

"అది సహజమే కదా? నన్ను పెంచి పెద్దజేసి చదివిస్తున్నారు.

అది వారి బాధ్యత. అంత మాత్రాన పెళ్ళికూడా వారికిష్టమైన అమ్మాయి తోనే జరగాలని లేదే. చేసుకునేది నేను. అనుభవించేది నేను. నా జీవన భాగస్వామిని ఎన్నుకునే హక్కు నాకుంది. ఈ ఒక్క విషయంలో వారి నెదిరించగలను. ప్రతిమ నా కోరికను మన్నిస్తే ఆమె కోసం నేను ఏమైనా చేస్తాను."

వెంకటేశ్ మహీధర్ చేయి అందుకున్నాడు.

"చాలా సంతోషం-అయితే, ఇక నువ్వు ఆమె ప్రేమ పొందటానికి శాయశక్తులా ప్రయత్నించు! - ఆమె కోసం ఈ సాహసం చేయదగినదే!"

చందమామ తెలిమంచు చిలకరిస్తున్నాడు.

చల్లగాలిలో కొంతసేపు మౌనంగా కూచున్నారు.

మహీధర్ ప్రతిమను తలుచుకుంటున్నాడు. ఆమెతో ప్రథమ సమావేశం ఎలా జరుపుకోవాలో కలలు కంటున్నాడు.

వెంకటేశ్ కళ్ళల్లో నాగరత్నం మెదిలింది. అమాయకంగా, ముదుముదుగా, మొరటుగా, ముద్దుగా నవ్వుతూ కనబడింది.

ఇద్దరూ లోపలికెళ్లారు. జీవితమే పంచరంగుల స్వప్నంగా మారిపోయినట్లు ఊహించుకుంటూ నిద్రపోయాడు మహీధర్.

# 8

ప్రథమ సోపానం ఎక్కాడు మహీధర్.

వెంకటేశ్ నాల్గురోజులుపోయాక అదనుచూసి ప్రతిమకి ఎదురు వెళ్లాడు. మహీధర్ వెంట ఉన్నాడు.

"ఏమ్మా! ఈయన మా ఫ్రెండ్ - డియర్ అండ్ నియరెస్ట్ - మహీధర్‌గారు. నా క్లాస్‌మేట్ - నాకు పీడికి ఒక్కటే తేడా!" ఇద్దరూ నమస్కరించుకున్నారు.

"ఏమిటో - " అన్నట్టు చూసింది.

వెంకటేశ్ నవ్వి ఊరుకున్నాడు.

"మీరేం చదువుతున్నారు?" మహీధర్ మొదటి ప్రశ్న.

"జూఆలొజీ ఆనర్స్," సన్నజాజుల్లాంటి పలువరుస తళుక్కున మెరిసింది. ఆ కంఠం సుకుమారంగా ధ్వనించింది.

ఇక ఏం మాట్లాడాలి-? తడుముకుంటున్నాడు. ఎప్పుడూ లేదు ఈనాడు ఈమె సమక్షంలో తను, అప్రతిభుడై పోతున్నాడు. ఆమె సౌందర్యాన్నాస్వాదిస్తూ, సన్నజాజి తీవలా స్తంభాన్ని ఆనుకుని ప్రసన్నంగా పలుకరిస్తోన్న ఆమె సోయగాన్ని చూసి విచలితుడౌతూ, ఏమీ ఆలోచించలేకపోతున్నాడు.

"ఇవ్వాళ ఏం పనిలేదుగా? మంచి సినిమా వచ్చింది. వెళ్దామా?" అన్నాడు మహీధర్.

"ఏమిటో?"

"ది గైడ్."

"ఏమోలెండి! నాకు వీలపదు. మీరు వెళ్ళిరండి."

"మీ ఇష్టం. ఏం తోచదేమో అని అడుగుతున్నాము." మళ్లీ మహీధరే.

"అన్నట్లు నాన్నగారు ఉత్తరం రాశారా? ఎలా ఉన్నారు?"

"మర్చేపోయాను. మీకు చాల థ్యాంక్స్ చెప్పమన్నారు."

"ఆ....ఎందుకులే? అంత బాగున్నారు గద!....వస్తాంమరి." ఇద్దరూ వెళ్ళిపోయారు.

"ఏదో మునిగిపోతున్నట్టు పుటుక్కున తుంచేస్తావ్!" విసుక్కున్నాడు మహీధర్.

"మొదట్లో అలాగే ఉండాలి."

ఆ తర్వాత మహీధర్ ప్రతిమను తరచు కలిసేవాడు. ప్రతిమ స్నేహితురాలు ఇందిరకూడ సరదాగా చనువుగా మాట్లాడేది. వాళ్ళిద్దరితో పిక్చర్‌కు, బీచ్‌కీ వెళ్ళేవాడు. ప్రథమంలోనే వెంకటేశ్ కార్యరంగంలోంచి తప్పుకున్నాడు. ఆ తర్వాత కొన్నాళ్లకు ఇందిరకూడా ప్రక్కకు తొలగిపోయింది.

వాళ్ళిద్దరే మిగిలిపోయారు. అంతవరకు అనుమానం-భయంతో అతి జాగ్రత్తగా మసలుతూ "నువ్వంటే నాకేం ఇదిలేదు. కేవలం నువ్వు స్నేహితుడివి మాత్రమే," అన్న ధోరణిలో మసలుతూ వస్తోన్న ప్రతిమ హృదయం అతని సమక్షంలో ఓడిపోయింది. యూనివర్సిటీకి కాస్త అవతలగా ఉన్న బీచ్‌లో కూచున్నారు. ఆమె అతని కళ్ళల్లోకి చూడలేక సిగ్గు దొంతరలమాటున వాల్చిన కళ్లను చూస్తూ తన్మయుడయ్యాడు మహీధర్. ఆమె భుజాన్ని తాకేటంత దగ్గఅగా వంగి మెల్లగా, లాలనగా, తన ప్రేమనంతా పొదివిపట్టి "ప్రతిమా!" అన్నాడు.

ఆమె తలత్రిప్పి అతని కళ్లలోకి చూసింది. అలా చూపులు కలియటంలో ఏదో మాధుర్యం ప్రవేశించినట్లు-అనుభూతి కల్గింది. ఇసుక మీద ఉంచిన ఆమె అందమైన చేతిమీద చేయివేశాడు. ఆమె తీసుకోటానికి ప్రయత్నించలేదు, కాని కళ్లు వాల్చేసి, "ఏమిటి?" అంది.

ఆ రాగరంజితాధరాల్లోని వంపుల్ని-ఆ వంపుల్లో కరుగుతోన్న హాసరేఖల్ని-ఆ హాస రేఖ లందించబోయే అమృతాన్ని తలంచుకుంటూ ఉద్రేకంతో గొణిగాడు:

"ప్రతిమా!....నిన్ను ఆనాడు స్టేషన్‌దగ్గర చూశాను. అప్పుడే నా హృదయం నీ వశమయింది.........నీకు వివరాలు చెప్ప నవసరం లేదు. నా హృదయాన్ని గ్రహించావు. నా ప్రేమను అంగీకరించావు. ఈ శుభసమయంకోసం ఇంతకాలం తపిస్తూ వేచి ఉన్నాను. ఈనాటికి నా తపస్సు ఫలించింది. ప్రతిమా! నన్ను పెళ్లిచేసుకోటానికి అభ్యంతరమా?" తడబడుతూ-ఆవేశంతో అడిగిన మహీధర్ కళ్లలోకి సూటిగా చూసింది, ప్రతిమ.

ఆమె చెక్కిళ్లను తడుపుతూ రెండు కన్నీటిబొట్లు జారినై. అదిచూసి సహించలేక సుకుమారంగా తుడవబోయాడు. ఆమే చటుక్కున ముఖం అటు త్రిప్పుకుంది.

"మన వివాహానికి మీ పెద్ద లంగీకరిస్తారా?"

ఆమె ప్రశ్నకు అతడు విస్తుపోయాడు - కాని, తమాయించు కుని ధైర్యంగా అన్నాడు: "ఉహుం, వాళ్లంగీకరించరనే నా నమ్మకం."

"అయితే?" కనుబొమలు ముడిపెట్టి గాభరాగా అడిగింది.

ఆమె చేతిని గట్టిగా వత్తి ధైర్యంచెబుతున్నట్టు అన్నాడు: "అయితే ఏముంది? వాళ్లను ఎదిరించటం, పెళ్లి చేసుకోవటం. ప్రతిమా! నీ గురించిన వివరాలన్నీ నాకు తెలుసు. తెలిసే నిన్ను చేసుకోవాలనుకున్నాను. ఆరు నెలల్క్రితం వెంకటేశ్ నన్ను నిలేసి అడిగాడు. ఇదే జవాబిచ్చాను. వివాహం అనేది వ్యక్తిగత విషయం. ఇందులో పెద్దలు జోక్యం కలిగించుకోకూడదనే నా భావం. మావాళ్లు ఎలాగూ అంగీకరించరు. కనుక, మీ వాళ్లంగీకరిస్తే పెళ్లి వాళ్లు జరిపించినట్లు జరుగుతుంది. లేదా వెంకటేశ్, మిస్ ఇందిరల సమక్షంలో రిజిస్టర్ మేరేజ్ చేసుకుందాం. సరేనా?" ఆత్రంగా అడిగాడు.

"అలాగే....నాన్నగార్కి రాసి కనుక్కోవాలి," అంది.

మహీధర్ ఆనందంతో ప్రతిమ చేతిని తన చేతులోకి తీసుకున్నాడు. "ఈ ఆనందాన్ని వ్యక్తం చేయటానికిగాని, వ్యాఖ్యానించటానికిగాని తగిన భాష నా దగ్గర లేదు ప్రతిమా!....కానీ....ఇదిగో...." అంటూ ఆ ఇసుకలో ఎండిన గడ్డిపొదలోంచి సన్నటి గడ్డిపరక తీసి గుండ్రంగా ఉంగరంజేసి ఆమె వ్రేలికి తొడిగి ఆ చేతిని ముద్దుపెట్టుకున్నాడు.

సంతోషంతో మెరిసే కళ్లతోచూస్తూ అతని చిరునవ్వుకు తన చిరునవ్వు అందించింది ప్రతిమ. అతని కళ్లు సూటిగా తన పెదిమలను చూస్తోంటే - సిగ్గు తెరలమాటున దాక్కుంటూన్నట్టు చటుక్కున చేయి లాక్కుంది. అతని కళ్లు సంతోషంతో తళుక్కుమన్నాయి.

మందలింపుగా చూస్తూ లేచి నుంచుంది.

"ఇక వెళ్దాం పదండి. రేపు సాయంత్రం వస్తే నాన్నగార్కి ఉత్తరం రాద్దాం" అంది కుచ్చిళ్లు సర్దుకుంటూ.

"ఐతే - నా దగ్గర కెప్పుడొస్తావు?" ఆశగా అడిగాడు.

"అన్నయ్య చెప్పాడు. మీరు పరీక్షరాసి పాసయిన తర్వాత."

"ఏం నేరం చేశానని - అంత శిక్ష?" దీనంగా అడిగాడు.

ఫక్కుమని నవ్వింది ప్రతిమ.

ఆమె నడుంచుట్టూ చేయివేసి తన ప్రక్కకు అదుముకుని చటుక్కున వదిలేశాడు.

ప్రతిమ కృత్రిమ కోపాన్ని అభినయించింది.

"అలా చూడకు నాకు మతిపోతుంది." వేడుకున్నాడు. ప్రతిమ నవ్వింది.

"రిజల్ట్స్ వచ్చిన తర్వాత - పాసయితే పెళ్లి."

"ఫెయిలయితే?"

ఇద్దరూ ముసిముసి నవ్వులు నవ్వుకుంటూ మెల్లగా నడుస్తూ వెళ్లిపోయారు.

ఆ సంవత్సరం గడచిపోయింది. పరీక్షలు రాశారు. ప్రతిమ కోసం - వెంకటేశ్ కోసం - మహీధర్ చాలా శ్రద్ధగానే చదివాడు. ప్రతిమకు తృప్తిగా ఉంది.

వాళ్లనుకున్నట్టే మహీధర్ తలిదండ్రులు ఈ పెళ్లి కంగీకరించలేదు. ప్రతిమ తల్లి తండ్రి కూతురిని మహీధర్‌ని చేసుకోటాని కభ్యంతరం చెప్పలేదు.

వారిద్దర్నీ చూస్తూన్న వెంకటేశ్‌కి హృదయంలో చిన్నపోటు ప్రారంభమైంది.

పరీక్షలు అయిపోయిన రోజు సాయంత్రం సరదాగా ముగ్గురూ వాలీ గార్డెన్స్‌కు వెళ్లారు. వాళ్లిద్దరిమధ్య తనెందుకను కున్నాడు - కాని, అదే ఆఖరు సారనుకుని వాళ్లు రమ్మంటే వెళ్ళక తప్పిందికాదు. అక్కడ కొంతసేపు ఉల్లాసంగా గడిపి వస్తూ వస్తూ, హోటల్ వెళ్లారు. అక్కడ కోకోకోలా తప్పించి వేరేవి తినటానికీ, త్రాగటానికీ అన్నీ అనర్హంగానే ఉన్నాయి. ఎదురెదురుగా కూచుని తాగుతున్నారు. స్ట్రాలు సన్నని శబ్దం చేస్తున్నాయి.

వెంకటేశ్ కనీసం బిస్కెట్స్ అయినా, చిప్స్ అయినా తాజావి దొరుకుతాయేమోనని బైటికెళ్లాడు.

మళ్ళీ వచ్చేసరికి వారిద్దరూ తాగుతున్నారు కాని, వాళ్ళ చూపులు పెనవేసుకుపోయి, ప్రస్తుతాని కతీతులైనట్లున్నారు. ఆమె

ముఖంలో క్రొం గ్రొత్త వెలుగు- ఆ కళ్ళలోని కొత్త తళుకు- పెదిమలపై లాస్యం చేస్తోన్న హాసరేఖలోని అందం చూసి పరవశిస్తోన్న మహీధర్‌ని చూసి, క్షణం స్తబ్ధుడై, అలాగే నిలబడి పోయాడు వెంకటేశ్.

ఏమిటో - తను జీవితంలో ఏదో మిస్ చేసినట్టు బాధపడిపోయాడు. ఔను మరి. ఇంతవరకు తను గడిపిన జీవితం అంతా శూన్యంగానే ఉండిపోయింది. వీళ్ళిద్దరూ అనుభవిస్తూన్న భావోద్రేకం గాని, ఆవేశంగాని తను లేశమైనా అనుభవించలేదు. వెనక్కి వెళ్ళి బైట కుర్చీలో కూర్చున్నాడు. తీయగా మాట్లాడుకోవటంగాని, కళ్ళలో కళ్లు కలిపి చిలిపి నవ్వులతో ఏదో అనుభూతికోసం వ్యగ్రతతో నిరీక్షిస్తూ ఆకలిగా, ఆశగా గుసగుస లాడుకోటంగాని తను ఎరుగడు. అధమం ఒక్క చిన్నమాట - కేవలం వారిద్దరి ప్రేమకి సంబంధించిన మాట - మాట్లాడలేదు. ఏ నాడు ప్రేమ తలపులతో గుండె ఝల్లుమన లేదు. అంత చప్పగా, అయోమయంగా, అనుభవ శూన్యంగా, చచ్చుగా కాలం గడిచిపోయింది.

కోర్కెలు విచ్ఛిన్నమై పోతున్నట్టు బాధ. అనుభవించ వలసినది ఏమీలేనట్టు, జవ ఉడిగి పోతున్నట్టు నిస్సత్తువతో కూర్చున్నాడు వెంకటేశ్.

తీయనికలలు కనటానికికూడా నోచుకోని హృదయం అతడిది! 'ప్చ్' అనుకుని బాధపడ్తున్న సమయంలో వారి ఇద్దరూ బైటికొచ్చారు.

నీ రెండ లీనుతూన్న సంధ్యా సమయం అది. ఆ మృదు కాంతిలో ప్రతిమ ముఖం మరీ అందంగా కనబడింది. హృదయంలోని ఆనందం ముఖంలో ప్రతిఫలిస్తూంటే ఆశ్చర్యంగా చూశాడు. మహీధర్ హుషారుగా ఏదో చెబుతున్నాడు. సిగ్గుల చిరునవ్వులు చిలకరిస్తూ వింటూంది.

వెంకటేశ్ ముఖం త్రిప్పుకున్నాడు.

"నీ కోసమే ఇంతసేపు చూశాము."

వెంకటేశ్ ఫకాలున నవ్వేశాడు.

"అంతా అబద్ధం - ఏమ్మా. అబద్ధమేకదూ?"

"ఔనన్నయ్యా!" అంటూ చిలిపిగా ఓరగా మహీధర్ వైపు చూసి నవ్వింది.

"నాకు తెలుసు - ఎప్పటికీ అన్నా చెల్లెల్లూ ఒకటౌతారని!" బుంగమూతిపెట్టి తర్వాత కనుబొమ లెగరేసి, "వాట్ నెక్ట్స్?" అని అడిగాడు మహీధర్.

"రేపు అందరం బయలుదేరదాం." వెంకటేశ్ అన్నాడు.

"ఈ రాత్రికి కూచుని ప్రోగాం వేసుకోవాలి. దాన్నిబట్టి నువ్వు పెళ్లికి రావాలి."

"నువ్వు కాదు - ఇద్దరూ రావాలి." ప్రతిమ సరిజేసింది.

"ఔనౌను. నువ్వూ, చెల్లెమ్మ రావాలి."

"ఏమో-? ఇంకా అమ్మా నాన్నా అంటూ కూచుంటే? నేనొక్కడినే వస్తాగా."

ప్రతిమ మందలిస్తున్న దానిలా చూసింది. "ఆమె చిన్నదే కానివ్వండి. చదువు లేదనుకోండి - కాని, ఇంకా అమ్మా నాన్న అనేటంత అమాయకురాలు కాదు."

"ఏమో-? ఇంతవరకూ నేను పంపిన పుస్తకాలు అందినయ్యనికూడా రాయలేదు. అంటే రాయించ లేదు. అంత చిన్న కోరిక తీర్చలేక పోయింది. పెళ్ళయితే చాలు ననుకుంటున్నది కాబోలు. నాకు తగినభార్యగా తన్నుతాను తీర్చిదిద్దుకోటాని కేవిధ మైన ప్రయత్నమూ చేస్తున్నట్టు లేదు."

"అంతగా ఫీలవు తావెందుకు? రేపు వస్తుందిగా- నువ్వే తీర్చి దిద్దు." మహీధర్ సలహా యిచ్చాడు.

"సరి సరి....ఇంటో పెళ్లాన్ని తీర్చి దిద్దుకుంటూ కూచుంటే త్వరలోనే అల్లా తయారయి పోతాం," అంటూ దూరంగా వస్తూన్న పండు ముసలివాణ్ణి చూపించాడు.

ప్రతిమగాని, మహీధర్‌గాని నవ్వలేదు. పైపెచ్చు ప్రతిమ ముఖం గంభీరంగా మారింది.

"ఆమెకి కాస్త టైం ఇవ్వండి. ఆ నాల్గు గోడలు వదలి

బైటకు రానివ్వండి. మీరు కోరిన విధంగా రూపొందించుకుని వస్తుంది. కాళ్ళ వెండిగొలుసుల్ని తీసి పారేస్తుంది. ఒక్కరోజున చూడండి! పట్నంజేరితే అవన్నీ మానకుండా ఉంటారా?"

"ఏమో - దానికెంత రాద్ధాంతం చేస్తుందో!"

"చేయదనే అనుకుందాం."

వెంకటేశ్ బిగ్గరగా నవ్వాడు. "బ్రౌనా - మహీధర్! ఇప్పుడు నీకు లోకమంతా పచ్చగా, అందంగా, ఆనందంగా కనబడ్డంతో ఆశావాదివయ్యావు. నీకు ఏ సమస్యలూ లేవు .... సరే పదండి! .... రిక్షా ఎక్కండి" అన్నాడు.

రిక్షాలు బయలుదేరినై. చుట్టూఉన్న పరిసరాలను దాటిపోతున్నాయి రిక్షాలు. కాబోయే దంపతుల ఊహాలు మరింత వేగాన్ని పుంజుకుంటున్నాయి. వెంకటేశ్‌ను ఒహాలాంటి స్తబ్ధత ఆవరించింది - ఎందుకో తనకే అర్థంకాలేదు.

మరుసటిరోజు అందరూ రైలెక్కారు. మొదట రాజమండ్రిలో మహీధర్ దిగిపోయాడు. స్టేషన్‌కు ఎవరూ రాలేదు. వస్తున్నానని రాస్తేగా - అసలు రావటానికి? రైలు ఇంకో పది క్షణాలకి కదుల్తుందనగా బండి దిగాడు. వెంటనే కిటికీ దగ్గరకొచ్చి ఆత్రంగా ఆమెచేతి అందుకున్నాడు.

"వస్తాను .... సరేనా? బి-బ్రేవ్!"

ప్రతిమ కళ్లలో కన్నీటి పొరలు చూసి చకితు డయ్యాడు.

వెంకటేశ్ ఇక మౌనంగా ఉండదల్చుకోలేదు.

"అరే!....టైం అవుతోంది. కాసిని మంచినీళ్ళయినా తెచ్చివ్వు" అంటూ బాటిల్ అందించాడు.

మహీధర్ ఆమె చేతిని గట్టిగా నొక్కి వదలి వెళ్లాడు. ఇలా నీళ్లు తెచ్చాడు- అలా రైలు కదిలింది. కనుచూపు దూరమయ్యే వరకు ప్రతిమ చేయి ఊపుతూనేఉంది. విడిపోతున్నామన్న విషాదం, ఆవేదన, ఆమె ముఖంలో ప్రతిఫలిస్తున్నాయి. ఇదొక నూతన అనుభూతి - ఈ దృశ్యం వెంకటేశ్ హృదయంలో బలంగా నాటుకు

పోయింది. తిరిగి కలిసేవఱకు ఆమె మహీధర్ నిరీక్షణలోనే కాలం గడుపుతుంది. 'ఇందులో ఎంత ఆనందముంది!' అనుకొన్నాడు.

తరువాత స్టేషన్‌లో దిగి తాను కాఫీ త్రాగి, ప్రతిమకు తెచ్చిచ్చాడు.

వాళ్ళిద్దరూ చాలాసేపటిదాకా మాట్లాడుకోలేదు. ప్రయాణికులు వీరినిగూర్చిన వివరాలు తెలుసుకోవాలని ఆత్రపడ్తున్నారు. అది వారికేవిధంగాను లాభకరంకాదు. అయినా మనిషిలో అదో బలహీనత.

ఒక రిద్దరు పలుకరించారు. ముభావంగా సమాధానం ఇవ్వటంతో మరి వాళ్ళు మాట్లాడలేదు.

విజయవాడలో రైళ్లు మారారు. ఆ తర్వాత గుంటూరు. ఇద్దరు దిగారు. ప్రతిమతండ్రి రావుగారు స్టేషన్‌కొచ్చారు.

"నాన్నా!" అంటూ పిల్చింది. ఆయన రాగానే, వెంకటేశ్ నమస్కరించాడు.

"అరె .... దిగేశారే .... బావున్నారా? .... ఏం వెంకటేశ్! మీ చెల్లెలు,మీ ఫ్రెండూ ఈ సంవత్సరంలో చదువెంత చదివారోగాని, జీవితానికి సంబంధించిన అతిముఖ్యమైన విద్యలో ఫస్ట్‌గా నెగ్గారనుకుంటున్నాను."

"మా వాళ్లు అన్నింటిలో ఫస్టే - మరి దీన్లో కూడ ఫస్టే.... మీరు క్షేమంగా ఉన్నారు కదా!...."

"ఆ.... ఇలాగే ఉన్నాము. ఇదిగో ఈమెను గూర్చి...."

"అలా వెయిటింగ్ రూం...."

"అన్నయ్యా....మా ఇంటికి రావాలి....కాస్త రెస్ట్ తీసుకుని...."

"బానబ్బాయ్! ఈ పెళ్ళి గొడవలు నాకు తెలియవు. మీ పిన్నిగారు ఎంతో ఆత్రంతో నిన్ను చూడాలని, మాట్లాడాలని ఎదురు చూస్తోంది. పద...." అంటూ వెంకటేశ్ ఎంత వారిస్తున్నా వినకుండా బైటికి నడిపించాడు. కూలీలు సామాను తీసుకుపోతూంటే, నిస్సహాయతతో వెళ్ళాడు. రావుగారు కార్లో కూచున్నాడు. ప్రతిమ,

వెంకటేశ్‌లు కూడ సామాను పెట్టించి కారెక్కారు. "సెకండ్‌హాండ్ కొన్నానమ్మా - బహుశః థరు హాండేమో కూడా తెలీదు" అంటుంటే ముగురూ నవ్వేశారు.

చిన్న గేట్ ముందు - కొరిటిపాడులో కారు ఆపాడు. దాదాపు నలభై సంవత్సరాల స్త్రీ మెట్లమీద కూచుని వీరిని చూడగానే ఎదురొచ్చింది. ఆమె ప్రతిమ తల్లి అని చెప్పకనే చెపుతున్నది. బాగా పొడుగ్గా, సన్నగా, మెరుపు తీగలా ఉంది. చెవులకి బాగా పెద్ద పెద్ద బంగారు కమ్మలు, జూకాలు ఆమె ఆంధ్రేతర వ్యక్తిత్వాన్ని వెల్లడిస్తున్నాయి. ఎడమ ముక్కుకి సన్నటి రాతి ముక్కు పుడక. చేతులకు బంగారు మురుగులు. వెంకటేశ్ ఆమెకు నమస్కరించి నుంచున్నాడు. ఆమె ప్రతి నమస్కారం చేసింది. ప్రతిమ పరుగునవెళ్ళి తల్లికౌగిట్లో ఒదిగిపోయింది. కాసేపు కూతురి వీపు నిమిరి చటుక్కున ప్రతిమ ముఖాన్ని రెండు చేతుల్లోకి తీసుకుని.... "ప్రతిమా!....ఇలా అయిపోయావేమిటే!...." అంది కూతురి చిక్కిపోయిన ముఖంలోకి సూటిగా చూస్తూ.

రావుగారు నవ్వారు...."ఇరవై ఒక్క సంవత్సరాల క్రితం కాన్పూర్‌లో నువ్వు కూడా ఇలాగే అయిపోయావు, ఒక్క వారం నేను కనబడనన్న ఆదుర్దాతో...." అంటుంటే, ఆమె చెక్కిళ్ళలోని కెంపులు కొంగ్రొత్త వెలుగు నింపుకున్నాయి. అందమైన నవ్వుతో వికసించిన ముఖాన్ని చూస్తూంటే వాళ్ళిద్దరూ ప్రేమికులన్న విషయం ఇప్పటికీ తాజాగా ఉంచుకున్నారన్న రహస్యం బయట పడుతూంది. ఆ తలంపులతో వారు నవనవోల్లాసంగా, అనురాగంతో జీవితాలు గడుపుతున్నారు. ఒడుదుడుకులు, సాధక బాధకాలు లేకుండా సాగుతున్న జీవితాలు వారివి.

ఆమె ముసిముసి నవ్వులు ఒలకబోస్తూ లోపలికి నడుస్తూ అంది:

"రా బాబూ! మీ బాబుగారి మాటలు ఎప్పుడూ అంతే! సమయాసమయాలు తెలియవు."

విద్యుల్లతలా శోభిస్తున్న ఆమెను చూసి అనుకున్నాడు:

'ప్రతిమ తల్లి అత్యంత రూపసి అయి ఉంటుంది. ఇప్పుడే ఇంత సౌకుమార్యం, మార్దవం, సౌందర్యం మూర్తిభవించినట్టుంటే ఇక యౌవనంలో ఆమె ఇంకెంత అందంగా ఉండేదో!'

స్నానం భోజనం అయిన తర్వాత - ఆమె వెంకటేశ్ దగ్గర కొచ్చి కూచుంది. మహీధర్‌ను గూర్చిన వివరాలు - అంతవరకు తెలియనివి ఎన్నో అడిగి తెలుసుకుంది. అంతా విన్న తర్వాత ఒక్కసారి నిట్టూర్చింది.

"చూడు బాబూ! మాకు, మా పుట్టింటి వారికి సంబంధం లేదు. ఇటు మా అత్తగారు కూడ అంత కలుపుగోలుగా ఉండరు. చుట్టపు చూపుగావచ్చి ఏదో గొడవలు చేసి వెళ్తుంటారు. ప్రతిమకు ఆ భగవంతుడెలా రాసి పెట్టాడో! నేననుకునే దాన్ని - అటు, ఇటు రెండు వేపులా ప్రతిమకు ఏ కొదువ లేకుండా జరిగిపోవాలని. కానీ, ఇలా ఆయింది. బిడ్డకు అత్తవారింటితో సంబంధమే ఉండదనుకుంటాను."

"మొదట్లో బిగిసి ఉంటారనుకోండి - కాని రానురాను అదే అలవాటవుతుంది. అందులో వారికి ఒక్కడే కొడుకు."

"అయితే మాత్రం! దారితప్పి వెళ్తే, మరి తిరిగి రమ్మనమని ఎన్నటికీ అననివాళ్లెందరులేరు? ఇలాంటివి జరిగితే ఆ వాత్సల్యం, మమత అన్నీ ఎటు పోతాయో! ఏదో ప్రేమ, ప్రేమ అంటూ పెళ్లాడబోతున్నారు. అయితే, ఇదెంతవరకు జయప్రదమౌతుందో కాలమే తేల్చాలి."

"అంతే పిన్నిగారు! కాని, ఒక్కటి చెప్తున్నాను. మహీధర్ మంచివాడు, సహృదయుడు."

రావుగారు అందుకున్నారు: "అనే అనుకుందాం. వెంకటేశ్! ఒకమాట విను. ప్రతిమకు ఒక్క మా అండదండే మిగుల్తుంది. కనుక, ఇక్కడే ఉద్యోగంచూస్తే అందరికీ వీలుగాను, సుఖంగాను ఉంటుంది."

"అంటే ఇక్కడ ఉద్యోగం దొరికే సూచనలున్నాయంటారా?"

"ఒక్క మహీధర్‌కే కాదు- నీకు గూడా."

వెంకటేశ్ విస్తుపోయాడు. "ఉహుం...." అని కళ్లు పెద్దది చేశాడు.

"ఇక్కడ నా స్నేహితునికి వర్క్‌షాప్ ఉంది. అందులో ఒక రికి ఖాళీ ఉంది. సిండికేట్ బాంక్‌లో మీలాటి వారికి చిటికెలో ఉద్యోగం దొరుకుతుంది. మీ ఇద్దరు ఆలోచించుకుని చెరో దానిలో చేరిపోతే, బావుంటుంది. మీరిద్దరూ ఒకేచోట ఉంటారు. మా అమ్మాయి మా కళ్ళముందే ఉంటుంది. స్వార్థంతోనే అంటున్నా ననుకో...."అంటూ చిన్నగా నవ్వాడు.

వెంకటేశ్ ముఖంలో ఆనందం మూర్తీభవించింది.

"మీకు చాలా థ్యాంక్స్. ఉద్యోగాన్వేషణలో ఎన్ని రోజులు గడపాలో అని ఎంతో వర్రీ అవుతున్నాము. మీ దయవల్ల ...."

"దయ కాదోయ్....ఇది స్వార్థం...." అంటుంటే వెంకటేశ్ ఆరాధిస్తున్న వాడిలా చూశాడు.

"స్వార్థంతోనే మాకూ మేలు చేస్తున్నారు. మీకు సదా కృతజ్ఞుణ్ణి" అంటూ చేతులు జోడించాడు వెంకటేశ్.

"వచ్చే సోమవారమే పెళ్ళి. నువ్వు నీ భార్యను తీసుకుని తప్పక రావాలి. ఇక్కడ నాకు స్నేహితులు తప్ప అయినవాళ్లెవరూ పెళ్ళికి రారు."

"చూడు బాబూ! శుభ కార్యం జరుగుతున్నా, ఏవేవో తగని పట్టింపులతో, వారి మర్యాద కేదో భంగం కల్గుతుందో అని సంశయంతో రారు. పోనీలే. అటువంటి వారు రాకపోవడమే మంచిది."

"అయితే - మీ వాళ్ళెవరూ రారా పిన్నిగారూ?"

"నాన్నగారు తప్ప అందరూ వస్తారు. మా చిన్న తమ్ముడికి రావాలనుందిగాని, నాన్నగార్కి భయపడి రావటంలేదు. పిల్లిద్దర్నీ అక్కడికే పంపాలట! ఒక వైపు పురోగమిస్తూన్న సంఘం - మరో వైపు ప్రాచీన సంప్రదాయాలు, కట్టుబాట్లు - వీటి మధ్య సమన్వయం కుదుర్చుకో లేక నానా అవస్థ పడ్తారు. అయ్యో - పెళ్లికి వెళ్ల లేక పోతున్నామే అన్నబాధ కనబడుతుంది. మళ్ళీ హృదయం కఠిన పర్చుకుంటారు. పోనీలే. వాళ్ళు రానంత మాత్రాన పెళ్ళి ఆగిపోదుగా! మరి వాళ్ళ వాళ్ళెవరేనా వస్తారా బాబూ?"

"రాకపోవచ్చు."

ప్రతిమ తల్లి మౌనం దాల్చింది. ఆ గదిలో అందరూ నిశ్శబ్దంగా కూచున్నారు. బహుశః ఆమె తన పెళ్ళిని గుర్తుకు తెచ్చుకుంటూంది కాబోలను కున్నాడు.

"పోనీలే. ఈకాలం పెళ్ళిళ్ళు క్లుప్తంగానే జరగాలి. అలాగే చేద్దాం. ముచ్చటగా దగ్గర్లో పెట్టుకుని ఆనందిద్దాం" అన్నారాయన.

ఆ రాత్రికి ఆగి మరుసటి రోజు పల్లెకెళ్ళిపోయాడు వెంకటేశ్. బస్సులో కూర్చున్నాడేగాని ఆలోచనలన్నీ రావుగారి కుటుంబాన్ని గూర్చే. ముచ్చటైన కుటుంబం అది. అక్కడ గడిపినది కొన్ని గంటలే అయినా తన కెంతో హాయి గల్గించింది. మనసెంతో ఉల్లాసంగా, ప్రశాంతంగా ఉంది. పల్లె సమీపిస్తున్న కొలది ఇంటి వాతావరణం గుర్తొచ్చింది. అక్కడ తనకేదీ కొదువ లేదు. తనని ప్రాణప్రదంగా చూసే తల్లీ, తండ్రీ, తోబుట్టువులూ ఉన్నారు. అయినా, తనకు ఏదో కొరతగానే ఉంది. తనకు తగిన వాతావరణం కాదది. అక్కడ నీరు విడిచి ఒడ్డునబడ్డ చేపలా ఫీలవుతాడు....తర్వాత నాగరత్నం గుర్తొచ్చింది. తను చూచి ఆరు నెలలు దాటిపోయాయి. ఎలా ఉందో! మరీ మొరటుగా తయారైందో! లేక నాజూకుగా తయారైందో! నాగరత్నం అందమైనదే కాని- అలంకరణలో, వస్త్రధారణలో బొత్తిగా టేస్టు లేదు. పంచ వన్నెల చిలుకలా ఉంటే అందమను కుంటుంది. పిచ్చిది!

అలా ఆలోచనా స్రవంతిలో కొట్టుకు పోతున్నాడు.

పల్లె చేరింది బస్సు. సుపరిచితమైన రావిచెట్టు_చుట్టూ నాగుబాము పుట్టలు-దగ్గరే ఉన్న దిగుడు బావి, దాన్ని ఆనుకుని నాలుగైదు పాడుబడిన శిల్పాలు - ఆ తర్వాత రచ్చబండ- అన్నీదాటిపోయి హోటల్‌కు అవతలగా బస్‌స్టాండ్ అనబడే ఖాళీ స్థలంలో ఆగింది బస్సు. ఒక్కసారి ఒళ్ళు విరుచుకుని బస్సు దిగాడు.

# 9

పెళ్ళికి వెంకటేశ్ ఒక్కడే వెళ్ళాడు. దానికి కారణాలు ఏవేవో చెప్పాడు గానీ అసలు విషయం హృదయంలో గుప్తంగా దాచుకున్నాడు. అది అతన్ని ఎంతగానో బాధపెడ్తోంది.

ఇది వర్ణాంతర వివాహం. బాగా చదువుకున్నవారు, పెద్దపెద్ద ఉద్యోగస్థులు, రకరకాల ప్రాంతాలవారు, అధునాతన పద్ధతులను, అలవాట్లను జీర్ణించుకున్నవారు, ఇతరులను విశాల దృష్టితో చూడగలవారు, సంఘసంస్కరణల విషయంలో పట్టుదలజూపి చేయూత ఇస్తూ ప్రోత్సహించేవారు అక్కడ కూడుతున్నారు. వారి మధ్య నాగరత్నం ఇమిడిపోలేదు. ప్రతి ఒక్కరిని, ప్రతి చిన్నపనిని, ప్రతి కదలికను వింతగాను, ఆశ్చర్యంగాను చూస్తూ, తనకు కోపం విసుగు తెప్పించగలదు. ఆమె చర్యలు హాస్యాస్పదంగాకూడా ఉండవచ్చు. ఒక వింత జంతువును చూసినట్లు చూస్తారేమో। ఏదీ అలవాటు లేకుండా ఒక్కసారి వారి మధ్యకి తీసుకుపోతే నాగరత్నం వారిలో కలిసిపోలేదు. వారిని చూపి నేర్చుకోలేని అమాయికత్వం ఆమెలో ఉంది. మొన్న తను వెళ్తే. ఇంకా గాడీగానే డ్రెస్ చేసుకుంది. ఆమెకి ఏమీ తెలియదు. ఇలాంటి పిల్లని తీసుకెళ్ళకుండా ఉండటమే శ్రేయస్కరం అనుకున్నాడు.

ఒంటరిగా దిగిన వెంకటేశ్‌ను చూసి ప్రతిమ తల్లి చాలా నొచ్చుకుంది. ప్రతిమ పసిగట్టింది.

"ఆమెను - నేను చూసుకునేదాన్నికదా। ఎందుకు తీసుకురాలేదన్నయ్యా?" అని దెప్పింది.

పెళ్లికొడుకు, అతడి మేనమామ కొడుకూ దిగారు. మేన

మామ కొడుక్కి కాస్త స్క్రూ లూజ్ అంటారు. ఇలాంటివాటికి వెళ్ళటం తప్పుగా భావించదు - అందుకే ఆ బిరుదు.

పెళ్ళికొడుకు సడీ చప్పుడు లేకుండా దిగాడు గాని, బంధువులంతా బిలబిలమంటూ దిగుతున్నారు. జంటలు జంటలుగా పిల్లలతో దిగుతూన్నవాళ్ళని చూసి వెంకటేశ్ చాల ఆశ్చర్యపోయాడు. చక్కగా ముస్తాబై కడిగిన ముత్యాల్లా దిగుతున్నారు. స్త్రీలంతా ఎంతో అందంగా కనిపిస్తున్నారు. ఒక్కొక్కరు ఒక్కోరకం ముడివేసుకుని, దానికి సరిపడా పూలు, పిన్నులు పెట్టకున్నారు. రంగులు చక్కగా మాచ్ అయ్యేట్టు గుడ్డలు వేసుకున్నారు. పెట్టుకున్న నగలుకూడ నాజూకుగా ఉన్నాయి. ఇదంతా గమనిస్తూ వెంకటేశ్ తనలో తానే ఆశ్చర్యపోయాడు. వాళ్ళను చూస్తూ అప్రయత్నంగా నాగరత్నాన్ని వాళ్ళతో పోల్చి చూసుకున్నాడు.

నాగరత్నాన్ని ఇలా తయారుచేయాలంటే ఎన్నేళ్లు కావాలో! అనుకున్నాడు.

పెళ్లి పదిహేను నిమిషాల్లో అయిపోయింది. వాగ్దానాలు చేసుకుని పూలమాలలు వేసుకున్నారు. తర్వాత మహీధర్ పుస్తెలు కట్టాడు. భార్యా భర్తలు జంటలు జంటలుగా కూచున్నారు. ఆ దృశ్యం చూసి ఎంతో ముచ్చటపడ్డాడు వెంకటేశ్. ఒకతను భార్య తలలో పూలు కాస్త ఒదులై జారితే, సర్దుతున్నాడు. మరొకతను భార్య చేతిలోని చంటిబిడ్డను అందుకుని ఆమెకు విశ్రాంతి ఇస్తున్నాడు. ఇంకొకతను నిండు గర్భవతియైన భార్యకు కాఫీ తెచ్చి ఇస్తున్నాడు. ఒకామె భర్త తల వెంట్రుకలలో కూరుకుపోయిన అక్షింతలను ఏరివేస్తోంది. మరొకామె భర్త ప్రక్కన కూచుని మెల్లిగా కబుర్లు చెబుతూంది; అతని ప్రత్యుత్తరాలకు గువ్వలా ముడుచుకుపోతూంది- నవ దంపతులేమో!

అబ్బ - నాగరత్నాన్ని తీసుకురాకపోవడమే మంచిదైంది, అని తన్ను తాను అభినందించుకున్నాడు వెంకటేశ్. అందరి సమక్షంలో ఆమె తనతో అంత చనువుగా మసలదు. మసలలేదని తనకు కోపం, చికాకు, నాగరత్నంమీద అనవసరంగా విసుగు, కసురుకోవటంలాంటి వన్నీ తప్పాయని ఆనందించాడు. ఆ పరిసరాలు - ఆ వాతావరణమే

తనకు ఆహ్లాదాన్ని కల్గిస్తుంది. ఏమిటో - తనకు ఏమీ చేతకాదు. అందరూ 'ఊ' అన్నారని - తనుగూడ 'ఊ' అని ఆమెను చేసుకున్నాడు. మహీధర్‌లా అగినట్లయితే విద్యావతి, తనకు తగిన యువతి దొరికేది. "ప్చ్" అనుకున్నాడు.

అందరివద్ద సెలవు తీసుకుని, తెచ్చిపెట్టుకొన్న సంతృప్తి, ఆనందం ముఖాన పులుముకుని రిక్షా ఎక్కాడు. హృదయ భారం ఉద్ధృతమైంది. మెల్లగా, సన్నగా, బాధగా నిట్టూర్చాడు వెంకటేశ్.

## 10

వెంకటేశ్ తన పల్లె మొగలిచెరకు వెళ్ళాడు. క్రమంగా, నూతన జీవితంలో నిండుగా, హుందాగా అర్ధాంగితోపాటు అడుగు పెట్టాడు.

కాంక్షలు - కోరికలు - ఆశలు- ఆశయాల చైతన్యస్రవంతిలో ఉత్సాహంగా పయనించబోతున్నాడు.

ఈ జీవితం అందంగా, ఆశాజనకంగా, ఆనందంగా, చైతన్య పూరితంగా ఉంటుందని ఆశించాడు. కాని, ఎన్నో అనుమానాలు - రత్న అతి సామాన్యమైన స్త్రీ. ఆమె సాహచర్యంలో తన కోర్కెలు ఫలిస్తాయా అని.

వెంకటేశ్ వర్క్‌షాప్‌లో ఎస్టేట్ ఆఫీసరుగా నెలకు నాల్గు పందల జీతంమీద పనిలో జేరాడు. సిండికేట్ బాంక్‌లో మహీధర్‌కు ఉద్యోగమైంది. ట్రెయినింగుకని ఆరునెలలు బొంబాయి పంపించారు.

వెంకటేశ్ నాగరత్నంతో గుంటూరులో కాపురం పెట్టాడు. ఎనభై రూపాయలకు కొరిటిపాడులోనే రెండు గదుల చిన్న ఇల్లు అద్దెకు తీసుకున్నాడు.

నాగరత్నం భర్త తర్ఫీతులో బాగానే తీరివస్తుంది. గుంటూరు చేరిన వారంలో ఒకసారి వెంటతీసుకుపోయి నాల్గు స్థలాలూ చూపించా లనుకున్నాడు. తయారవమన్నాడు. ఆమె మామూలుగా తనకున్న

మంచి చీరల్లో ఒకటి తీసుకుని, మరొక రవికె తీసుకుంది. ముస్తాబై బైటికొచ్చింది.

ఆమెను పదినిమిషాలు ఎగాదిగా చూశాడు. నాగరత్నం సిగ్గుతో సంజవేళ తామరమొగ్గలా ముడుచుకుపోయింది గాని, భర్త ముఖంలో ద్యోతకమైన అసంతృప్తి తాలూకు నవ్వుచూచి అమాయికంగా అతని వంక చూసింది.

"రత్నా! ఆ చీరమీదికి నీలిరంగు రవికె వేసుకోవాలి. గులాబికి నీలం, కనకాంబరానికి నలుపు, అలా వేసుకోవాలి. సరేగాని, మనం వెళ్లేది పేరంటానికి; పెళ్లికి కాదు. ఒక్కగొలుసు వేసుకో చాలు. చేతు లకు అన్నిరంగుల గాజులు వద్దు. బంగారు గాజుల్లో ఒకటో రెండో నీలంరంగు గాజులు వేసుకో...." అంటూ హెచ్చరిస్తూ, బోధపరుస్తూ తెలియజెప్తుంటే రత్నం విస్తుపోతూనే మౌనంగా అతను చెప్పినట్లు చేసింది. మనసులో, భర్త ఎందుకలా చెబుతున్నాడో అర్థంకాక సత మత మయ్యేది.

"కొన్ని కొత్త స్థలాలు చూపిస్తాను. శ్రద్ధగా చూడు. ఆడ పిల్లల్ని బాగా గమనించాలి. ఇది పల్లె కాదు. అందుకని ఆడపిల్లలు-అబ్బాయిలు చాలా చనువుగా కలసి మెలసి తిరుగుతుంటారు. వారిని తెల్లబోయి చూడకు. 'అదేవిటండీ?' అని బిగ్గరగా అడక్కు" అని బోధపర్చి రిక్షా ఎక్కాడు.

భర్త ప్రక్కన కూచోటానికి - అలా టాప్‌లేకుండ రిక్షాలో వెళ్ళటానికి రత్న సిగ్గు పడింది. కాని, ధైర్యంచాలక గుప్‌చిప్‌గావెళ్ళి కూచుంది. మెయిన్‌రోడ్ ఎక్కింది రిక్షా. సినిమాలకు వెళ్తున్న జనంతో రోడ్లు క్రిక్కిరిసి ఉన్నాయి. అందంగా తయారై, పంచరం గుల చిలకల్లావెళ్తున్న ఆడవాళ్ళని చూసి రత్నకు చాలా ఆశ్చర్యం వేసింది. పట్నవాసపు మెరుగులు, అంద చందాలు చూస్తూ- మధ్య మధ్యలో భర్తను మెల్లగా ప్రశ్నిస్తూంది. కాలేజీల దగ్గర కొచ్చేసరికి వాతావరణం పూర్తిగా మారినట్లుంది. రత్నకు అంతా కొత్తగా ఉంది. అయితే, జంటలు జంటలుగా చనువుగా వెళుతూన్న వాళ్ళంతా భార్యా భర్తలు కాదని తెలిసి ఆమె ఎంతో ఆశ్చర్యపడింది. ఇంట్లో అడుగు

పెట్టినతర్వాత చాటుగా అద్దంలో తన ప్రతిబింబం చూసుకుంది. ఏదో మొరటుదనం కొట్టవచ్చినట్లుంది. ఆ ఒక్కగంటలో ఎందరినో ఆడ వారిని చూసింది. ఒక్కరుగూడ తనలా లేరు. తనకు మహాఉంటే పదహారేళ్లుంటాయి. ఆ వయసులో ఉన్న విద్యార్థులలో ఎంత నాజూకు దనం ఉంది! ఏదో వేరే ప్రపంచంలోంచి వచ్చినట్లుంది తను. తన భర్త తనుగూడ అలా ఉండాలని కోరుతున్నాడా? పోనీ, అలాగే అలంకరించుకుంటే ఏం? అంతరాత్మ ఫకాలున నవ్వింది. 'పిచ్చిదానా! వాళ్లు విద్యార్థులు - పెళ్ళికాని పిల్లలు. వారి సరదాలు, వారి ఉత్సాహం- వారి బాధ్యతలు - వారు పెరిగే వాతావరణం వేరు. నువ్వు సామాన్య మైన గృహిణివి. నువ్వుగూడ అలాగే అలంకరించుకుంటే రేపు పల్లెకు వెళ్లినప్పుడు అంతా ఏమనుకుంటారు? అలంకారంవల్ల సంస్కారం రాదు. అది నీ హృదయంలోంచి రావాలి. నీ భర్తకు నచ్చిన తీరులో అలంకరించుకో! కాని, కొంత విచక్షణ అవసరం. ఇతరులలో సహించే ఫ్యాషన్లు స్వంత భార్యలో సహించేటంత విశాలహృదయం భర్తలకుండదు. పరస్త్రీ విషయంలో వారి దృక్పథం వేరు. అర్ధాంగిలో వారి భావాలు వేరుగా ఉంటాయి. తొందరపడకు.' అంతరాత్మ తనకర్థమయ్యే భాషలోనే బోధపర్చింది. పోనీయ్ - తను వాళ్ళను కాపీ గొట్టటం దేనికి? అనుకొంది రత్నం.

నాలుగైదు రోజులు పోయాక, హిందీ సినిమాకు తీసుకు వెళ్లాలను కున్నాడు. ముస్తాబై బైటికొచ్చిన అర్ధాంగిని చూసి నోరుతెరి చాడు వెంకటేశ్. తెల్లటి సరిగంచు నేతచీర కట్టుకుంది. వదులుగా వాలు జడలో చిన్న తెల్లచామంతి చెండు తురుముకుంది. నుదుటిమీద బొట్టు. సైజు కాస్త చిన్నదైంది. కాటుక అతి నాజూకుగ దిద్దుకుంది. రత్నం అతడికళ్ళకు రంభలా తోచింది. అమాంతంగా వెళ్ళి రెండు చేతుల్లోకి ఆమెను తీసుకున్నాడు. "రత్నా! ఎంత అందంగా ఉన్నావ్!"

"అబ్బ.... వదలండి - ఎవరేనా చూస్తే?" అంటూ బలంగా అతడిచేతుల్లోంచి తప్పించుకుని పారిపోయింది. 'ప్చ్' అనుకున్నాడు.

బాల్కనీలోకి వెళ్ళి కూచున్నారు. ఆమె కర్థంకాలేదు. ఆమె విసుక్కుంటున్నది. వెంకటేశ్‌కి కోపంకూడా వచ్చింది. "నన్ను

హిందీ సినిమా కెందుకు తెచ్చారు. నాకేం అర్థంకాలేదు,'' అంది ఇంటర్‌వల్‌లో. మారు మాట్లాడకుండా లేచాడు.

''పద - వెళ్ళిపోదాం.'' అతడి ముఖంలో తాండవిస్తున్న కఠినత్వాన్ని, కోపాన్నిచూసి భయపడింది. మాట్లాడటానికి ఏమీతోచలేదు. నెమ్మదిగా లేచి అతన్ని అనుసరించింది.

రిక్షాలో కూచున్నతర్వాత అడిగాడు: ''అయితే- నీ అభిప్రాయం ఏమిటి? నీతో నేను తెలుగు పౌరాణిక సినిమాలే చూడాలన్నమాట.... నీ భక్తితో నా ఆయుస్సు పెంచాలనుకుంటున్నావేమో; ఇది కలియుగం. ఎవరిది వారికే ఉంటుంది.... నువ్వు చూసిన సినిమాలన్నీ ఐదవతనం కోసం ప్రాకులాడినవే కదూ? వాళ్ళంతా వ్రతాలు, నోములు చేస్తారు. మొగుడు ఎలాంటి వాడయినా, వెయ్యేళ్ళు బ్రతకాలని వాళ్ళ ఆశ. వాడేమో తన ఇష్టమొచ్చినట్లు వెధవ తిరుగుళ్ళలో భగవంతుణ్ణి మరిచిపోయి ఉంటాడు. వీళ్ళేమో అతడికి బదులు పూజలు చేస్తారు. ఆ కాలం దేవుడు సహించాడేమోగాని, ఇప్పుడు కాలం మారింది. నా మంచి నాకే, నీది నీకే. కాబట్టి, అన్నిరకాల సినిమాలూ చూట్టం నేర్చుకో. పురాణ కథలు చూస్తే పుణ్యంమూట గట్టుకోవు. నేనా....''

''అవన్నీ మాట్లాడకండి. నాకలాంటివే బాగుంటయి మరి. మీ కిష్టంలేకపోతే - అసలు సినిమాలకే తీసుకెళ్ళకండి. నాకేం అర్థంకానిదాని కెళ్ళి డబ్బులు తగలెయ్యటం బాగుండదు.'' రెక్కున తేల్చిపారేసింది రత్నం.

ఆ వీధి దీపపు కాంతిలో భార్య ముఖంలోకి పరీక్షగా చూశాడు. రత్నం సీరియస్‌గా ఉంది.

''అంటే నా సర్దాకోసమైనా నాకు నచ్చిన సినిమా చూడడానికి రావన్నమాట?''

''ఊహూ. మీకు నచ్చినవి నాకు నచ్చవు. నాకు నచ్చినవి మీకు నచ్చవు. నేను రాకుండా మీరెళ్ళొచ్చుగా - నేను మీరు లేకుండా వెళ్ళలేనుగాని.''

''రత్నా! నువ్వులేకుండా నే ఒక్కడిని వెళ్ళి చూడనా?'' ఆశ్చర్యంగా అడిగాడు.

"హాయిగా వెళ్లి చూడండి. నాకేం కోపంరాదు."

వెంకటేశ్ 'ప్చ్' అని బిగ్గరగానే అన్నాడు.

'రత్నకు ఏమీ తెలీదు,' అనుకుని అశాపై ఫల్యానికి తన్ను తాను నిందించుకున్నాడు.

# 11

బజారుకెళ్ళి ఇంట్లోకి కావలసిన సామాను, సరంజామా కొనుక్కొని వచ్చాడు వెంకటేశ్. ఇక ఇలాంటి పనులన్నీ నేర్చుకోవాలి. మంచి సరకు ఏరటం తనకు తెలీదు. రిక్షావాడు సామాను తెచ్చి లోపలపెట్టి వెళ్ళిపోయాడు.

రత్నం అన్నీ సర్దుకుంటోంది.

"అయ్యయ్యో - ఇవేం పప్పులు, ఇంత కర్తీగా ఉన్నాయి.... ఎండు కొబ్బరి ఇలా ఉండకూడదు...." అంటూ అన్నింటికీ పేర్లు పెట్టింది.

"నాకు తెలీదు - నాణ్యమైన సరకు అని ఇచ్చాడు."

రత్న పకపక నవ్వింది. "మరి సత్తు పప్పు అంటారు తెలుసా? ముక్కిపోయిన కొబ్బరి అని చెప్తారు తెలుసా?"

"పోనీ - ఈసారి కివి వాడేసెయ్యి. మరోమాటు బజారు కెళ్ళే టప్పుడు నువ్వుకూడా రా. ఎన్నికజేసి నీకు నచ్చిన సరుకు కొనుక్కోవచ్చు."

"నేనా? మీతో బజారుకా?....బాగుంది....ఎవరైనా చూస్తే నవ్వుతారు!" కళ్ళంతా త్రిప్పుతూ అదెంతో విడ్డూరమైనట్లు చూసింది.

"ఎవ్వరూ నవ్వరు. వాళ్ళకి అదేపననుకున్నావా? ఇక్కడ అందరూ లక్షణంగా భర్తలతో వెళ్లి కొనుక్కుంటారు."

"ఛీ....ఏమో బాబు. నాకిష్టంలేదు. అలవాటులేదు."

"అలా అనకు. అలవాటు చేసుకో మరి."

"ఇప్పుడేం మీ వెంట బజార్లు తిరక్కపోతే?"

"ఐతే నేనెలాంటి సరకు దెచ్చినా పేర్లుపెట్టి గొడవ చెయ్యకు. నాకు చేతనైనట్టు తెస్తాను."

రత్నం కళ్ళింతింత చేసుకుని నిర్ఘాంతపోతూ అంది: "డబ్బు పెట్టి కొనేటప్పుడు మంచివి చూసి...."

"అందుకే వచ్చి చూడమంటున్నాను. నీవేమో గడప దాటకు. రాణీలా ఇంట్లో కూచో. కూలీవాణ్ణి ఉన్నాగా- సంపాదించటానికీ, వెచ్చాలు తేవటానికీ, నీచేత మాటలు పడటానికీ! రానన్నావు. ఇక మాట్లాడకు. నేనేదో తెచ్చి పడేస్తాను. నువ్వేమో వండి పడెయ్యి. అంతే!"

వెంకటేశ్ ముందు వైపున్న తోటలోకి వెళ్ళిపోయాడు. రత్నం తేరుకుని సామానంతా సర్దేసరికి దాదాపు గంట పట్టింది. ఆ గంటసేపు ఆమెకు ఆలోచనలు తరుముకొని వస్తున్నాయి. తను బజారు వెళ్ళటమా? అలవాటు లేని పని!-పోనీ లెద్దూ, వెళ్ళకపోతే ఇలాంటి చౌకబారు వెచ్చాలొస్తాయి; సర్దుకు పోతే సరి! అనే నిశ్చయించుకుంది.

చిన్న తోటలో కూచుని ఆలోచిస్తున్నాడు వెంకటేశ్. ఇప్పుడు కాకపోతే ఇలాంటి సరదాలు ఎప్పుడు? భార్యాభర్తలు జంటగా వెళ్ళి నచ్చినవి కొనుక్కు తెచ్చుకుంటారు. పసిపిల్లలా అదీ ఇదీ చూపిస్తూంటే కొనిస్తాడు భర్త. పాపలనెత్తుకుని కూడా బజారు కెళ్తుంటారు. జీవితంలో అనుభవించగల వయస్సిది. పిల్లా పాప పుట్టాక ఎలాగూ తిరగటం తక్కువే అవుతుంది. ఏమిటో, చిన్నవాటికి కూడ సర్దుకోలేక పోతోంది. వాళ్ళ ఇంట్లో అలవాటు లేదు. సరే! అక్కడ బోలెడు మంది. కాని, ఇక్కడ ఎవరి పనులు వాళ్ళే చేసుకోవాలి. నాకు సాయంగా తనుకూడ వస్తే నాకెంత ఆనందంగా ఉంటుంది!

రత్నం మెల్లగా బైటికొచ్చింది. మెట్లుమీద కూచుంది.

"మరో కుర్చీ తెచ్చుకుని అలా వేసుకుని కూచోరాదూ?"

"వద్దు లెండి!"

అదీ తప్పే కాబోలు అనుకున్నాడు.

చాలాసేపు ఎవ్వరూ మాట్లాడలేదు.

రత్నం చివరికి అంది: "మీకెందుగ్గాని కోపం, మీరెలాంటి సరకు దెచ్చినా నోరు తెరవను. సరేనా?"

"అంతేగాని నాతో రానంటావు. అంతేగా?"

"వద్దులెండి. నా కెలాగో ఉంటుంది." తన నిశ్చయం తెలియ జేసింది.

వెంకటేశ్ దీనంగా, జాలిగా చూశాడు. తర్వాత లేచి లోపలి కెళ్లి పడుకున్నాడు.

రత్నంవచ్చి కూచుంది. "అలా పడుకున్నా రే?" అంది.

"ఏం పనుంది? బైటి కెళ్దామంటే తలనొప్పిగా ఉంది."

"అమృతాంజనం తేనా?"

"వద్దు" అంటూ ఒక ఇంగ్లీషునవల తీసుకున్నాడు.

ఆమె కాసేపు కాలుగాలిన పిల్లలా తిరిగింది. ఇంకా అక్కడే తారట్లాడుతూంది.

"నువ్వూ ఏవైనా పుస్తకం చదువుకోరాదూ?" అన్నాడు.

"ఏ మున్నాయి?"

"నే పంపిన పుస్తకాలు నువ్వు చదవలేదుగా! అవి చదువు. ఇంకా పత్రికాలు అవీ చదువు. ఇక్కడ వద్దనేవాళ్లెవ్వరూ లేరు."

రత్నంకు ఆ మాటల్లో ఏదోఎత్తి పొడుపు ధ్వనించింది.

"అవి చదవొద్దు అని ఎవరూ అనలేదండీ. ఏవైనా కథలపుస్తకా లైతే బావుంటాయి, ఈ చరిత్ర లేమిటన్నారు. నాకూ అలానే అని పించింది. అందుకని వాటిని చదవలేదు."

"పోనీ కాశీమజిలీలు, భట్టివిక్రమార్కుడి కథలు తేనా?"

"ఆ....తీసుకురండి." ఎంతో ఆత్రంగా, ఆశగా అంది.

"వార్తాపత్రిక, వారపత్రికలూ చదువు."

"ఏమిటో - ఆ కథలు కొన్ని అర్థంకావు. ఆ వార్తలు కూడ నా కంతగా తెలియవు. ప్రతివార్తకు అర్థంచెప్పే వాళ్లుండాలి. అందుకని ఏవో కొన్ని చదువుతాను."

"నే చెప్తాను. నువ్వు చదవటం అలవాటు చేసుకో."

"ఆ కథల పుస్తకాలు కొనితెండీ!" బ్రతిమిలాడుతున్నట్టంది.

తన గోల తనదీ, ఆమె గోల ఆమెదీ అనుకున్నాడు.

నిజంగానే తలనొప్పి వచ్చేసింది.

పుస్తకం మూసేసి కళ్ళుమూసుకుని పడుకున్నాడు. రత్నకు ఏమీ తోచలేదు. ఇంగ్లీష్ మేగజీన్స్‌లో బొమ్మలుచూస్తూ కాసేపు గడిపింది. తర్వాత ఏమనుకుందో వార్తాపత్రిక తెచ్చుకుంది. పేపర్ పట పట శబ్దంవిని ఓరగా చూశాడు. ఆమె సినిమా బొమ్మలుండే పేజీ చూస్తూంది. పోనీలే - అలాగే అలవాటవుతుంది అనుకున్నాడు.

ఒక్కసారే నిచ్చెన ఎక్కినట్లు పైకెళ్లటం సులభంకాదు. మెల్ల మెల్లగా, అనునయంగా, ఉపాయంగా, మంచిమాటలతో ఆమె పద్ధతులన్నీ మార్చాలి అనుకున్నాడు.

కానీ, అదంత సులభమైన పనికాదని వెంటనే గ్రహించాడు.

# 12

మహీధర్ - ప్రతిమ వచ్చేశారు.

మరొక సారి రావు గారింట్లో వారి కుటుంబంతో సరదాగా గడిపారు. రత్నం బెరుకు బెరుకుగా, గప్‌చిప్‌గా కూచుని, పలకరిస్తే మాట్లాడి- ముళ్ల మీద కూచున్నట్లు కూర్చుంది. ప్రతిమ ఆమె దగ్గరగా కూచుని ఎంతో కలుపుగోలుతనంగా మాట్లాడింది. బొంబాయినించి తెచ్చిన వస్తువులన్నీ చూపిస్తూ, తెగ వాగుతూంది. కాని, రత్నం అంత త్వరగా క్రొత్తదనపు బెరుకు పోగొట్టుకో లేకపోయింది. తనేం మాట్లాడుతుంది? ఏం కబుర్లుంటాయి? సుచిత్రాదేవి మాత్రం వెళ్ళక ముందు తరచు రమ్మని మరీ మరీ చెప్పింది. అలాగే అందిగాని భయమే.

రిక్షా ఎక్కిన తర్వాత భార్యను మెల్లిగా అడిగాడు;

"వాళ్ళంతా అంత ఇదిగా మాట్లాడుతుంటే మూగ బొమ్మలా

కూర్చున్నావేఁ ఏమనుకుంటారుః ఏదో ఒకటి కల్పించి మాట్లాడలేవాః"

"ఏం మాట్లాడాలిః ప్రతిమ అవన్నీ చూపిస్తోంటే బాగున్నా యన్నాను. ఇంకే మనాలిః సంభాషణ నెలా పెంచాలో బాబు, నాకు తెలీదు."

"అబ్బో. మీ అమ్మ, వదినెల దగ్గర గంటల తరబడి మాట్లాడే స్తూంటావుః ఇక్కడేనా చేతకాందిః" దెప్పాడు.

"వాళ్ళతోనాః బోలెడు కబుర్లుంటాయి. సీతన్న చెవిటి కూతురు ముచ్చట్లు, పశువులను గూర్చిన ముచ్చట్లు- శివన్న కోడెద్దుల జత - మా ప్రక్కింటి సుబ్బలక్ష్మిని గూర్చిన సంగతులు - ఎన్నో ఉంటాయి. పట్నం వెళ్లొచ్చిన వాళ్లు ఎన్నో విశేషాలు నాన్నగార్కి చెప్తారు. అవన్నీ అమ్మ మాకు చెబుతుంది. సినిమా కథలుకూడ చెప్పుకుంటాము...."

రత్న ఇంకా ఏదో వాగేదే కానీ-వెంకటేశ్ "సరేలే" అన్నాడు.

ఆమె తెలివి తేటలు, అభిరుచులు ఒక పరిధిలో ఉన్నాయి. దాన్ని అధిగమించటానికామె ప్రయత్నం చేయదు. ఆ ఆవశ్యకత ఆమెకు లేదు. కాని, కల్గించాలి. ప్రతిమతో ఎక్కువ కాలం గడిపేలా చేయాలి. కాని, ప్రతిమకు బోరు కొట్టదూః రత్నకి విసుగుపుడ్తే వారి ద్దరిమధ్యా స్నేహభావంపోయి ఒకరిపై ఒకరికి అనిష్టత ఏర్పడు తుంది. బాబోయ్ _ వద్దులే, దూరంగా ఉంటేనే మంచిదనుకున్నాడు.

రత్నంనించి తాను ఏదీ ఆశించకూడదు. ఆమెనించి ఆశా జనకమైన సమాధానాలు రానేరావు. నోరు మూసుకోవటమే సబబు అనుకున్నాడు.

సాయంత్రాలు ఇంట్లో తోచదు. అలా స్నేహితులతో తిర గటం అలవాటు చేసుకున్నాడు. రోజుకు అధమం రెండు రోజుల కొకసారైన మహీధర్ ఇంటి కెళ్లేవాడు. మహీధర్ తను ఎప్పుడెళ్లినా ఇంట్లోనే ఉంటాడు. ఎక్కడికీ వెళ్ళడు. అలా అని భార్య కొంగు బుచ్చుకుని తిరగడు. ఒకరి సమక్షంలో ఒకరికి కావలసినంత సబ్జక్ మేటర్ ఉంటుంది. ఈ సంవత్సరం ప్రతిమ చదువు మానేసింది గానీ - నాగపూర్ ఎం.ఏ. కు ప్రైవేట్ గా కట్టటానికి అన్ని ఏర్పాట్లూ

చేసుకున్నారు. పుస్తకాలు తెప్పించుకుని చదువుకుంటూంది.

ఆ రోజు తను వెళ్తూంటే మహీధర్ ఎదురొచ్చాడు. ఒంటరిగా వెళ్తున్నవాడిని చూసి ఆశ్చర్యపోయాడు వెంకటేశ్.

"ఎక్కడికి? ఒంటరిగా, అంత హడావిడిగా?"

"అబ్బ. ప్రతిమను వదిలించుకుని వచ్చేసరికి ఇంత ఆలస్యమైంది." బోనులోనించి బైటబడిన జంతువు ఎంత సంబరపడిపోతూ ఉల్లాసంగా ఉంటుందో అంత ఉల్లాసంగా కనపడుతున్నాడు మహీధర్. కానీ, ఆ సమాధానం వెంకటేశ్‌ను ఒక్క వూపు వూపింది. నిల ద్రొక్కుకుని స్నేహితుని భుజంచుట్టూ చేయివేసి "ఆదేమిటి?" అని తాపీగా అడిగాడు.

"రోజూ బజారుకొస్తానంటుంది. ఏది కొనాలన్నా తనుకూడా నావెంట బయలుదేరుతానంటుంది. నే తెచ్చే సరకులు నచ్చవు. పోనీ అని కూడా తీసుకెళ్తున్నాను. అన్నీ తనే ఎన్నికచేసి కొంటుంది. ఇది అలవాటై పోయింది. ఇక ప్రతిరోజూ షాపింగ్ తనే చేయాలంటుంది. సరే. మంచిదే కానీ, త్వరగా కొనదే; రెండుమూడు అంగళ్లు త్రిప్పుతుంది, బేరం చేస్తుంది. నచ్చకపోతే ఏదో ఒకటిలే అని కొనదు. కొనకుండానే వచ్చేస్తుంది. మరి నాల్గురోజులు పోయాక దానికోసమే మళ్లీ వెళ్లాలి. రిక్షాలకు పొయ్యాలి. సైకిల్‌మీద వెళ్లి అదేదో నేనే తేగలనుగా. వద్దు - మీకు సరకు నాణ్యం తెలీదంటూ తనూ సిద్ధమౌతుంది. ఈ రోజు తలనొప్పి అన్నది. ఇదే అదను అని చప్పున బయలుదేరాను. పద- ఇద్దరం వెళ్లి కొందాం" అంటూ లిస్టు చూపించాడు.

బొంబాయి రవ్వ, ఎండు కొబ్బరి, ఏలకులు, అప్పడాలు- ఇల్లాంటివి రాసున్నాయి.

ఇద్దరూ రిక్షా ఎక్కారు.

"బొంబాయి రవ్వ ముక్కిపోయింది. ఎండు కొబ్బరీ అంతే - ఏలకులు సత్తువి. అప్పడాలు పాతసరుకు - అంటూ పేర్లు పెడ్తుంది. పెట్టనీ - ఆ ఏలక్కాయలన్నీ విచ్చి, దూరి చూశానా నేను?" అన్నాడు మహీధర్. వెంకటేశ్ పగలబడి నవ్వాడు.

"ఔన్లే, ఏలకుల్లో దూరి చూడాలంటే మనం సిద్ధపడినా కొట్టు వాడొప్పుకో వద్దూ?"

"అదీ పాయంటే."

కాసేపు మౌనంగా కూచున్నారు.

"ఒరేయ్! కొన్నిసార్లు ఇలా ఒంటరిగా గడపటం - అంటే కూడా సతీమణి లేకుండా - బావుంటుంది కదూ! మనం ఇలా కూచుని తాపీగా మాట్లాడుకుని ఎంతో కాలమైంది కదూ? నెలకో వారం రోజులు స్నేహితులతో గడపాల నుండదూ? అలా ఎస్కేప్ అవ్వాలనిపిస్తుంది." స్వేచ్ఛాప్రియత్వాన్ని గుర్తింపజేశాడు. స్నేహితుడినించి సమాధానం రాకపోగా మహీధర్ తలత్రిప్పి చూశాడు.

వెంకటేశ్ సీరియస్‌గా ఉన్నాడు.

"ఏరా - ఏమిటి అంత దీర్ఘంగా ఆలోచిస్తున్నావు?"

"ఆ...." అంటూ ఎటో పోయిన మనసును వెనక్కి మళ్లించాడు వెంకటేశ్.

"అదే _ ఆ పరధ్యానం ఏమిటి?"

"ఒక విషయాన్ని గూర్చి ఆలోచిస్తున్నాను."

"ఏమిటో అది?"

"రత్నంను నాతో బజారుకు రమ్మంటే రానన్నది. అదేదో చేయకూడని పనునుకుంటుంది. తను నాతో రావాలని, సరదాగా తనను వెంటబెట్టుకుని త్రిప్పాలని, అవీ ఇవీ కొనుక్కోవాలని నాకుంటుంది. కాని, తేల్చి చెప్పేసింది- మీరెలాంటివి తెచ్చినా నోరెత్తను - నేను మాత్రం బజారుకి రాను - అని."

మహీధర్ ఈసారి హాయిగా నవ్వేడు.

"హారినీ - అందుకా ఇంత ఆలోచన! ఎంత అదృష్టం చేసుకున్నావో, రానన్నది. నీకిక ఎంత స్వేచ్ఛ? హాయిగా చిటికెలో నీకు నచ్చినవి కొని తీసికెళ్లి ఇంట్లో పారెయ్యొచ్చు."

"అది కాదురా! కులాసాగా కబుర్లు చెప్పుకుంటూ అలా మొగుడూ పెళ్లాం వెళ్తే ఎంతో బావుండదూ! నాకేమో ఆ అవకాశం లేదని బాధగా వుంది. వైవాహిక జీవితంలో పొందవలసిన ఆనందంలో

కొంతభాగం తరుక్కు పోయినట్లుంది. ఇప్పుడు కాకపోతే ఎప్పుడొ స్తుంది? ఎంత చెప్పినా ఆలోచించదు. కుండ బ్రద్దలు కొట్టినట్లు ఠకీ మని చెప్పే స్తుంది."

"చాల మంచి పని జేసింది. లేకపోతే నీతో రావటం అలవా టైతే ప్రతిమలా తయారయ్యేది. ఆ రోజులు వచ్చినప్పుడు - ఎందుకు నేర్పించానురా భగవంతుడా అని నువ్వూ తలబాదుకుంటావు. ప్రతిమ చూడు! ఏదో ఒకరోజు - లేక రెండు రోజులొ స్తే ఎంతో సరదాగా ఉంటుంది. అందమైన భార్య ప్రక్కన నడవటం అదొక ఘరానా. లాంగ్‌క్లాత్ కొనాలన్నా, నాకు షర్టింగ్ కొనాలన్నా తయారౌతే ఇంకే మంటావు? అందుకే మెల్లగా ఆ అలవాటు తప్పి స్తున్నాననుకో. చూస్తూ చూస్తూ ఉచ్చు అల్లి అందులో దిగడకు."

వెంకటేశ్ ఆశ్చర్యంతో చూస్తున్నాడు.

"ఏమో, ఇంతవఱకూ నేను జీవితంలో ఏదో మిస్ చేస్తున్నా నన్న బాధ ఉండేది. ఈనాటితో అది కాస్తా తొలగి పోయింది. జ్ఞానో దయం అయింది, రత్న చదువుకో లేదనీ, ఇలాంటి వాటికి అల వాటు పడటం చేతకాదనీ, ఎంతో ఫీలయ్యే వాడివి. నీ గొడవ చెప్పావు- దాని అంతరార్థం ఇదన్నమాట, మనకు కాస్త స్వేచ్ఛ కావాలి. అంతే కదూ!" అంటూ ముసిముసి నవ్వులు నవ్వాడు.

"ఊ....ప్రతి దానికీ నేనున్నా నంటూ బయలుదేరుతూంటే ఏ పనులూ కావు."

రిక్షా దుకాణం ముందు ఆగింది. ఇద్దరూ రిక్షా దిగి అంగడిలోకి వెళ్లారు. కావలసినవన్నీ కొనుక్కున్నారు. పొట్లాలు సంచిలో వేసు కున్నారు. అంతా ఇరవై నిమషాలు పట్టలేదు.

"అప్పుడే ఎందుకులే....హోటల్‌కెళ్ళి ఏదైనా తీసుకుందాం పద!"

వెంకటేశ్‌కు ఏమీ అర్థం కాలేదు. ప్రతిమ ఎప్పుడూ తన సమ క్షంలో ఉండాలని కోరిన మహీధరేనా వీడు? ఇలా మారిపోయా డేమిటీ? అంతే మరి. 'ఫెమిలియారిటీ బ్రీడ్స్ కంటెంప్టు' అని ఊరికే అనలేదు. ప్రొద్దస్తమానం వెంటవుంటే అదీ విసుగ్గానే వుంటుందేమో

హరి! ఇప్పుడు ఆమెనించి కాసేపయినా దూరంగా ఉండాలంటున్నాడు.

"నీ కోసం చూస్తూంటుందేమో!"

"ప్రతిమేనా! చూడనియ్. అలా కాసేపు నిరీక్షిస్తే మంచిదే! రత్నం చూడదూ?"

"ఊహూ. చూస్తుందనుకో! కాని, మరీ అంత పిచ్చిగా ఎదురు చూడదు. నా పాటికి నన్ను వదిలేస్తుంది. సాయంత్రాలు కాఫీ త్రాగాక ఇల్లు వదిలిపెట్టి పోయినా ఏమీ అడగదు - నేనే చెబుతూంటాను."

"ఎంత అదృష్టవంతుడివిరా!"

"అదేమిటి? అదృష్టానికేమొచ్చింది?"

"గడప దాటితే చాలు - ఎక్కడికి, ఎందుకు, ఎప్పుడొస్తారు, వెళ్ళకండి, నాకు తోచదు, త్వరగా రండి- ఇల్లాంటి ప్రశ్నలతో విసిగిస్తూ ఆజ్ఞలు జారీచేసే భార్య కానందుకు నువ్వే అదృష్టవంతుడివి. కాసేపు స్నేహితులతో కాలం గడపొద్దూ! అది చాలా ఆరోగ్యకరం కాదా? నలుగురితో సరదాగా తిరుగుతూ స్నేహంగా ఉండకపోతే ఎల్లా? పోనీ, ఇంట్లో ఉన్నాననుకో. పుస్తకాలు ముందేసుకుని కూర్చుంటుంది. ఎవడు చదవమన్నాడు? రేపు పాసయిందంటే ఇంకెంత ఆగడం చేస్తుందో! అందుకే అనుకుంటుంటాను, ప్రతిమ అంత విద్యావతి కాకుండా, తక్కువ చదువుకున్నదైతే బావుండేదని."

"మహీధర్ ....! ఏమిటి నువ్వనేది? నేనేమో నా పని నీకు విరుద్ధంగా ఉందని అనుకుంటూంటే, నీ ధోరణి నాకు పూర్తిగా వ్యతిరేకంగా ఉంది. ఏమో, నేను మాత్రం నీ అభిప్రాయంతో ఏకీభవించలేను."

"పోనీలే. రత్నని విద్యావంతురాలిగా చేయలేము. ప్రతిమను విద్యావిహీనగానూ మార్చలేము. కాబట్టి, ఈ అసంతృప్తిని ఎవరికి వాళ్ళం ఏకాంతంగా అనుభవించాలి."

కాఫీ తీసుకుని ఎవరిళ్ళకు వారు వెళ్ళిపోయారు. తలుపు తీసి 'ఎక్కడికెళ్లారు? ఇంత ఆలస్యంగా వచ్చారేం?" అని రత్నం అడగలేదు. మామూలుగా తలుపు గడియవేసి మంచినీళ్ళు అందించింది. పువ్వుల పొట్లం అందించాడు వెంకటేశ్. ఆమె వదనం ప్రఫుల్ల

మైంది. పొట్లంవిప్పి పూలమాలను కాసేపు చేతుల్లో అటుఇటు వేసు కుంటూ దాని అందానికి మురిసి పోతూంటే చూస్తూన్న వెంకటేశ్ మెల్లగా దరిచేరి పూలమాల అందుకుని ఆమె తలలో తురిమాడు. ఓరగా భర్తనుచూసి నవ్వింది రత్న. ఆ నవ్వుకు పువ్వులు వెలవెల బోయాయి. ఆమె కళ్ళలోని వెలుగు, చెక్కిళ్ళ సిగ్గూ చూసి దగ్గరగా తీసుకున్నాడు. ఆమె మత్తుగా కళ్ళు మూసుకుని భర్తను అల్లుకు పోయింది.

తన బాహు బంధంలో ఇమిడి పోయిన రత్నమగూర్చి అను కున్నాడు - ఆమె పల్లెటూరిదే కావచ్చు, చదువరి కాకపోవచ్చు కానీ, భర్తను ఎలా చూసుకోవాలో, అతడికెంత స్వేచ్ఛ యివ్వాలో, అతనికి ఏమి అందివ్వాలో, అతని యందు ఎంత అణకువతో ఉండాలో రత్నకు తెలుసు- అని. ఆ రాత్రి అపూర్వానుభూతితో గడిచి పోయింది. అతడి హృదయం ప్రశాంతంగా ఉంది.

## 13

రెండు రోజులు గడిచి పోయాయి. రావుగారు పొలాలు చూసి రావ టానికి పల్లెకు వెళారు. సుచిత్రాదేవిని చూడటానికి వెంకటేశ్, రత్నం వెళ్లారు. కాసేపు వాళ్లతో ఉండి రత్నను అక్కడే ఉండమని తానొక్కడే మహీధర్ ఇంటికి వెళ్లాడు.

గేట్ తీసి లోపలికి వెళ్లాడు. డ్రాయింగ్ రూంలో మహీధర్, ప్రతిమ కూచుని ఏదో చర్చించు కుంటున్నారు. వారి వాలకం చూస్తుంటే ఆ చర్చ మాంచి పట్టులో ఉన్నట్టుంది. వెళ్లి ఒక సోఫాలో కూచు న్నాడు. హల్లో - హల్లో అనుకున్నారు.

"కానివ్వండి. మీ చర్చ ఏమిటో - నేను వింటూ కూర్చుం టాను. నేనున్నానన్న విషయం మర్చిపోండి."

మహీధర్ లోపలి కెళ్ళి మంచి నీళ్ళు తాగి వచ్చాడు.

"చర్చ ఏమీ కాదన్నయ్యా! కొన్ని విషయాలు మాట్లాడు కుంటున్నాము. అంతే. నిన్న నేను అమ్మా వాళ్ళింట్లో గడిపాను. ఇంతకీ రత్న ఏదీ?"

"అమ్మ దగ్గర విడిచి వచ్చాను. ఏదైనా కుట్టు నేర్చుకుంటే మంచిదని. చినిగిపోతే ముళ్ళు వేసుకుంటుందేగాని కుట్టుకోదు. రాత్రికి వస్తానని చెప్పొచ్చాను."

"మంచి పని చేశావు. ఈ కాలంలో కనీసం బ్లౌసెస్, ఇంటి క్కావలసిన చిన్న చిన్నవయినా కుట్టుకోవటం రాకపోతే చాలా కష్టం. టైలర్స్‌కు బోలెడంత డబ్బు పోయాలి."

"మిషన్ కొన్నావేమిటి?" మహీధర్ అడిగాడు.

"ఉహు. కొనాలని."

"అదిగాదోయ్ పిచ్చి మొహమా! ముందు కొంటే ఆ కొత్త మిషన్ మెరుగు, దాని అంద చందాలు చూచి ముగ్ధురాలై ఏదైనా కుట్టటం నేర్చుకుంటే బావుంటుం దనుకుంటుంది. అది ఇంట్లో ఊరికే పడుందని చప్పున నేర్చుకుంటుంది. సైకలాజికల్‌గా ఆలోచించా లోయ్!"

"ఇలా అంటూంటే నాకో సంఘటన గుర్తొస్తూంది. మా ఇంటి ప్రక్కన టౌన్ ప్లానింగ్ ఆఫీసరుండేవాడు. ఆయన భార్యకు ఇలాంటి వేమీ చేతనయ్యేవికావు. ఎప్పుడైనా మా యింటి కొస్తుండేవారు. మా అమ్మ అస్తమానం ఏదో ఒకటి కుడ్తూనో, అల్లుతూనో వుండేది. అమ్మను అలా చూసినప్పుడంతా ఆయన అనేవాడు- ఏమోనండీ, మా లక్ష్మికి ఇలాంటివేమీ రావు. దిండు గలీబు కుట్టాలన్నా చేతకాదు. టైలర్ కివ్వాల్సిందే. నేర్చుకోమంటాను, నేర్చుకోదు. టైలర్‌కు ఇరవై లు, ముప్పైలు ఇచ్చేటప్పుడు మాత్రం కాస్త బాధపడేది. విద్యచేతిలో ఉంటే ఎంత లాభం చూడండి. దానికి ఆమె సమాధానం చాల బావుందేది. 'మీరు మిషన్ కొనండి, నేను నేర్చుకుంటాను అంటాను. నేర్చుకో నేర్చుకో అంటే ఎల్లా నేర్చుకోను!' అతనేమో నువ్వు

నేర్చుకో- నేను కొంటాను అంటాడు. ఇల్లా ఒకళ్ళమీద ఒకళ్ళు చెప్పుకునే వాళ్ళు."

"ఆమె చెప్పిందే రైట్. ఎలా నేర్చుకుంటుంది? థియరీగా అలా కుటాలి - ఇలా కత్తిరించాలి - దారం ఇల్లా వేయాలి అని చెబితే వస్తుందా, మిషన్‌ముందు కూచోవాలిగాని!" మహీధర్ అన్నాడు.

"ఔనను కోండి. కాని, ఆయనగారి ఉద్దేశమేమిటంటే- ఆమె కుట్టు క్లాసుకు వెళ్ళి కుట్లు నేర్చుకుని రావాలని. అదేమో ఆమెకు బద్ధకం. ఆ కుట్టు క్లాసు చాల దగ్గరే. అయినా ఓపికలే దామెకు. అంటే ఆ సరదా లేదన్నమాట."

"పోనీ- కొన్నాడా?"

"ఓ.....అమ్మ చాటుగా చెప్పింది. ఆవిడకు వెళ్ళి నేర్చుకో టాని కిష్టంలేదు. అందుకే అల్లా చెబుతూంది. ఒకటి కొనిపడేస్తే మాట నిలుపుకోవాలన్న పౌరుషంకొద్దీ అయినా నేర్చుకుంటుంది. నా దగ్గరకొస్తే నేనే నేర్పుతాను అని. ఆయన మరునటిరోజే వెళ్ళి కొని తెచ్చేశాడు. దాంతో కొత్తరకం పోరు ప్రారంభమైంది."

"ఇదేమిటీ కాశీమజిలీ కథలా ఉందే!" వెంకటేశ్ అన్నాడు.

"కొని తెచ్చినా ఆమె దాని జోలికి పోలేదట. తెచ్చానుగా, నేర్చుకో అని ఆయన సాధింపు ప్రారంభించాడు- కొనితెండి. నేర్చుకుంటా నన్నావుగా - ఇదిగో తెచ్చాను - కానియ్ అని. పాపం, చివరి కామె పట్టుదలతో నేర్చుకుంది. అన్నమాట నిల్పుకోవాలని అమ్మ దగ్గర కొచ్చి నేర్చుకునేది."

"కాబట్టి, ఒకటి కొనేస్తే సరిపోతుంది. అదే మనిషిని ప్రోత్సహిస్తుంది. అంతేకదూ?"

"అమ్మ చెబుతుంది, ఉత్తరాదిన దహేజ్ - అంటే సారె పంపే టప్పుడు కుట్టు మిషన్ తప్పక కొనిస్తారట. అక్కడ దాదాపు అందరికీ కుట్టు చేతనవుతుందట. మనవాళ్ళలాగ పనులన్నీ అయిపోయిన తర్వాత గుమ్మాలలో నుంచుని మాట్లాడుకోరు; ఒకరింటికి మరొకరు పోయి ఎందుకూ పనికిరాని కబుర్లు చెప్తూ కాలం వృథాచెయ్యరుట."

మహీధర్ బిగ్గరగా నవ్వేరు. అతణ్ణి చూసి వెంకటేశ్ కూడ శృతి కలిపాడు.

"నోట్లో నువ్వుగింజ నానదన్న బిరుదాంకితులు. కబుర్లు చెప్పుకోకుండా, ఒకరిని గూర్చి ఏదో ఒకటి చెబుతూనే 'ఆ-అయినా మాకెందుకులే - ఎవరెట్లా పోతే మాకేం' అనే మీరు అంత బుద్ధి మంతులా! ఆశ్చర్యంగా ఉందే!"

ప్రతిమకి కొంచెం కోపం వచ్చినా, ఎంతో సేపు నిలవ లేదు. తనూ నవ్వింది. "నిజమేగాని, వాళ్లో నోళ్ళకెంత పనివుంటుందో చేతు లకు గూడ అంత పని ఉంటుందన్న మాట. అదే తేడా."

"అల్లా చెప్పు మరి."

"ఊలు అల్లుతూనో, ఏదైనా కుట్టుకుంటూనో కూచుని కబుర్లాడుకుంటారు."

"అయితే, వాళ్ళను నిజంగానే అభినందించవచ్చు." వెంకటేశ్ పలికాడు. తర్వాత కాసేపు ఎవ్వరూ మాట్లాడలేదు. వెంకటేశ్ తిరిగి ప్రారంభించాడు: "ఏమోగానీ, ప్రతి విషయంలో ఓడిపోతున్నానేమో అనిపిస్తుంది. చదువులో శ్రద్ధ కలిగించాలని ప్రయత్నించాను. అది తలకెక్క లేదు. బి. ఎ., ఎం. ఏ. లు పాసవ్వాలని కాదుగాని, లోక జ్ఞానం ఆర్జించుకోవటంలో తప్పులేదు. పదిమందితో కలిసినప్పుడు వారి సంభాషణలో పాల్గొనకపోయినా తెల్లమొహం వేయకుండా వుండాలని నా తాపత్రయం. తీరా మన దేశ వీర నారీమణుల చరిత్ర పుస్తకాలను కొంటే, అవీ అవిడకి రుచించ లేదు. ఒకటో రెండో పేజీలు చదివి మానేసింది. చిన్న చిన్న కథల పుస్తకాలపై మోజెక్కువ. ఏదో అంటారుగా- గుఱ్ఱాన్ని నీళ్ళ దగ్గరకు తీసు కెళ్ళగలవు గానీ - దానిచేత నీళ్ళు త్రాగించ లేవు - అని. అలాగే ఉంది నా పని. అందుకే, ఇంక ఆ విషయం పట్టించుకోకుండా నోరు మూసుకుని వూరుకున్నాను. ఇప్పుడు మిషను కొనిస్తే అది మూల బడ్డే ఎలా? ఆయుధపూజ నాటికి మాత్రం పనికొస్తుంది."

"నువ్వు ఆమెకు కాస్త సైెం ఇయ్యి అన్నయ్యా! కొనివ్వు - అమ్మ దగ్గర వదిలెయ్- రెండు మూడు గంటలు. గుఱ్ఱం చేతేగాదు-

దాని తాతచేత గూడ అమ్మ నీళ్ల త్రాగిస్తుంది. రత్నం కుట్టేలా చేస్తుందిగా అమ్మ."

"సరే. ఆ ప్రయత్నంగూడ చేద్దాం. ఈ ఫస్టుకు ఒకటి కొంటాను."

"నా మాట విని అమ్మను - రత్నాన్ని జతచేసి బజారుకు పంపితే బావుంటుంది. అమ్మతో వెళ్తే తనకు సిగ్గుగా ఉండదు. పైగా అన్ని మిషనులు చూస్తుంది. కుట్టాలన్న ఆశ పుడ్తుంది."

"అలాగే చేద్దాం" అన్నాడు.

టీపాయ్ మీదున్న ఉత్తరాల్ని తీసి పెడ్తూ ప్రతిమ అంది: "మామయ్య రాశాడు. చచ్చిపోయి బ్రతికాడట."

"ఏమైంది?" ఆదుర్దాతో అడిగాడు మహీధర్.

"యుద్ధం వచ్చి పడిందిగా - ఆయన గాయపడ్డాడట."

"పెద్ద మామయ్య - కర్నల్ మిశ్రాని సీఫాకు పంపారుట. అక్కడ గాయపడి ప్రస్తుతం తేజ్‌పూర్‌లో ఉన్నారు. పాపం, మామయ్యకు ఒక కొడుకు, ఇద్దరు కూతుళ్ళు. కొడుకు సైన్యంతో చేరాడట. ఇంజనీరింగ్ పాసయ్యాడు. సరిహద్దు ప్రాంతాలలో రోడ్లు వేసే డివిజన్‌లో పనిచేస్తున్నాట్ట. ఈ కబురు మాకు క్రొత్త. అత్తయ్య అమ్మకు ఎంతో దిగులుగా రాసింది."

"మరి ఉండదూ! ఇద్దరు ముగ్గురైనా లేరు. ఒక్కగా నొక్కడు. ఆ ఒక్కడూ సైన్యంలో చేరాడు. బాధగానే ఉంటుంది. ఆమె మీ పెళ్లి కొచ్చారు కదూ?"

"ఆ... వచ్చింది. చాల సరదా మనిషి. ఎంతో కలుపుగోలు తనంగా ఉంటుంది. మామయ్య అంత పెద్ద కర్నల్ అయినా అత్తయ్య దగ్గర పిల్లి. కానీ, ఎన్నదగిన విషయం ఏమిటంటే, ఆమె మామయ్యను ఆడించదు. బంధువులందరితో అనుబంధం పెట్టుకుంది. ప్రెజంటేషన్స్ పంపటం - పెళ్లిళ్లకు హాజరవటం - అవసరమై రాస్తే వచ్చి వెళ్లటం - ఇలా అందరికీ తలలో నాల్కలాగ మెలుగుతుంది. ఉత్తరాలుకూడ ఆమే రాస్తుంది. మామయ్య పుష్కరాని కొకటి రాస్తాడో లేదో. ఆవిడలో

ఒక్కటే బలహీనత. మా తాతయ్యగారంటే ఆమెకి తగని కోపం."

"అది సహజమేలే." మహీధర్ అన్నాడు.

"ఈ ఉత్తరం రాసిన నాటికి ఆవిడకు కోపం మరో డిగ్రీ ఎక్కింది."

"ఎందుకో!"

"ఆమె కొడుకు సైన్యంలో చేరుతూ తాతయ్యతో చెబితే, 'ఎస్' అని ఆశీర్వదించి పంపాట్ట."

"తాతయ్య ఆశీర్వదించి పంపక పోయినా, ఎలాగూ అతను జేరేవాడే కదా?"

"ఓ. తప్పకుండా. ఖడ్గ తిక్కన పసుపు ముద్దకు భయపడి రణ రంగంలో కెళ్ళాడుగానీ, బావకు అలాంటి భయా లేమీ లేవు. పైగా దేశభక్తిట! తండ్రికి తగ్గ కొడుకు. అదే వాతావరణంలో పెరిగాడు. అదను దొరికింది. వెళ్లి చేరిపోయాడు."

"ప్చ్. పెళ్ళయిందా?"

"ఇంకా లేదు."

"మీ చెల్లిని...."

"ఛా....అలా చేసుకోరు. ఉత్తరాదిన అన్న చెల్లెండ్ర బిడ్డలే కాదు, దగ్గర సంబంధం ఏదైనా సరే చేసుకోరు. అందరూ అన్న చెల్లెళ్లే. లేక అక్కా తమ్ముళ్ళే. మేనరికంగానీ, బావ మరదళ్ళ సంబంధంగానీ చేసుకోరు, అందుకే మా కెవ్వరికీ ఆ అభిప్రాయం లేదు."

"బావుంది."

"ఆ అబ్బాయికి మంచి సంబంధం చూడమంది అత్తయ్య. అందం, విద్య వుండి- మంచి కుటుంబం అయితే చాలుట."

"అంతేనా?" వెంకటేశ్ ఆశ్చర్యాని కంతులేకపోయింది.

"అంతే, ఆ మూడే మూడు వివరాలున్నాయి. ఇక ఏమీ రాయ లేదు."

"ఓ" అనుకున్నాడు. ఔను. పిల్లకు ఈ మూడు క్వాలిఫికేషన్సే ముఖ్యం. అవి వుంటే ఎక్కడైనా సర్దుకు పోగలదు.

"అంతా బావుందిగాని ఉేశ్ - సైన్యంలో జేరిన వాడికి పిల్ల నెవరిస్తారూ అట. అందులో దక్షిణాది పిల్ల ఉత్తరాది వాడిని—అందులో మిలిటరీవాణ్ణి చేసుకోవాలంటే మాటలా?"

వెంకటేశ్‌కు అందులోని యాథార్థ్యం తేటతెల్లమైంది.

"ఏమిటో దేశభక్తిట. వెళ్ళి చేరిపోయాడు. అత్తయ్యకెంత బాధగా వుంటుందో ఊహించగలం."

"అక్కడే మా యిద్దరికీ వాద నొచ్చిందిరా. దేశభక్తితోనే వీళ్ళందరు మిలిటరీలో జేరుతున్నారంటాను నేను. కాదని ప్రతిమ. నువ్వేమంటావు?"

అకస్మాత్తుగా అడిగే సరికి వెంకటేశ్ ఇదీ-అదీ అని చెప్ప లేకపోయాడు. "ఆ విషయాన్ని గూర్చి నేను ఆలోచించలేదు. ఆ అవకాశం కల్గలేదు. మీరు చర్చలోకి దిగండి, వింటూ కూచుంటాను."

"నేనంటాను - మొదటి పాయింట్ : మనిషై పుట్టిన తర్వాత కనీసపు అవసరాలు తీర్చుకోవాలి. అది మామూలు జీవితంలో సాధ్యం కాదు. సూర్యోదయం మొదలు సూర్యాస్తమయం వరకు చెమటోడ్చి పని జేసినా అన్నం, ఇంత ఉప్పుకి పచ్చిమిరపకాయకూ గూడ సరిపోని కూలీరాని పేదవాని బ్రతుకెంత దుర్భరమైనదో మనం ఊహించలేము. కడుపు నిండా తిండి కావాలి. అది ముఖ్యం. అందుకని తండోప తండాలుగా వెళ్ళి సైన్యంలో జేరతారు. తర్వాత వారి అవసరాలన్నీ తీరతై. ఒక క్రమబద్ధమైన జీవితం గడపటంలో వారి కానందముంది. అంతేగాని, దేశాన్ని కాపాడాలని ఎవ్వడూ వెళ్ళడు. ఇక పెద్ద పెద్ద ఉద్యోగాల మాట తీసుకుంటే - ఆ జీతాలు, ఆ రాంక్‌లు, ఆ దర్జా, ఆ జీవితం, వారి నాకర్షిస్తాయి. మనకుండే సమస్యలు వారి కుండవు. వస్తువులన్నీ చవగ్గా దొరుకుతాయి. రైలు చార్జీలుండవు - వెళ్ళగానే క్వార్టర్ప్ ఇస్తారు. మెట్లెక్కినట్లే రాంక్ ఎక్కుతుంది. ఇన్ని ఆకర్షణ లుండగా మరి సైన్యంలో ఎందుకు చేరడు?"

"దేశభక్తితో, వాళ్లు రణరంగంలోకి దూకి పోరాడకపోతే - మొన్న చైనా వారిని, పాకిస్తాన్ వాళ్ళని పారద్రోలింది ఎవరు?"

"మంచి ప్రశ్న వేశావు." దానికి ప్రతిమ ఏం జవాబు చెబుతుందో అని ఆసక్తితో ఎదురు చూశాడు వెంకటేశ్.

ప్రతిమ కనుబొమలు ముచ్చటగా వంపు తిరిగాయి. చెక్కిలికి చేయి ఆన్చి కొన్ని క్షణాలు భర్తవంక తదేకంగా చూసింది. ఆ చూపులు భావ శూన్యంగా ఉన్నై. బహుశః జవాబుకు సిద్ధపడ్తోందేమో అను కునేట్టు. అంత దీక్షగా ఆలోచిస్తూంటే కూడా ఆమె ముఖం చూడ ముచ్చటగానే ఉంది

"సైన్యంలో చేరినప్పుడు వాళ్ల నేర్చుకునేదంతా థియరీయే. ప్రాక్టికల్‌గా వారెంత నేర్చినా, ఎన్ని సంఘటనలు కల్పించినా, ఎన్ని మాక్ (mock) రెయిడ్స్ చేసినా అదంతా థియరీలాగానే ఉంటుంది. నేర్చుకున్నదంతా ఆచరణలో పెట్టటం ముఖ్యం. వారు చేస్తున్నదే అది. యుద్ధం వచ్చింది. చైనావాళ్ళు దురాక్రమణ చేస్తున్నారు. వాళ్ళని తరిమి వేయాలని రణరంగంలోకి దూకారు. యుద్ధం చేశారు. అంటే అది ప్రాక్టికల్ అన్నమాట. అప్పుడంతా అనుభవిస్తారు. మిలిటరీ సైన్స్ అంతా అనుభవంలోకి వస్తుంది, అంతే."

"పోనీ, అలా యుద్ధంచేసి - శత్రు సేనల్ని మన జన్మభూమి నించి తరిమి వేయాలన్న సంకల్పంతో యుద్ధంలోకి వెళ్ళటం ఒక విధ మైన దేశభక్తి అవుతుంది గదా! దేశ రక్షణకోసం పోరాడేటప్పుడు అంతర్గతంగా వారిలో ఈ భావమే గాఢంగా వుంటుంది."

"ఏమీకాదు. నేను యుద్ధం చేయను. ఇక్కడే ఉంటానంటే తంతారని భయం. మార్షల్ లా ప్రకారం అతడు పెద్ద శిక్షకు గురి అవు తాడు. అందుకని నోరుమూసుకుని వెళ్తాడు."

మహీధర్ ముఖంలోని సంచలనం చూసి, వెంకటేశ్ ఏమౌ తుందోనని ఆత్రంగా చూస్తున్నాడు.

"ప్రతిమా - ప్రతిమా....జాగ్రత్త! వాళ్ళని గూర్చి అంత చులక నగా మాట్లాడకు. అది ఘోరమైన అపరాధం."

"నేనేం తప్పు అనలేదే. ఒకసారి మామయ్యనే అడిగాను, మీకు భయం లేదా? మీరు ప్రత్యక్షంగా యుద్ధంలో పాల్గొనాలని తెలిసినప్పుడు,

వెను దిరిగి రాకూడదని తెలిసి నప్పుడు మీకు భయం వేయదా? చని పోతామేమో - మరి తిరిగి రామేమో అన్న సంశయం ఉండదా? అని. దానికి మామయ్య జవాబు నాకెంతో ఆశ్చర్యం కల్గించింది. మరి అతను అందరి మాటగా చెప్పాడో లేదో గాని, ఇల్లా అన్నాడు : 'వెనుదిరిగి రావట మంటూ లేనప్పుడు సైన్యంలో పనిచేసే వాడెవ్వడైనా మొండి ధైర్యంతో తన్ను తాను రక్షించుకోవాలన్న దృఢసంకల్పంతో ముందు కురుకుతాడు. అతడు విజృంభించి శత్రుసేనల్ని చీల్చి చెండాడటం తన్ను తాను రక్షించు కోవాలన్న సంకల్పంతోనే. ఈ ప్రయత్నంలో సఫలుడైతే చరిత్రలో గొప్ప వీరుడుగా, చిరస్థాయిగా నిల్చిపోతాడు. విఫలుడైతే, అతని ఊపిరి ఈ అనంత జగత్తులో లీనమై పోతుంది. ఇక మాకు చాయిస్ లేదు. అందుకని మొండి ధైర్యంతో సాగిపోతుంటాము. కాని, ఒక్కటి మాత్రం గుర్తుంచు కోవాలి. శత్రువు అన్న పదానికి రూప కల్పన చేస్తూ శత్రు సైన్యం వచ్చి మనల్ని ముట్టడిస్తే ఆ క్షణంలో ఈ నా దేశం- ఈ మట్టి పరహస్తగతం కాకూడదన్న భావన ప్రతి ఒక్కడిలో ఉద్భవిస్తుంది. దేశ రక్షణ ప్రధానోద్దేశమై, సైనికుడిలోని శక్తి నంతటిని పుంజీభవింప జేస్తుంది. అతణ్ణి తరిమి వేయాలి, నా మాతృ భూమిని రక్షించుకోవాలని ఆవేశంతో విజృంభిస్తాడు."

"అదుగో - నే చెప్ప లేదూ - మాతృ దేశభక్తి వాళ్ళకి ఉండబట్టే అలా ధైర్యంగా ముందుకురుకుతారు."

ప్రతిమ ఫకాల్న నవ్వింది. బిగిసిన వాతావరణం సడలి నట్లయింది. ఆమె ముఖం శాంతంగా మారిపోయింది. "అదే నేను చెబుతున్నాను."

"అమ్మ దొంగ - నువ్వలా అనలేదు - వెంకటేశ్ మనకు సాక్ష్యం."

ప్రతిమ భర్త కళ్ళలోకి చిరునవ్వులు తొణికిస్తూ చూపింది.

"వేరేప్పుడు ఆ భక్తితో చేరరు. కాని, తరువాత దేశశాంతి భద్రతలకు ముప్పు కల్గినప్పుడు- గుమ్మంలో శత్రు సేనలు తిష్ఠవేసు

కూర్చున్నప్పుడు - ఆ సమయంలో దేశభక్తి వాళ్ళ అణువణువునూ కుదిపి వేస్తుంది. రెట్టింపు శక్తితో ముందు కురుకుతారు. మహదవకాశం దొరికిందని దీక్షతో పోరాడుతారు.''

గదిలో నిశ్శబ్దం.

వింజామరలు వీస్తున్నట్లు ఒక్కొక్కరు వూపిరి వదుల్తున్నారు. ఎవ్వరూ మాట్లాడ లేదు.

చివరికి మహీధర్ అన్నాడు ''నేను నీతో ఏకీభవించ లేను ప్రతిమా!''

''ఫరవా లేదు. ఇందులోనే కాదుగా మనం ఏకీభవించనిది? ఇంకా ఎన్నో ఉన్నాయి. వాటిలో ఇదొకటి. అన్నయ్యా! అలసి పోయావు. మరి నిన్ననే రిఫ్రిజరేటర్ కొన్నాము. ఐస్‌క్రీం చేశాను. తెస్తానుండు,'' అని లేచి వెళ్ళింది,

''చూశావా? - ప్రతీది ఈస్టు అండ్ వెస్టు లాగానే ఉంటూంది మా వ్యవహారం,''

''ఐతే ఏం? ప్రతిమ తన వాదనలో కౌశలం చూపింది. ఒక్క అనుమానం రా. ఇలాంటి ఏకీభవించని విషయాలను పురస్కరించుకుని మీరిద్దరు ఎడమొగం పెడమొగం పెట్టుకుని మూడ్ పాడు జేసుకోరు కదా! అదే నా భయం.''

మహీధర్ చల్లని నవ్వు చిందిస్తూ స్నేహితునికి దగ్గరగా జరిగాడు. ''రెండు వాయిద్యాలున్నాయి. శ్రుతి కలపక ముందు అవి రెండు విభిన్నమైన స్థాయిల్లో పలుకుతూంటే, కర్ణకఠోరంగా ఉంటుంది. కొంతసేపు అలా పలికి క్రమంగా శ్రుతి గలిసిన తర్వాత సర్దుకుంటాయి. అప్పుడు ఆ రెండూ ఏకమై మాధుర్యాన్ని నింపుకుని సుమధుర గీతాలాలపిస్తాయి కదా! అంతే. ఎవరికి వాళ్ళం విభిన్న ప్రవృత్తులు

కల్గి తూర్పు పడమరల్లా ఉన్నా- చివరికి ఈ జీవన రాగాన్ని ఒకే శ్రుతిలో ఆలాపిస్తాము. అదుగో - వస్తుంది చూడు, ఆమెలో నాలో ఏ వైష మ్యాలుగాని కనిపిస్తున్నాయా?"

"ఉహూ," అంటుండగనే ప్రతిమ టీపాయిమీద ట్రే ఉంచింది. ఇద్దరికి చెరో కప్ అందించి తనొకటి తీసుకుంది.

"బాగానే కుదిరింది." భర్త మెచ్చుకున్నాడు.

"చాల బావుందమ్మా!" వెంకటేశ్ మాటలకు గోముగా భర్త కేసి చూసింది.

"ఎంతైనా అన్నయ్య, చాల బావుందన్నాడు."

ముగ్గురూ నవ్వుకున్నారు.

గడియారం ఎనిమిదిన్నర చూపుతూంది.

వెంకటేశ్ అప్రయత్నంగా వాచీ చూసుకున్నాడు."ఎనిమిదిన్నర. వస్తా మరి. ఈ ఆదివారం ఇంటికి రండి. రత్నం ఐస్‌క్రీమ్ చేసి పెట్ట లేదు గానీ, ఆవడలు, అరిసెలు చాలా బాగా చేస్తుంది."

"అవంటే మా ఇద్దరికీ చాలా ఇష్టం."

"ప్రతిమా! నీకు తెలీదుగానీ, వెంకటేశ్ తెచ్చేవాడు అరిసెలు, చేగోడీలు. తెచ్చిన మరునాటికి డబ్బా ఖాళీ చేసేవాణ్ణి."

"అంతా వట్టిదేలేమ్మా! వెళ్లొస్తాను," అని లేచాడు. ప్రతిమ, మహీధర్‌లుకూడ గేటువరకు వెళ్ళారు.

అలా వాళ్ళిద్దర్నీ వదలి వెళ్తున్న వెంకటేశ్ హృదయం ఎంతో ఉల్లాసంగా ఉంది. ఈ గంటన్నరలో వారితో చాలా కులాసాగా గడి పాడు. వట్టి పోచుకోలు కబుర్లతో కాక ఏదో తమాషాగా గడిచింది సమయం. మనసు ఉల్లాసంగా ఉంది. ఆకాశంలో పంచమి చంద్రుడు సన్నని వెన్నెల ప్రసరింప జేస్తున్నాడు. చిన్న చిన్న తెల్లమబ్బులు తేలిపోతున్నాయి. అతని హృదయం అంత తేలికగా, హాయిగా ఉంది. వీళ్ళ సమక్షంలో కొంతసేపు గడిపి తను ఎంత ఉత్సాహాన్ని పుంజు కున్నాడు!

# 14

మరుసటిరోజు ఇంటికి రాగానే రత్నం లేడిపిల్లలా తిరుగుతూ మహా హుషారుగా ఉంది. ఏమిటో విశేషం అనుకున్నాడు.

"మా ఊరినించి శేషయ్య మామయ్య వచ్చి వెళ్లాడు. రాత్రికి వస్తే వస్తారట. లేకపోతే ప్రొద్దుట వచ్చి మిమ్మల్ని ఒకమాటు చూసి వెళ్తారట."

'అదీ విశేషం!' అనుకున్నాడు వెంకటేశ్. "ఎప్పుడొచ్చాడు బాబాయ్?"

"మధ్యాహ్నం. మీరు అప్పుడే భోంచేసి వెళ్లారా - వాళ్లు ఇటు దిగారు. మళ్ళీ వండుతానన్నాను. హోటల్‌లో భోంచేసి వచ్చారట."

"ఏం పని మీద వచ్చాడో?"

"ధాన్యం అమ్మటానికట."

"ఓ.... నీకు బాగా కాలక్షేపం అయివుండాలి. కదూ?"

"ఆ.... నాల్గు గంటల వఱకు కూచుని వెళ్ళారు."

"ఇంట్లో అంతా క్షేమమేగా?"

"అందరూ బాగానే ఉన్నారట. అమ్మకే కొన్ని రోజులు సుస్తీ చేసిందిట. ఇప్పుడు నయమే నన్నాడు."

"పోనీ, ఇక్కడికి పిల్చుకొచ్చినట్లయితే మందిప్పించేవాళ్ళం కదా?"

"ఆ మాటే నేనూ అన్నాను. కానీ, మా ఊళ్ళో గోవిందయ్యా డాక్టరున్నాడుగా. అతడే బాగుజేశాట్ట"

"ఏమిటీ? గోవిందయ్యా? అతడి కేమీ తెలీదే! వట్టి క్వాక్ - అంటే ఉత్తుత్తి డాక్టర్ అన్నమాట. అనుభవంతో ఏదో నాల్గు

మందులు పేర్లు నేర్చుకుని ఇలా డబ్బు సంపాదిస్తారు. అదృష్టం బావుంటే జబ్బు నయమౌతుంది. లేకపోతే జబ్బును ముదరగొట్టి మావల్ల కాదంటారు. దురదృష్టవంతులు కాస్తా వైకుంఠ యాత్ర కెళ్తారు."

"అలా అనకండి. గోవిందయ్య ముప్పై ఏళ్లుగా ఉన్నాడక్కడ. అందరికీ మందు లిస్తుంటాడు, అందరిళ్ళకీ వెళ్ళి పరామర్శిస్తూంటాడు. డబ్బుకూడ ఎక్కువ పుచ్చుకోడు. పాలు, పెరుగు, నెయ్యి, కూర గాయల్లు, పప్పులు, బియ్యం- తోచింది ఇస్తే చాలు. ఎలాంటి జబ్బునైనా కుదిర్చి పంపుతాడు. పోయిన సంవత్సరం ఏమైందను కున్నారు! నారపరెడ్డిగారి కూతుర్ని అత్తారింటికి పంపటానికి ఏర్పాట్లు చేస్తున్నారు. బంధు జనంతో ఇల్లంతా సందడిగా ఉందిట. నారపరెడ్డి తిరిగి తిరిగి వచ్చాడు. అంతే. వాంతులు చేసుకుని అలా పడిపోయాడు. గోవిందయ్య దేవుడిలా వచ్చాడు. అందరు భయంతో విలవిల్లాడిపోయారు. ఆ సాయంత్రానికంతా బాగుచేసేశాడు. ఎంత విద్య లేకపోతే అలా నయం చేయగలడు!" కళ్లు ఇంతింత చేసుకుని చెప్పింది రత్నం.

"అలసిపోయి ఉంటాడు. ఎండ దెబ్బ తగిలింది కాబోలు."

"ఇలాగే ఎన్నో. ఏదైనా శుభకార్యం తలపెడ్తే ఆ ఇంట్లో అవాంతరాలు. జబ్బులు. చిటికలో నయం చేస్తాడు. ఊళ్ళో అందరికి అతనంటే మంచి గురి."

"నీకు అంతే తెలుసు. అత్తయ్యకు నువ్వు పుట్టినప్పుడు చాల జబ్బు చేసింది, ఏదో మందిచ్చాడు. తిరగ బెట్టింది. అప్పుడు నేను, మా నాన్న మా ఊరి పెద్ద డాక్టర్ని తీసుకెళ్ళి చూపించాము. చచ్చిపోతుందనుకున్నాము. ఆయన చాల కోపగించుకున్నారు - చేతకాని వాళ్ళ చేతుల్లో ప్రాణాలు పెట్టొద్దని. అత్తయ్యకు బాగవటానికి నెల రోజులు పట్టింది. రెండొందలు ఫీజు తీసుకున్నాడు."

"ఆ సంగతి కూడా తెలుసు. ఏదో ఆ రోజు విధి అతణ్ణి చిన్న చూపు చూసింది. తర్వాత మా కందరికీ మందులిచ్చింది అతనేగా!"

"ఆ మాత్రం మందులివ్వటం నాకూ వచ్చు. జ్వరానికి, విరోచనాలకు, బిలాబిక్కి, చెవిపోటు, కంటి జబ్బు, పంటిపోటు, నడుంనొప్పి,

తలనొప్పి.... మై గాడ్ చాలా వ్యాధులకు నాకు మందులు తెలుసు. పోనీ, మీ పల్లె కెళ్లి గోవిందయ్యకు పోటీగా ప్రాక్టీస్ పెట్టిద్దామా ఏమిటి? నీక్కూడా కొన్ని చిట్కాలు నేర్పిస్తాను."

రత్నం పక పక నవ్వింది. భర్త మాటల్ని లెక్క చేయకుండా అంది; "అమ్మకు సుస్తీ జేస్తే అతనే బాగుచేశాట్ట. ఆయన కూతురి పెళ్ళికి రెండు బస్తాల సన్న బియ్యం పంపారట నాన్నగారు."

"భేష్ - రెండొందలకు పైగా ముట్టిందన్నమాట."

"ఆ... పండిన బియ్యం. ధరగట్టి బేరం జేస్తారేమిటి? అది గాడు. ఇచ్చారు."

"ఏమోలే. నాకవన్నీ తెలియవు సుమా! బిల్లుమీద డబ్బు ఇంత కట్టాలి - అని డాక్టర్ రాస్తే, ముఖం చిట్లించుకుంటూ, డబ్బుల సంచి బిగించుకుంటూ అగ్గయిపోవటం తెలుసు. సరేలే. వంట చేశావా? మంచి తెలుగు సినిమా వచ్చింది, వెళ్దాం."

"మరోనాడు వెళ్లొచ్చు. వంట కాలేదుగానీ - ఇది వినండి. మా ఇంటి వెనకాతల కోటపరెడ్డి ఉన్నాడు. ఆయన ఐదెకరాలు మాగాణి కొన్నాట్ట. అంత డబ్బు గలవాడు కాడు. ఎక్కడినించి వచ్చిందా అనుకున్నారట. ఇద్దరు కొడుకులున్నారు. పది - పన్నెండు సంవత్సరాల పిల్లలు. రెండో వాణ్ణి దత్తుకిచ్చారుట. వాళ్లు గుడివాడ వాళ్లు కాబోలు. చుట్టాలు గూడ కాదుట. ఎనిమిదివే లిచ్చారుట. రెండో కంటికి తెలియకుండ గుట్టుగా చేసుకున్నారట. మనం వచ్చి ఆర్నెలలౌతుందా? ఇంతలోనే ఎన్ని జరిగాయో!"

"మీ మామయ్య న్యూస్ పేపర్లా అన్నీ చెప్పేశాడు కాబోలు."

"ఆ.... వారేమిటి! అసలు విషయం మర్చేపోయాను."

"అంతేలే. పుట్టింటి వాళ్ళని చూస్తే నన్నేమర్చిపోతున్నావు."

తెచ్చికోలు కోపం ప్రకటిస్తూ కనుబొమలు చిట్లించింది రత్న.

"మామయ్య కూతురు సుబ్బులక్ష్మికి సంబంధం కుదిరిందట. అబ్బాయిది పెనుగొండట. ఇద్దరన్నలు. ఇద్దరక్కలు. ఆఖరి అబ్బాయి అక్కడెక్కడో వకీలు చదువు చదువుతున్నాట్ట. ఇంకొక సంవత్సరం

వుంది. మామయ్య వాళ్లే చదివిస్తారట. మంచి కుటుంబం అవి, బాగా ఉన్న వాళ్ళనీ మామయ్య కెంతో సంతోషంగా వుంది."

"బాగా ఉన్న వాళ్లయితే ఎందుకు చదివించమన్నారు?"

"వ్యవసాయదార్లు. మామయ్య తనే చదివిస్తానని ఉంటాడు, వాళ్ళదే సందనుకున్నారు. సుబ్బలక్ష్మి కాస్త నలుపని, పెళ్లి కాదేమో నని భయపడ్డారు. ఈ సంబంధం రాగానే వాళ్ళకు అవీ ఇవీ ఇస్తామని ఆశ జూపి సరేననిపించుకున్నాడు."

"అయితే, నల్ల పిల్లకు పెళ్లి కాదన్నమాట. నీకెలా అయింది?" అన్నాడు; దంతంలోని మార్దవం తొణికిసలాడుతున్న ఆమె చెక్కిళ్ల వైపు కొంటెగా చూస్తూ.

ఆమె సిగ్గు పడిపోతూ ఓరగా చూసింది.

"ఇంకా ఏమిటి? అయిపోయిందా?"

"మా కట్టి ఆవు - మీరు చూడలేదులెండి. పెయ్య దూడ వేసిందట. పుట్టిన వారం రోజులకే ఏదో జబ్బు చేసిందట. ఇంట్లోనే వైద్యం చేశారుట. కానీ, పోయిందట. అమ్మ పుట్టింటివారు తోలిన ఆవు తాలూకు దూడ. మూడు సేర్లకు తక్కువ పాలు పితికేది కాదు. అమ్మ గంగమ్మా అని పిల్చుకునేది. అంత అపేక్ష."

"గోవిందయ్యను పిలవలేదూ!" సీరియస్‌గా ముఖం పెట్టి అడిగాడు.

"ఆఁ. పిల్చారుట."

"బాబోయ్! మీఊళ్ళో మనుష్యులకు పశువులకు ఒకే వైద్యుడా! మనుష్యులు పశువులతో సమానమన్న మాట!" పెదాలు నవ్వును దాచుకున్నాయి.

"ఏం కాదు. పశువులే మనుష్యులతో సమానం."

"ఏమోలే - అటు - ఇటుకూడ వుండొచ్చుగా!"

"అయ్యో - పల్లె టూళ్ళలో మీకు తెలీదా! పేదరైతు పశువుల్ని ఎంతో ఆప్యాయంగా, ప్రేమగా, భద్రంగా చూసుకుంటాడు. వాళ్ళదీ తెగని బంధం. ఆ పశువు మీదే తన జీవితం ఆధారపడి వుంటుందని ఎంతో శ్రద్ధగా దాని బాగోగులు చూస్తాడు."

"ఓహో - నాకు తెలీదులే. ఆ రైతు రెక్కాడితే డొక్కాడు తుంది. ఆ విషయం దానిక్కూడా తెలుసు."

"పోనీలెండి. వాటి సంగతి మన కెందుకుగానీ, పండక్కి రమ్మని కబురు చేశారు. ఉత్తరం రాస్తారట. అమ్మ మరీ మరీ కబురు పెట్టిందిట. నా స్నేహితురాలు ధనలక్ష్మికూడా వస్తుందిట. దాన్నిచూసి చాలారోజు లైంది. అది ఎక్కడో మాచ్ ఖండులో ఉంది. బోలెడు కబుర్లు చెబుతుంది. అక్కడ కోయజాతి ప్రజ లున్నారట. వాళ్ళనిగూర్చిన విడ్డూరా లెన్నో చెబుతుంది. మనం వెళ్దాం. సెలవు చీటీ రాయండి."

"ఏమో. సెలవు తుందో లేదో!"

"అలా అనకండి. నాకు వెళ్లాలనుంది. మరి మామయ్య చెప్పాడు. పంచదార దొరికితే తీసుకెళ్లాలట. పంచదారంటే గుర్తొచ్చింది. నాకో స్నేహితురాలుంది పార్వతి అని. అత్తారింటి కెళ్లి పంచదారతో కాఫీ చేసిందట. ఇక అత్తగారు ఒంటికాలుమీద లేచి, పంచదారతో కాఫీ చేస్తావా? బెల్లంతో చేయాలిగాని, నువ్వు తెచ్చిన కట్నంతో బ్లాకులో పంచదార కొని పొయ్యలేము. అంతగా కావా లంటే పుట్టింటినించి తెప్పించుకో అందిట. ఏం జేస్తుంది? పుట్టింట ఉండేది మరికొన్ని సంవత్సరాలే. అక్కడే 'ఆడ' పిల్లయి పెరుగుతుంది. చచ్చేంత వరకూ ఉండవలసిన ఇంట్లో ఇల్లాంటి గొడవలు.... అన్నింటికీ అదృష్ట ముండాలి!"

"నీ అదృష్టం బావుందిగా!"

"ఓ....నాకేం గాని, మా పూర్ణయ్య బాబాయి కొడుకు లిద్దరు పోట్లాడుకుని వేరు పడ్డారుట. ఇంకొక్క అమ్మాయుంది పెళ్లికి. వేరుబోకముందు పెళ్లి కింత వేరుగా వుంచాట్ట బాబాయి. ఎంత తెలివైనపని చేశాడో చూశారా!"

"అసలు ముందే పంచిచ్చా డెందుకని?"

"పాపం! పక్షవాతంతో మంచ మెక్కాడు. పొలానికి నువ్వు పో - అంటే నువ్వుపో అని వాదులాడుకునేవాళ్ళట. ఇక లాభం లేదని పంచిపెట్టేశాడు. ఏటా తనకు, పిన్నికి ఇంత ఇవ్వాలని కూడా

ఉందిట. ఐతే- ఒకే ఇంట్లో ఒకే వంట. కానీ. ఇప్పుడు వేరు బోయా రట. పెద్దన్నయ్య భార్య మహా గయ్యాళి. అత్తమానం చిన్న వదిన్ని ఏదో అని తిట్టిపోసి ఏడిపిస్తుంది. చిన్నవదినె పిన్నికి సొంతం. అందు కని వేరుబోతామంటే ఒప్పుకున్నారు. చెల్లాయికి సంబంధం చూస్తు న్నారుట. మిమ్మల్ని కూడ చూడమన్నాడు మామయ్య. వెళ్లేటప్పుడు మంచి రకం పొగాకు గూడ తీసుకెళ్ళాలిట మనం. మరేమో...."

భార్యామణి వాగ్ధాటి ఆగేలా లేదు. ఆ ప్రవాహంలో అచేత నంగా కొట్టుకుపోతున్నట్లుంది. గభాల్న లేచి నుంచున్నాడు. "ఇంకా వంట కాలేదుగా - చేస్తుండు - అలా తిరిగొస్తాను."

"మామయ్య వస్తాడేమో, త్వరగా వచ్చేయండి."

"ఆ....వచ్చేస్తాలే!" విసుగ్గా అని విసురుగా వెళ్ళిపోయాడు. భర్త అంత దురుసుగా ఎందుకెళ్లాడో రత్నం కర్థం కాలేదు. ఒకవేళ సినిమాకి తయారవమంటే తను నిర్లక్ష్యం చేసినందుకేమో! ఈ రోజు కాకపోతే సినిమా రేపు. కానీ, ఇంటినించి తన ఆత్మీయులు వస్తే- వాళ్లు తెచ్చిన చల్లని కబుర్లు, వారు పంపిన వస్తువులు చూసుకుని ఆనందించే అనుభూతి కొంతసేపైనా హృదయంలో నిల్చిపోవద్దూ!

ఆమె వెళ్లి వంట కుపక్రమించింది.

గుమ్మం దిగిన వెంకటేశ్ బుర్ర గిర్రున తిరిగిపోయింది. దాదాపు గంటసేపు రత్నం ఏవేవో కబుర్లు చెప్పింది, వినాలనిపించలేదు. ఆ విశేషాలన్నీ ఆమెకు హితులైన వార్ని గూర్చినవి. తనకేమి ఆసక్తి ఉంటుంది? అవి గ్రహించకుండా ప్రతి విషయం తు. చ. తప్పకుండా ఏకరువు పెట్టింది. ఆమె నొక ఉన్నత స్థాయికి తీసుకెళ్ళాల్సిందిపోయి ఆమె స్థాయికి తాను దిగుతున్నాడనిపించింది. క్వాక్ డాక్టర్‌ను సమ ర్థించటం! ఎవరో దత్తు తీసుకుని డబ్బిస్తే - ఆ డబ్బుతో పొలం కొంటే వీళ్ళదేం పోయింది! సుబ్బలక్ష్మికి కుదిరిన సంబంధం తాలూకు వివరాలు - పోనీ - అది తెలుసుకోవచ్చు - ఎందుకంటే, లక్ష్మి తనకు చెల్లాయి అవుతుంది. వాళ్ల కత్త ఆవును గూర్చి తనకేమి ఇన్‌టరెస్టు తని! తవిత స్నేహితురాళ్లను గూర్చిన వివరాలు తనకెందుకు! ఇంకా

తను ఓపికబట్టి కూచుంటే తెల్లవారేదాకా ఆమె ప్రలాప ప్రవంతిలో కొట్టుకుపోయేవాడే. బ్రతికి బైటబడ్డాననుకున్నాడు.

కొంతదూరం వెళ్లి ఏకాంతంగా ఉన్న చెట్టుక్రింద రుమాలు పరచుకుని కూచున్నాడు.

రత్నగురించి ఆలోచిస్తున్నాడు. అతని మనోవీథిలో రత్నం ప్రక్కన ప్రతిమ వచ్చి నుంచున్నది. ఇద్దరికి ఏంత భేదం! ఒకరు సానబెట్టిన వజ్రంలా ప్రకాశిస్తూ ఆ స్ఫురత్ చంద్రికలలో ఇతరుల కాత్మసంతుష్టిని ప్రసాదించే వ్యక్తిత్వంలో శోభిల్లుతున్నట్లుంది. మరొకరు సానబెట్టని వజ్రంలానే వుండిపోయి ఆ రూపంలోనే తనకు ఆనందం వున్నట్లు భావిస్తూ ఇతరుల కదే అభిప్రాయాన్నిస్తూ అల్ప సంతోషిగా కాలం గడుపుతున్నారు. వారిద్దర్నీ అలా చూస్తూంటే రత్న తేలిపోతోంది. తను పొరపాటు చేశాడు. సరిదిద్దుకోలేని నేరంచేశాడు. రత్నని తను పెళ్ళాడకుండా వుంటే తను ఈనాడు ఏకాంతంగా చెట్టు క్రింద నిస్సారంగా, ఇలా పరితపిస్తూ గడిపేవాడా! ప్రతిమతో సరి తూగ గల అందాల విద్యావతి తనకు భార్య అయివుండేది. ఆనాడు తన జీవితం మహోన్నత స్థాయిలో ఉండేది. కానీ, ఈనాడు? ప్రస్తుతాన్ని అభివర్ణిస్తున్నట్టు చెట్టుమీది కాకుల గోల ఎక్కువైంది. కాకి ఒకటి తప్‌న.... వేసింది. ఛత్ అనుకుని లేచాడు. కాసేపు అటూ ఇటూ తిరిగి ఇల్లు చేరాడు. రత్నం వంట ఇంకా పూర్తికాలేదు. భర్తలోని మార్పుకు కారణం ఆమెకు తెలియలేదు. అనుభవలోపంవల్ల ఆమె ఇంగితం అడుక్కి జారిపోయింది.

## 15

ఆదివారం వచ్చింది. ఆ రోజు ప్రత్యేకతను ఆహ్వానిస్తూ ఆలస్యంగా లేచి గదిలో వ్యాపించిన పసిడి కాంతుల్ని చూసి ఆనందిస్తూ బద్ధ

కంగా కొంతసేపు పరుపుమీద దొర్లుతూ, 'లేవండి!' అనే అర్ధాంగి హెచ్చరింపుల్ని వింటూనే ఆనాటికి చెవిటివాడై ముసుగు మరి కాస్త బిగించి - టిక్ - టిక్ - అంటూ పరుగుదీసే గడియారం వేపు విజయ గర్వంతో చూసి ఆనందంగా సర్దుకోవటంలో ఆదివారపు విశిష్టత తెలుస్తుంది.

అలవాటుగా రత్నం ఐదున్నరకే నిద్రలేచింది. పనిమనిషి అరగంటలో పని ముగించుకుని వెళ్ళిపోయింది దోసెలోకి పచ్చడి రుబ్బుకుని టిఫిన్ తయారుచేసి కాఫీకి నీళ్లు పెట్టింది. ఎంతట్లో పొంగుతాయి! తెల్లవారనైనాలేదు. అందులోనూ ఆదివారం. ఎలాగూ త్వరగా లేవరు అనుకుని, ఏం చేద్దామా అనుకుంటూ అటూ ఇటూ కాసేపు తిరిగింది. చటుక్కున గుర్తొచ్చింది- ఆ రోజు ప్రతిమావాళ్లొస్తారని. శనగపప్పు - మినప్పప్పు నానవేసింది. ఆ పని ఐదు నిమిషాల్లో అయిపోయింది. డ్రాయింగ్ రూంలో ఉన్న మేగజీన్స్ తిరగేసింది. ఈమధ్య చదవటంలో కొద్దిగా శ్రద్ధ చూపుతూంది. ఆమెకు నచ్చని కథలు విషాదాంతాలు, మెదడుకి మేతనిచ్చేవి, జుగుప్సాకరంగా ఉండేవి, అధునాతనంగా ఉండేవి. మరి నచ్చేవి స్వల్పమే! ప్రతి పుస్తకంలో అచ్చయ్యే మూడు లేక నాల్గు కథల్లో ఆమెకు నచ్చేది ఒక్కటే. ఆ ఒక్కదానిలో కూడ తను అంగీకరించలేని అంశాలను మననం చేస్తూ రచయితను తిట్టుకునేది.

భళ్లున తెల్లవారి - పక్షుల కిలకిలారావాలు ఆగిపోయి- సూర్య కిరణాలు వేడిమిని పుంజుకుంటూండగా వెంకటేశ్ నిజంగా మేల్కొన్నాడు.

ఎక్కడా అలికిడి లేదు. రత్నం తనపాటికి తనను వదిలేసింది. మంచిదే, ఆ మాత్రం ఇంగితం ఉందనుకున్నాడు. ఇక పడుకోవాలనిపించలేదు. దుప్పటి తీసి పారేసి కూచున్నాడు. ఎక్కడా అలికిడి లేదు. ప్రపంచమంతటా ఆదివారం వ్యాపించి జోకొడ్తున్నది కాబోలు. ఎక్కడా ఏమాత్రం సందడీ - హడావిడీ లేదు.

నెమ్మదిగా లేచివెళ్ళి చాటుగా చూశాడు. ఆమె పుస్తక పఠ

నంలో నిమగ్నమై ఉంది. గడియారం ఎనిమిదిన్నర చూపుతూంది. హృదయంలో తేలిక భావన ఏదో చోటు చేసుకుని హాయి నిచ్చింది.

చకచక పళ్ళు తోముకున్నాడు. చప్పుడు విని పుస్తకం మూసేసి కాఫీ కలపటాని కెళ్ళింది రత్నం.

ఆమె అందిస్తున్న కాఫీ గ్లాసు అందుకున్నాడు.

"ఇవ్వాళ మహీధర్ -ప్రతిమ వస్తున్నారు. జ్ఞాపకముందిగా?"

"ఆ....తెల్లవారు ఝామునే జ్ఞాపకం వచ్చింది."

"ఏం చేస్తావు?"

"అన్నయ్యకు బొబ్బట్లు చాలా యిష్టం. గారెలు చేస్తాను. అందులోకి నెయ్యి, పాలు, కొబ్బరి, పచ్చడి - కాఫీ - చాలు కదూ? తమలపాకులు, పూలు, పళ్లూ తీసుకురండి."

"అలాగే - కానీ, బొబ్బట్లు, గారెలు ఇన్ని చేయగలవా? పోనీ, సుబ్బాయమ్మగార్ని సాయం పిలవరాదూ?"

రత్నం నవ్వింది. ఆ వికసించిన మోము వైపు చూస్తూ కను బొమ లెగరేశాడు వెంకటేశ్. "ఎందుకో అంత నవ్వు?"

"మరి రాదూ - ఇంత పప్పు రుబ్బటానికి ఒకరి సాయం కావాలా? ఎందులో హుషారు లేక పోయినా ఇల్లాంటి పనుల్లో నాకె వరూ సాయం చేయక్కర్లేదు."

"ఐతే, ఇప్పుడే చెప్తున్నాను, విను. ఇవ్వాళ ఆదివారమేనా?"

"అవును. ఒకవేళ మీరు కాదనుకుంటే అది వేరే సంగతి."

"అంటే- వేపకాయంత ఉందనేనా?" క్రోధం పైపైన కని పించేలా అడిగాడు.

"అని నేను అనలేదు. సరే లెండి. ఇవ్వాళ ఆదివారం."

"ఇది నాకు అత్యంత ప్రియమైన రోజు."

"నాకు కూడా."

"గడియారానికి బెదిరే రోజు కాదిది."

"ఔను. దానిమొఖాన్నెవరు చూస్తారు? రేపు దానికి పూజలు కూడా చేస్తాం."

"నాకు విశ్రాంతి ఇచ్చే రోజు."

"అరచే- ఇద్ధకరంగా అన్ని పనులు వేళ తప్పించి చేసుకోవటమే కదూ!" కళ్ళలో ఎంతో అమాయికత్వం తొణికిస లాడింది.

"అనుకో. అందుకే చెప్తున్నా. సరే- ఎవరినీ సాయానికి పిల వొద్దు. బజారునించి నువ్వు కోరిన వస్తువులు తెచ్చి పారేస్తాను. ఆ తర్వాత నేను పనికెళ్ళిపోయాననుకో."

"అల్లాగే. మీరు పనికెళ్లారనుకుంటాను. ఒంటిగంట దాటా కనేగా భోజనాని కొస్తారు." వస్తూన్న నవ్వు నాపుకోటానికి కాఫీ గ్లాసు పెదాల దగ్గరకు తీసుకెళ్లింది. తనకు తెలుసు- ఆదివారం పనిలేక ఇంట్లో ఉంటే ఆకలి వేస్తుంది. పన్నెండు గంటలకే వడ్డిస్తుంది. ఓ పది నిమి షాలు లేటైనా సహించలేడు.

"అలాగే అనుకో. పాపం చుట్టుకుంటుంది." కపిగా అన్నాడు. రత్నం కిలకిల నవ్వింది.

"మీరు ఒక్క పిసరు పని అందుకో అక్కర్లేదు. ఎందుకంత భయం? హాయిగా పడుకోండి. నిద్రపొండి. లేదా, పక్కమీద దొర్లండి. నా పనికి అడ్డు తగలకుండా వుంటే పదివేలు."

"ఓ....నీ వంటింట్లో అడుగు పెడ్తే ఒట్టు!" అన్నాడు.

పన్నెండు గంటలకు భోంచేసి పేపర్ చూస్తూ కూచున్నాడు. రత్నం పత్రికలు చూస్తూ కూచుంది. రెండు గంటలైంది. వెంకటేశ్ బుద్ధిగా వెళ్ళి పక్కమీద మేను వాల్చాడు. మెలకువగా ఉన్నాడను కుంటే పిలుస్తుందేమో అని భయం. కళ్ళు గట్టిగా మూసుకుని గాఢ నిద్రలోకి జారిపోయినట్లు భ్రమ కల్గించాడు.

కాని, అలాగే నిద్ర పట్టేసింది. భర్తను కొంచెం ఆడించాలని పిలవటానికి కొచ్చిన రత్నం అతని గాఢనిద్రకు భంగం కల్గించకుండా వంటింట్లోకి వెళ్ళిపోయింది.

వెంకటేశ్‌కు మెలకువ వచ్చింది. అది కలా- నిజమా! తుషార బిందువులు చల్లచల్లగా పడ్తూ హాయిగొల్పుతున్నాయి. సన్నని పరి మళం గది అంతటా వ్యాపించింది. కళ్ళు తెరిచి చూశాడు.

నవ్వులు చిందిస్తూ మీదికి వంగి పన్నీరు చిలికిస్తోన్న రత్నం

కనబడింది. భర్త కళ్లు తెరవగానే దాన్ని ప్రక్కనుంచి లేవబోయింది. ఆమె నడుం చుట్టూ చేతులు వేసి అలాగే అదిమి పట్టుకున్నాడు. ఆమె కళ్లు మిలమిల లాడాయి. పెదిమలను ముచ్చటగా చిరునాలుకతో తడుపుకుంది. దాని అర్థం గ్రహించి అందుకున్నాడు. అతని సుదీర్ఘ చుంబనానికి ఉక్కిరి బిక్కిరై ంది.

"సరే లెండి. ఈ సంగతి చెబితే అలా త్రోసి పడేస్తారేమో!" అని సర్దుకు కూర్చుని ముఖం సీరియస్‌గా పెట్టకుంది.

"ఏమైంది?" ఆత్రంగా అడిగాడు.

ఆమె వెంటనే చెప్పలేదు. అప్పటికి గుర్తొచ్చింది స్నేహితులు రాబోతున్నారని, ఏమైందో. చటుక్కున లేచి కూచున్నాడు.

"ఏమైంది? ఏంచేయలేదా?"

ఇక హోటల్‌కు పరుగెత్తాలి కాబోలు - అనుకుంటుంటే కోపం వచ్చేసింది. "ఆ మాట ముందే చెప్పినట్లయితే ఈపాటికి అంతా సిద్ధం చేసుంచేవాణ్ణి. వట్టి ప్రగల్భాలు ...." విసుక్కుంటూ లేచి నుంచున్నాడు.

ఆమె కిక్కురు మనలేదు. ఉస్సురని నిశ్వసించింది.

"అలా ఫ్లాస్కు నా ముఖాన పడెయ్య...."

"నే అన్లేదూ? పోనీ, మీది .... మీకివ్వ మంటారా! లేనిపోంది దగ్గరకు తీసుకున్నానని బాధపడ్తున్నట్లున్నారు."

"ఏదీ వద్దులే. నిన్ను నమ్ముకున్నందుకు బాగానే శాస్తి చేశావులే!"

"మరి. వాళ్ళు మీ స్నేహితులు. మీరే పిల్చారు. అంతా నా నెత్తిన పడేసి నిశ్చింతగా బజ్జుంటే, నడ్డి విరిగి రెక్కలెగిరి పోయేలా నేనెందుకు కష్ట పడాలి?"

"ఓహో- నా స్నేహితులు నీకు స్నేహితులు కారా?" వెటకారం ధ్వనించేలా అడిగాడు.

"ఉహూ. మా వాళ్ళంతా పల్లెలో ఉన్నారు."

"ఏదీ తయారు లేకపోయినా రంభలా తయారై కూచున్నావు. పోనీలే - చీర నలగనివ్వకు...."

"ఆ - పూలు వాడనివ్వకు అనటానికి నా తల్లో పూలేవీ...."
అంటూ, కోపంతో చూస్తున్న భర్తను దాటేసి వెళ్ళింది.

"ఎక్కడ నేర్చావే ఈ మాటలు?" అరిచాడు.

"మీరు తెచ్చిన పుస్తకాల్లోనే." అరిచింది.

గబ గబ తయారై ప్లాస్టిక్ సంచి అందుకున్నాడు. నాల్గు గంటలు కావస్తోంది.

"ఏదీ ఫ్లాస్కు?"

"వంటింట్లో షెల్ఫ్‌లో ఉంది. తీసుకోండి. మరి అలాగే పువ్వులు...."

"పూలు లేదు - గీలు లేదు" అంటూ విసురుగావెళ్లి వంటింటి గొళ్లెం తెరిచాడు. అలా దిగ్భ్రాంతుడై చూశాడు.

వంటిల్లు బాగా - శుభ్రంగా సర్దివుండటం కాదు. ముక్కు-పుటాల మురిపిస్తూ, నోరూరింపజేసే వంటకాల వాసనలు. ప్రక్కగా అరుగు మీద మూతలు వేసిన గిన్నెలు. గబగబ వెళ్ళి మూతలు తీసి చూశాడు. ఒకదాన్లో బొబ్బట్లు, మరోదాన్లో గారెలు, మరో గిన్నెలో పచ్చడి, చిన్న టిఫిన్ డబ్బాలో చేగోడీలు!

"ఎన్ని చేసింది!" అనుకుంటూ ఒక్క అంగలో రత్నం దగ్గర కెళ్లాడు. రత్నం చిలిపిగా నవ్వుతూంది.

"భలే నాటక మాడావే!" అంటూ రెండుచేతులూ ఆమె చుట్టూ వేశాడు. ఆనందాన్ని నింపుకున్న కళ్ళతో చూస్తూ కిలకిల నవ్వింది. "ఐతే, నేనేం చేయలేదని నమ్మారే!"

"మరి - చేసినట్లు కనబడ లేదు. నీ ముఖంలో అలసట గాని, పొయ్యి దగ్గరనించి లేచిన చిహ్నాలు గానీ కనబడ లేదు. వికసిత పుష్పంలా అందంగా కలకల లాడుతున్న నీ ముఖం చూచి హాయిగా నాలాగే పడుకుని లేచావనుకున్నాను .... వెళ్లి పూలు తేనా?"

"నాకేం అక్కర్లేదు." కోపం అభినయించింది.

"సరేలే!" అంటూ వెళ్లిపోయాడు.

అతను పండ్లు, పూలు తెచ్చిన కాసేపటికి ప్రతిమ, మహీధర్

దిగారు. ప్రతిమ ఫ్లాస్క్‌లో ఐస్‌క్రీమ్ తెచ్చింది. రాత్రి ఎనిమిది గంటల వరకు కబుర్లు చెప్పుకుంటూ, తింటూ మాట్లాడుకుంటూ గడిపారు. నలుగురూ ఉల్లాసంగా ఉన్నారు. వంటకాలన్నీ రత్నం చేసిందని చెప్పగానే మహీధర్, ప్రతిమ ఆశ్చర్యపోయారు.

"ఎవరి సాయం లేకుండా చేసిందంటే ఎన్నదగిన విషయమే. చాలా బావున్నాయి. ఇక ఈవేళకి భోంచెయ్యలేం." మహీధర్ అన్నాడు. ప్రతిమ వంటకాలలో చిట్కాలు కొన్ని అడిగి తెలుసుకుంది. భార్య విషయం ఆ నాడు వెంకటేశ్ చాల గర్వంగా ఫీలయ్యాడు.

వాళ్లు వెళ్లిపోగానే రత్నం అన్నీ సర్దివచ్చింది.

"రెండు రోజులు పనిమనిషి రాదు. అందుకని కొన్ని గిన్నెలు కడిగి వచ్చాను."

"అరె. మరి చాలా అంట్లు ఉన్నాయి. ఎవరినైనా ఈ రెండు రోజులకి-"

రత్నం నవ్వింది. "మీదంతా చోద్యం కాకపోతే ప్రతి చిన్న పనికి ఒకర్ని సాయం పిలవమంటారేమిటి.? మరేం ఫరవాలేదు. అరిగిపోనులెండి," అంది.

ఎంతో తృప్తిగా, హాయిగా, ఆనందంగా నిద్రపోయాడు వెంకటేశ్.

# 16

హోండ్ మిషన్ కొనుక్కొచ్చి పడేశాడు గానీ, రత్నం ఒక్కసారైన దాన్ని తాకి ఎరుగదు. అది ఇంటి కొచ్చి వారం రోజులయింది. ఓప్రక్క కోపం - మరోప్రక్క ఓటమి నంగీకరించని హృదయంతో అతడు సతమత మయ్యాడు. ఏమిటి మార్గం?

సైకిలెక్కి ప్రతిమ ఇంటికి బయలు దేరాడు. వాళ్లింటి దగ్గర ఆగాడు. మహీధర్ ఎదురొచ్చాడు. కొంపదీసి ఈరోజుకూడ పారిపోవడం లేదు కదా! అనుకున్నాడు.

మహీధర్ రహస్యంగా అన్నాడు: "వెంకటేశ్! ఒక్క సాయంచేసి పుణ్యం కట్టుకో. నాకోసం వచ్చానని ప్రతిమకు జెప్పు- అలా బైటికెళ్ళాక అసలు విషయం చెబుతాను."

లోపలికెళ్లి ప్రతిమకు చెప్పాడు ఆమె భర్తను వెళ్లమంది. చెరో సైకిల్ వేసుకుని వెళ్ళారు. హైకోర్టు వైపు వెళ్ళి అక్కడ ఒక చెటు క్రింద కూచున్నారు.

"ఈ మూడు రోజులు సెలవలు. నా ప్రాణం తీస్తూంది."

"ఏం?" వెంకటేశ్ ఆశ్చర్యాని కంతులేదు.

"పని మనిషి మూడు రోజుల్నుంచీ రావటం లేదు. జ్వరం వస్తూందిట. ఇం కెన్నాళ్లు పడుకుంటుందో మహాతల్లి."

"కొంపదీసి ప్రతిమ నిన్ను పనిమనిషిగా వాడుకోటం లేదు కదా?" తేలికగా నవ్వేశాడు వెంకటేశ్.

"ఆ.... కమక్కున్నాప్. గదులు చిమ్మటం- అంట్లు తోమటం మినహా మిగతా పనుల్లో సరిగ్గా సగం నా కోసం అట్టే పెడ్తూంది. పోనీ, అవి చేయొచ్చులే. ఉడికించిన బంగాళాదుంపలు తోలు ఒలవటం- టేబిల్ సెట్ చెయటం- చాకలి పద్దు తీయటం ఎట్సెట్రా చేయటాని కేం అభ్యంతరం లేదు. కాని, అన్నీ సర్దమంటుంది. అదే నాకు కోపం."

"ఏం సర్దమంటుంది?"

"నా టేబిల్, నా పెట్టె, నా కాగితాలు, నా బుక్ షెల్ఫ్. చిత్తు కాగితాలన్నీ తీసి పారెయ్యమంటుంది."

"మరి పారెయ్యకూడదూ? చెప్పిందంటే తప్పులేదు. కాగితం మీద ఒక్క అక్షరంముక్క వుంటే ఫైల్ జేసేరకం నువ్వు- ప్రతిమకు సర్దలేక విసుగెత్తుండాలి."

"అదంతా తన కెందుకు? మీకు చెత్తగా కనబడేది నాకు ముఖ్యమైన కాగితాల్లా కనబడ్తాయి. తను చదువుకుంటూ కూచుం

టుంది. సగం పళ్లు నేనే వెయ్యాలి. ఇంకొన్నాళ్లుపోతే నే పడు కుంటాను - మీరు చదివిపెట్టండి అంటుందేమో అని నా భయం. పనాయిదరాక మూడు రోజులు ఇంట్లో చిన్న యుద్ధమే ననుకో. ప్రతిదానికి సాయం రమ్మంటుంది. లేదా- నాకు తోచదు కబుర్లు చెప్పమని వంటింట్లో స్టూల్ వేస్తుంది. ఎక్కడికైనా వెళ్ళి ఆలస్యం చేస్తే - 'ఒంటరిగా నానా హైరాన పడ్తానని తెలిసికూడ జాగు జేశారేః ఏమనుకోవాలిః మీ రంతేలెండి' అని అలుగుతుంది. ఈ సాయంత్రం నా పెట్టె సర్దుకొమ్మంది. నా పెట్టె ఒక డ్రాయింగ్ రూం 'పీస్' కాదుగా. ఎలా వుంటేఏంః ఎవరూవచ్చి దాన్ని తెరచి చూడరుగాః సున్నం కొట్టిన ఇంట్లో సామాను సర్దవచ్చు గానీ, నా పెట్టె సర్దుకో లేను. దానికి టైం కావాలి. ముఖ్యంగా మూడ్ కావాలి ఓపిక వుండాలి. ఒక్క కాగితం తాలూకు చరిత్ర అంతా స్మృతిపథంలో తారట్లాడుతోంటే అనుభూతి ఇచ్చే ఆనందమో, వ్యథో అనుభవిం చాలి. సర్దమనగానే సర్దటంకాదు. ఒక్కో కాగితం చదివి - ఇదెందు కండీ - అని తేలిగ్గ అనేస్తుంది. తనకేం దెలుసుః - సెంటిమెంటల్ అటాచ్ మెంట్! అబ్బ- ఈ విషయాలన్నీ చూస్తే రత్నంలా కొద్ది చదువు గలదైతే బావుండు నేమో అనిపిస్తుంటుంది."

వెంకటేశ్ కి పచ్చి వెలక్కాయ గొంతులో పడినట్టయింది.

ఏమిటీ! - కొద్దిగా చదివిందైతే బావుండేదీ అంటున్నాడా! మహీధర్ నోటివెంట ఇల్లాంటి మాట వస్తుందని తను కల్లో గూడ అనుకోలేదు. దీని తాత్పర్యం ఇంత క్లిష్టంగా తేలిందేమిటిః

"ఏం - మాట్లాడవుః నే చెప్పిన మాటలో యథార్థం లేదను కుంటున్నావాః ఒక్క ప్రశ్న వేస్తాను - రత్నం నీ స్వవిషయాల్లో జోక్యం కల్గించుకుంటుదా - చెప్పుః నీ కాగితాలు, నీ ఫైల్స్ తీసి చదువుతుందాః అసలు వాటిని ముట్టుకుంటుందాః ముట్తే ఏ కాగితం పోగొట్టావని అంటావోనని వాటి జోలికి పోదుగా, అంతే! వాటిని సర్దుకోమని నీకు ఎప్పుడయినా చెప్తుందాః నీ పుస్తకా అన్నింటినీ తను సర్ది పెట్టదూః తీసిన పుస్తకం ఆ స్థలంలో పెట్టకూడదుట!

ఆ పుస్తకాన్ని యథాస్థలంలో పెట్టి సర్దటానికి టైం వేస్టట తనకి! మహా టైం విలువ గ్రహించిన వ్యక్తి తనొక్కత్తే అయినట్లు!"

"అంటే నీ అభిప్రాయం - నీ గందరగోళంలోనే ఓ పద్ధతి వుందన్న మాట."

"మరి కాక? ఏ వస్తువు - ఏ కాగితం ఎక్కడుందో నాకు తెలుసు. ఈ చదువుకున్న వాళ్ళలో ఇదే తొందర - నీ కేబాధ లేదుగా?"

వెంకటేశ్ స్నేహితుడి జబ్బచరచి బిగ్గరగా నవ్వాడు." మాంచి రకం ద్రాక్షపళ్లు తింటూ, అందులో విత్తనాలు అడ్డొస్తున్నాయని విసుకున్నాట్ట నీలాటివాడే _ ఎవడో!"

"నేనూ ఆ మాటే అంటాను." మొండిగా అన్నాడు మహీధర్.

"ఆ నీ సంగతి నాకు తెలీ దంటావా?"

చీకటి నలుమూలలా వ్యాపిస్తూంది- ఒక్కో నక్షత్రం మినుకు మినుకు మంటూంది. ఎవరి ఊహ విహాయసాల్లో వాళ్ళ మనసులు తేలిపోతున్నాయి. ప్రకృతి నల్లని మేలి ముసుగు లాక్కుంటూ, దరహాసం చేస్తున్నట్టుగా పశ్చిమ దిశలో పంచమినాటి చంద్రుడు చల్లగా, తెల్లగా, ఉల్లాసంగా ప్రకాశిస్తున్నాడు. ఇద్దరూ కలిసి ఇంటి కెళ్లారు.

ప్రతిమ వచ్చి తలుపు తీసింది. అలసి పోయిన ముఖంతో, పైపైన దువ్వుకున్న జుత్తుతో, శుభ్రంగా ఉన్నా నలిగిన చీరతో అలాగే సోఫాలో కూచుని ఉండి పోయింది.

"రా అన్నయ్యా! - ఇప్పటికి పని తెమిలింది. అటు చదువు - ఇటు ఇంటిపనితో సతమత మౌతున్నాను." ఉస్సు రంటూ అలా కళ్లు మూసుకుంది.

'చూశావా? ఎలా డీలా పడిపోయిందో!' అన్నట్టు చూస్తూ మహీధర్ స్నేహితుడి చెవి దగ్గర నోరుపెట్టి అన్నాడు: "ఈవిడ చదివి రేపు పని కెళ్లిందంటే ఆపైన నా తిప్పలు చూడు!"

"ఏమిటది?" ప్రతిమ ప్రశ్న.

"ఏం లేదు. అన్నీ నీకు చెప్పాలా?"

"అక్కర్లేదు." అది వత్తి పల్కింది.

ఏదో స్ఫురించటంతో చటుక్కున లేచి వెంకటేశ్ రెక్క దొరక పుచ్చుకుని అంది: "ఇల్లారా అన్నయ్యా! నామీద ఎంత కక్షో చూద్దువు గాని."

బెడ్‌రూంలో ఒకవైపు రంగు రంగు లతలతో అద్దకం చేసిన డి. పి. యం. గుడ్డ స్క్రీన్‌ను సర్‌మని ప్రక్కకు తొలగించింది. అది వారి డ్రస్సింగ్ కార్నర్ లాగుంది. రాక్‌మీద గుడ్డలు గాడిద మోపంత వేసున్నాయి. చిన్న టేబిల్‌మీద చెల్లా చెదరు చేసిన పుస్తకాలు - ఒకరు చేసినవి కావు - అవి వున్న తీరే అంత. అద్దాల బీరువాలో మాత్రం రెండు అరల్లో చీరలు దొంతరలు అందంగా ఇంద్ర ధనుస్సులా తోపింప జేస్తున్నాయి. కాని, మిగతా అరలు చెత్త కాగితాల బుట్టల్లా ఉన్నాయి.

"నేనేమీ వివరించక్కర్లేదుగా!" అంటూ స్క్రీన్ లాగేసి వెళ్ళి పోయింది.

ఎవ్వరూ మాట్లాడ లేదు. వెంకటేశ్ తిరిగి తన స్థానంలోకి వచ్చి కూచున్నాడు ట్రేలో - కోకో కలిపిన రెండు కప్పు సాసర్లు తెచ్చి ఉంచింది.

కళ్ళముందు ఆ అద్దాల బీరువాయే మెదుల్తోంది. దాన్నించి మనో నేత్రం గాడ్రెజ్ బీరువాలోకి చూసింది. అది తన ఇంట్లో ఉన్నది. దానికి, దీనికి ఒక్కతేడా. గాజుది కానందువల్ల లోన 'లొటారం' సంగ తెవ్వరికి తెలీదు, కనబడదు. ఆ రెండు అరలుగూడ ఇంత అధ్వానంగానూ ఉన్నాయి!

ప్రతిమ ముభావంగా కూచుంది.

వేడి వేడి పానీయం త్రాగి, చప్పుడు చేస్తూ పెట్టాడు కప్పు మహీధర్.

ఆ శబ్దం ఆమెను కదల్చ లేదు.

వెంకటేశ్ దొంగకు తేలు కుట్టినట్లు మౌనంగా ఉన్నాడు. ఏమని తీర్పు చెప్పగలడు?

వెళ్లాటానికి లేచి నుంచున్నాడు. "ఏదోలే ప్రతిమా! బద్ధ కస్తులం. క్షమించి - నువ్వే సర్దేస్తే పోలా?"

ప్రతిమ చురకలు వేస్తున్నట్లు చూచింది. "అలాగనే ఇన్నాళ్ళు నరా నన్నయ్యా! సర్దినప్పటినించీ ఇది కనబడ లేదు - అది కనబడ లేదని గొడవ. సరేనని ఊరుకున్నా. ఇప్పుడేమో ఆ కార్నర్ ఒక గోడౌన్‌లా తయారైంది. అది చూస్తే చిర్రెత్తు కొస్తుంది. సర్దుకోమంటే తప్పు. పోనీలెండి, నాకెందు కంత బాధ .... రత్నాన్ని అడిగేనని చెప్పు." అంటూ చక చక లోపలి కెళ్ళింది.

వెంకటేశ్ ముచ్చటగా మూడుసార్లు మహీధర్ భుజం తట్టి సెలవు తీసుకున్నాడు.

తలుపు తట్టగనే కడిగిన ముత్యంలా - తెల్లచీర సరిగంచు మెరుపులో కలిసి పోతోన్న దేహచ్ఛాయతో, మిలమిల మెరసిపోయే కళ్ళతో, మమత నంతా పొందు పర్చుకున్న అరవిచ్చిన తొగరు పెద వులపై హాసరేఖ లాస్యం చేస్తూంటే తలుపుదీసి అతడి హృదయ మందిరంలో చొరబడి పోయింది రత్నం!

అంతా మర్చిపోయాడు. ఆమె కున్న బలహీనతలు, డిస్‌క్వాలిఫికేషన్స్ అన్నీ తుడిచిపెట్టుకు పోయాయి. ఎంత పనిచేసినా స్వచ్ఛమైన నవ్వుతో - తన అలసటను, అసంతృప్తిని, శ్రమను విస్మరింప జేయగల శక్తి రత్నంలో ఉంది. అంతకన్నా తనకేం కావాలి! ఈ వారం రోజుల్లో కల్గని తృప్తి అతనిలో ఆ క్షణాన కల్గింది. అతని ఆనందం పరిపూర్ణ కలశం.

# 17

"వెంకటేశ్ - ఓ వెంకటేశా! ఈశా!" అంటూ తలుపు తట్టాడు మహీధర్.

రత్నం తలుపుదీసి. "రం డన్నయ్యా - టిఫిన్ తీసుకుంటున్నారు, అంది."

"నాకూ ఉందా?"

"ఓ....రండి" అంటూ లోపలికి తీసుకెళ్ళింది.

బంగాళాదుంప బజ్జీలు, పచ్చడి, కాఫీ పెట్టింది.

"ఏం - ఒక్కడివే వచ్చావు?" వెంకటేశ్ పలకరించాడు.

"చిన్న రహస్యం."

"నేను వెళ్లానా?"

'వద్దు లేమ్మా, నీకూ ఈ రహస్యం తెలియాలి."

"ఐతే, పదిమందికి తెలియవలసిన రహస్యం అన్నమాట. మా ఊళ్ళో ఒకమ్మాయికి ఒక కొడుకు పుట్టాడు. అది ఎంతో రహస్యం. కానీ, ఊరందరికీ తెలుసు."

"అలాంటిదేలే. కానీ, ఈ కొడుక్కో మంచి తండ్రి ఉన్నాడు."

రత్నం ముఖంలో సంభ్రమాశ్చర్య రేఖలు విచ్చినయి. "ఎంత మంచి కబురు చెప్పావన్నయ్యా! ఉండు, నీ నోట్లో పంచదార పోస్తాను" అంటూ నిజంగానే లేవబోయింది. అంతవరకు క్వశ్చన్ మార్క్ ముఖంతో చూస్తున్న వెంకటేశ్‌కు అప్పటికిగాని అర్థం కాలేదు. ఆనందంతో స్నేహితుడి చేయి అందుకుని, "కంగ్రాచులేషన్స్" అని ఊపేశాడు.

"ఇప్పుడే వెళ్లి ప్రతిమకో మంచి చీర తేవాలనుకున్నాను. తనకు సర్‌ప్రైజ్ అన్నమాట. వస్తారా- బజారు కెళ్దాం?"

"నేను వద్దులెండి. నాకేం తెలుస్తాయి! నాకు నచ్చిన చీర ప్రతిమకు నచ్చకపోవచ్చు. మీరిద్దరు సర్దాగా వెళ్ళిరండి."

'ఈజిన్ట్ షీ వండర్‌ఫుల్' అన్నట్లు చూశాడు మహీధర్.

వెంకటేశ్ గర్వంతో నిటారుగా కూచున్నాడు. "పద వెళ్దాం-" అని తయారయి వచ్చాడు.

"ప్రతిమ ఆరోగ్యం బావుందా?" అని రత్నం అడిగింది.

"మొన్నటినించి మగతగా వుందంటూ కూచుంది. నిన్ననే చెప్పింది."

"పాపం, చదువు సాగదేమో!"

"పోనీలే. బ్రతికిపోతాను."

రత్నం దాని అర్థం తెలీక మౌనం దాల్చింది.

ఇద్దరూ వెళ్ళిపోయారు. వారి నలా పంపించి చేతి రుమాలు అంచులు 'హెమ్' చేస్తూ కూచుంది. కుట్టు నేర్చుకోటంలో టాకా పోసిం తరువాత రెండవమెట్టు అదన్నమాట. ఒకటి పూర్తి చేసి చూసింది. ఎగుడుదిగుడు కొక్కిరిపళ్ళలా తయారయిం దా కుట్టు. ఇంకా ప్రాక్టీసు అవసరం - అనుకుంటూ టైలర్ కుట్టిన చేతి అంచు మెడ చూసుకుంది. కనబడీ కనబడని సుకుమారమైన కుట్టుగా కనిపించింది. తన కుట్టు చూస్తే తనకే నవ్వు వచ్చింది. ఎన్నదైన కుద్దేగా? నాలుగణాలు ఇస్తే కుట్టిచ్చేవాడు దర్జీ.

అలాకాదని పాతగుడ్డ తీసుకుని కుట్టు నేర్చుకోవాలన్న పట్టు దలతో కుట్టటం ప్రారంభించింది.

వెంకటేశ్ మహీధర్ చీరలు కొన్నారు. వెంకటేశ్ రత్నంకు గూడ ఒకటి తీసుకున్నాడు. ముదర వంగపండు క్రేప్‌సిల్క్ చీరకు సరిగంచు ఎంతో అందంగా నాజూగ్గా ఉంది. బిన్నీ చీర లవటం మూలానా రెండు ఒకేరకంవి తీసుకున్నారు. మహీధర్‌దగ్గర పుస్త కాలు తీసుకోవాలని వెంకటేశ్‌కూడా మహీధర్ ఇంటికెళ్లాడు.

ప్రతిమ మామూలుగా ఆప్యాయంగా పలుకరించింది.

భర్త చేతిలో పొట్లం - బ్రౌన్‌పేపర్ బ్యాగ్ చూసింది. ఏమిటని అడక్కముందే మహీధర్ ఆమె కా చీర, పూలు అందించాడు. స్త్రీ సహజమైన ఉత్సుకతతో గబగబ చీరతీసి చూసింది.

ముఖంలో ఆనందం వెల్లివిరిసింది. ఆమెను తిలకిస్తూన్న మహీధర్ హృదయం ఆనందంతో ఉప్పొంగిపోయింది.

"ఎందుకు తెచ్చా రిప్పుడు? పండుగలకి - పుట్టిన దినాలకీ ఇంకా టైం ఉందిగా?"

"ఏదైనా ప్రెజెంట్‌చేయటాని కో కారణముండాలా ప్రతిమా?"

అన్న మహీధర్ కంఠంలో ధ్వనించిన లాలిత్యానికి వెంకటేశ్ ముగ్ధుడయ్యాడు.

"బావుందా ప్రతిమా—?"

"ఓ....ఎందుకు బాగుండదూ?" ఆమె కంఠంలో ఉండవలసినంత ఉత్సాహం లేదు. ఆ లోపం కొట్టవచ్చినట్టు కనిపించింది.
"ఎంతైంది చీర?"

"చెప్పుకో." విజయగర్వంతో అన్నాడు. మామూలు ధరకాదు. దాన్ని నూటఎనభై రూపాయలు పెట్టి కొన్నాడు.

"బిన్నీ చీరె - దగ్గర దగ్గరగా రెండొందలు."

"కరెక్ట్."

"నిజమేనా?"

"ఏం అంత అనుమానం?"

"అనుమానం కాదు. అంత ధర పెట్టేటప్పుడు ఒక్కమాట ముందుగా నాకు చెప్పకూడదూ?"

మహీధర్ నోట మాట రాలేదు. విస్తుపోయి చూస్తూ ఉండిపోయాడు. అంతా ఆమెకు సర్‌ప్రైజ్ అని, తన మొదటి కానుకగా, తన ప్రేమచిహ్నంగా ఆమెకివ్వాలనుకుని ఇంత రహస్యంగా, గుట్టుగా కొనితెస్తే - గ్రహించదేం! ఆనందమంతా ఒక్కసారి చల్లారిపోయినట్టయింది.

"ఏమైందిప్పుడు? వాళ్ళేమైనా మోసం చేశారంటావా?"

"అదేంలేదులెండి. ఇవి కంట్రోల్ రేట్స్."

"మరైతే ఎందు కలా అన్నావు?"

"ఈ చీర సంగతులు మీ మగాళ్ళ కేంతెలుసు? కంటికి నచ్చినవి కొంటారు. అంతే!"

"నీకు నచ్చలేదా?" విసుగ్గా అడిగాడు.

"నచ్చింది కానీ, - ఈ రంగు, ఈ డిజైనూ పాతబడిపోయాయి."

"అంటే నీ కిష్టంలేదనేగా?"

"అబ్బ - ఇష్టంలేదని అన్లేదు. ఈ రంగులో నాకు రెండు చీర లున్నయి. మీకు అవి బాగా జ్ఞాపకమే. వేరే రంగులో కొత్త డిజైన్ అయితే బాగుండేదని. రెండొందలుపెట్టి కొనదల్చుకున్నప్పుడు నన్ను కూడా వెంట తీసుకుపోతే బావుండేది."

"సరేలే. మార్చి తెస్తాను. ఏ రంగు కావాలి?" విసురుగా చీర అందుకున్నాడు.

ప్రతిమ నవ్వింది.

"అంత కోపంతో వెళ్ళి కొంటే మంచి చీర కుదరదు. దీనికంటే అన్యాయమైంది పట్టుకురాగలరు, పోనీలెండి. అన్నయ్యా! నువ్వూ కొన్నావా?"

"ఆ....ఇదీ అదీ ఒకటే."

"పోనీలే - రత్నంకు నచ్చవచ్చు. అలాంటిది వదినెకి లేదు కదా?"

"ఏమో గుర్తులేదు."

ప్రతిమ విద్యుల్లతలా కంపించిపోతూ విరగబడి నవ్వింది.

"ఐతే మీరిద్దరూ ఎందుకెళ్ళినట్లు? మా చీరల రంగులు గుర్తు లేకపోతే మీరు వెళ్ళి చీరలు కొనటం దండుగే. రోజూ ఈ వంగపండు రంగు చీరలే వరుసగా కట్టేసరి, మొఖంమొత్తి తిక్క కుదుర్తుంది."

"ఇవిగో పుస్తకాలు." మహీధర్ వెంకటేశ్‌కు పుస్తకా లందించాడు.

బ్రతుకు జీవుడా అని వాటినందుకుని గుడ్‌నైట్ చెప్పి ఇంటి ముఖం పట్టాడు వెంకటేశ్.

దారిపొడుగునా ఒకటే ఆలోచన. ప్రతిమ ప్రవర్తన సమర్థించ లేకపోయాడు. ఆ చీర ఏ పరిస్థితుల్లో తెచ్చాడు? ఎందుకు ఆమెను కూడా తీసుకెళ్ళలేకపోయాడు? అతడి ఉద్దేశం ఏమిటి? ఈ చీర భార్యకు అందించగోరిన అనుభూతి ఏమిటి? అదీ ఆమె విద్యావతి, ఇటువంటి మృదువైన సన్నివేశాన్ని అర్థంచేసుకోగల హృదయం, ఎందు

కీవిధంగా ప్రవర్తించింది? ఆ ఉదాసీనత, ఆ తేలిక భావం, ఆ అసంతృప్తి, ఆ కళ్ళలో ఏ భావం స్ఫురించని వెలితి అతని హృదయాన్నే బలంగా తాకి నిరాశ కల్గిస్తే, ఇక మహీధర్ హృదయం ఎంతగా గాయపడి ఉంటుందో!

కాని, తమ తప్పు కొట్టవచ్చినట్టు కనిపిస్తూంది. ప్రతిమమీద నేరారోపణ చేసినప్పటికీ ఏదో భావం వేలెత్తి తనను, మహీధర్‌ను చూపుతూంది. ఎంత తప్పుకోవాలన్నా విఫలుడౌతున్నాడు.

ఏదో నెపంతో - మాటల సందర్భంలో ఆమెకు ఎలాంటి చీరపైన మనసో కనుక్కోవాల్సింది. అప్ టు డేట్ ఫ్యాషన్ చీర లేమోస్తున్నాయో తెలుసుకోవాలి. అది కొంటే ఆమెకు సంతృప్తిగా ఉండేది. అంతవరకు చీరలు బేరంజేసి ఎరుగని పిచ్చివాళ్లు ఒక్కసారి వెళ్లి ఏదో కొనబోయి ఇలాంటి ముప్పు తెచ్చిపెట్టుకున్నారు.

ఏమోలే - తనుగూడ రత్నం ఇవ్వబోయే మంగళహారతులకు సిద్ధపడిపోవాలి. అంత షాక్ ఉండదు. అసలు ప్రెజంటేషన్ వస్తువు ధర అడక్కూడదు.

"ఎంత?" అంటే దాని విలువ పోయింది. రెండొందలది ఇరవై రూపాయల వస్తువుగా తేలికై పోతుంది. ఖరీదు అడక్కూడదు. చూస్తే తెలియదూ! ఎంత అని అడగాలా! ప్రతిమమీద కోపం వచ్చింది. పోనీలే - రత్నందగ్గర తనంత నిరుత్సాహ పడడిప్పుడు.

వెళ్ళి తలుపు తట్టాడు.

తలుపుతీసి అతడి చేతులో ప్యాకెట్ అందుకుంది. అది తన కోసం అని అనుకోలేదు రత్నం.

"చూపించటానికి తెచ్చారా?" అంటూ పాకెట్ విప్పింది.

తమాషా చెయ్యాలని "ఆ" అన్నాడు.

విద్యుద్దీపకాంతిలో ఆ చీర రంగు మెరుస్తోంది. అంచు ధగధగ లాడిపోతోంది. మెత్తగా, సుకుమారంగా ఉన్న ఆ చీరను వ్రేళ్ళతో రాస్తూంటే ఆ ముదర రంగుమీద జారుతోన్న ఆమె సుకుమారమైన వ్రేళ్ళు ఎంతో అందంగా కనిపించాయి. ఆమె ముఖంలోకి చూశాడు.

ఏ భావం ద్యోతకం కాలేదు. మరికొన్ని క్షణాలకు తనే అంది: "చాలా బావుంది. కాని....ప్రతిమకి ఇల్లాంటి చీరలున్నట్లు నాకు జ్ఞాపకం."

అమ్మయ్య - పోనీ - అనుకున్నాడు. ఈ ఆడవాళ్ళకు వేరేవాళ్ళ చీరలు ఎంత బాగా జ్ఞాపకం!

ఎంత? అని రత్నం అడగలేదు.

మెల్లగా చెప్పేశాడు, అది తనకోసమేనని.

రత్నం నమ్మలేను అన్నట్లు చూసింది. "నాకా? ఎందుకండీ! అంతా ఒట్టిదే."

"ఏం - కొనలే ననుకున్నావా?"

"అదికాదు, తమాషాచేస్తున్నారేమో అంటున్నాను."

"ఇది నీకోసం కొన్న చీర. మొదట తమాషాకు ప్రతిమ దన్నాను." చీరను మడత కొద్దిగా విప్పి మృదువుగా చేత్తో రాస్తూంటే,- అనిర్వచనీయమైన ఆనందం ఆ ముఖంలో ప్రతిఫలిస్తుంటే, ఆ సరి గంచులోని తళుకుతో పోటీ పడుతూన్న కళ్ళలోని కాంతిని చూస్తూ తన్మయు డయ్యాడు.

"నీకు నచ్చిందిగా!"

"మంచివారే. నచ్చక పోవటమేం? చాలా బావుంది!" అంటూ ఆ చీరెను అలా మీద వేసుకుంది.

"అబ్బ ....! ఆ సరిగంచుతో నా హృదయాన్ని కలవరపెట్టి బాధ పెట్టకు. ఆకలేస్తోంది" అంటూనే ఆమె చేతి నందుకోబోయాడు. కానీ ఆమె చీరె భర్తమీద పడేసి పరుగుదీసింది. మెత్తగా, పట్టుచీర మీద జారుతుంటే చల్లని జల్లు కురుస్తున్నట్టు గులాబిపూ రేకుల తలంబ్రాలు పడ్తున్నట్టు ఏదో కమనీయ భావనలో ముగ్ధు డయ్యాడు.

చీరెను మడతపెట్టి, మెల్లగా లోపలి కెళ్లాడు. ప్రతిమ చేష్టలకు, తన భార్య చర్యలకు ఎంత తేడా ఉంది!

"రేపు నన్ను ప్రతిమ వాళ్ళింట్లో వదిలి వెళ్ళండి. కొన్ని పచ్చళ్లు తయారు చేసిపెట్టాను. మధ్యాహ్నాని కింటికొస్తాను."

"ఒక్కత్తివే రాగలవా?"

"చూద్దాం. మంచి రిక్షావాణ్ణి చూసి ఎక్కించ మంటాను ప్రతిమను."

"పోనీ, రేపు సాయంత్రం ఇద్దరం వెళ్దాం."

"వద్దు లెండి. తినటాని కేదేదో తయారు చేస్తానంటుంది."

మరుసటి రోజు రత్నాన్ని ప్రతిమ ఇంట్లో విడిచివెళ్ళి పోయాడు వెంకటేశ్.

మగవాళ్లిద్దరూ వెళ్లాక అడిగింది: "ఏం వంట చేశావు?"

"అన్నం, నెయ్యి, పెరుగు, ఆవకాయ, కందిపొడి," అంటూ ఫకాల్న ప్రతిమ నవ్వితే రత్నంగూడ శ్రుతి గల్పింది.

"అమ్మయ్యో - ఎన్ని రకాల వంటలు!" అని రత్నం ముక్కుమీద వ్రేలేసుకుంది. "ఇంకొన్ని వంటకాలు నేను తెచ్చాను. చింతకాయపచ్చడి, నిమ్మకాయ" - మళ్ళీ నవ్వు కున్నారు. ఇద్దరూ కబుర్లు చెప్పుకున్నారు.

రత్నం చీరెలమాట ఎత్తింది.

"ఎలా ఉంది చీరె?"

"బాగానే ఉంది."

"బాగానే అంటున్నావు!" 'నే' వత్తి పల్కింది.

"అలాంటి రంగుల్లో చీరెలు నేను కట్టాను. వేరే రంగైతే బావుండే దనిపించింది. అది కాస్తా బైటికి పొక్కాను. మీ అన్నయ్యకు కోపం వచ్చేసింది. నీకూ అలాంటిదే తెచ్చారుగా. పోనీలే నీకైనా...."

మధ్యలో ఆమెమాట తుంచివేస్తూ, "నాకూ నచ్చలేదు" అంది రత్నం తాపీగా.

"అయ్యో - అదేం!" అంది ఎంతో విస్తుపోతూ.

"నాకా రంగు అంటేనే ఇష్టంలేదు. ఆ రంగు అంటేనే వెగటనిపిస్తుంది. గుంటూరు నేత చీరల్లో అలాంటి రంగులో మా అమ్మ చీర తెప్పించు కొంటే - ఆవిడ కట్టుకున్నా నాకు నచ్చేదికాదు. కడుపులో దేవినట్లయ్యేది."

రత్నం ఆ విధంగా విపులీకరిస్తూంటే విస్తుపోయి వింటూ కూచుంది ప్రతిమ. కొన్ని క్షణాలవరకు ఏం మాట్లాడాలో స్ఫురించక తలొంచుకుని కొంగుతో ముఖం తుడుచుకుంది. ఆమెలోని కలవరపాటు రత్నం గ్రహించలేక పోయింది.

రత్నను వదిలి వెళ్లకముందు రహస్యంగా తనతో వెంకటేశ్ అన్న మాటలు చెవుల్లో గింగురు మంటున్నాయి. ఆ మాటలనే టప్పుడు అతని ముఖంలో కదలాడిన సంతృప్తి, ఆనందం తన కళ్లలో మెదుల్తోంది. విజయ గర్వంతో శోభించిన ఆ నేత్ర ద్వయంలోని వెలుగు తను మర్చిపోలేదు.

రత్నం ఇంత చాక చక్యంగా భర్తను నమ్మించ గల్గిందా! తనకు ఆ రంగు ఇష్టమే - రత్నంకు ఆ రంగంటే ఎంత ఏవగింపు? ఐనా భర్త సంతృప్తి కోసం అలా మౌనం దాల్చింది. ఎంతో కౌశలంతో నటించి, అతణ్ణి మోసగించింది! పాపం, అన్నయ్యా వట్టి అమాయకుడు, తన ఛాయిస్‌ని ఆమె మెచ్చిందని పొంగి పోయాడు. భర్త అంత ఇష్టపడి తెచ్చిన కానుకను ఆనందంగా అంగీకరించగల విశాల హృదయం ఆమె కుంది. రత్నం ఎదుట తను ఓడిపోయి నట్టే. తనూ గంభీరంగా తెచ్చికోలు ఆనందాన్ని కనపర్చి ఉంటే బావుండేదేమో! మరోమాటు ఇల్లాంటి పనిజేస్తే! ఒక సారి - అందులోనూ ప్రథమ పర్యాయం వాళ్ళ పరిధులు వాళ్ళకి చూపాలి. లేకపోతే అస్తమానం తను ఆనందాన్ని నటించ వలసే వస్తుంది. తనకు చేతకాదు. ఆ ప్రవర్తన రత్నానికే నప్పింది. తను ఎన్నటికి 'డూ-డూ బసవన్న' కాలేదు.

"ఏమిటి? ఆలోచిస్తున్నావు?"

త్రుళ్ళిపడింది ప్రతిమ.

"ఏమీలేదు - ఏదోగావుంది," అంటూ తప్పుకుంది.

ఆ తర్వాత పుస్తకాల ప్రసక్తి వచ్చింది.

"నేనుకూడ ఇంటింటా గ్రంథాలయం ప్రణాళికలో జేరాను. నిన్ననే డబ్బు కట్టాను," అంది ప్రతిమ.

రత్నం అంది: "ఔను పత్రికలలో- ప్రకటనలు చూస్తున్నాగాని, వాని వివరాలు తెలీలేదు. ఏమిటో చదవలేదు."

"అసలు రత్నం - మనదేశంలో మంచి పుస్తకాలు చదవాలనే ఆసక్తి చాల తక్కువ."

"అదేమిటి - ఇన్ని పుస్తకాలు - ఇన్ని పత్రికలు - ఇన్ని ప్రచురణసంస్థలు ఉంటే, ఆ ఆసక్తి తక్కువంటావు?" ఎంత విడ్డూరమైన మాట అంటున్నావు? — అన్నట్లు ధ్వనించింది

మందస్మితవదనంతో రత్నం చేయిమీద చేయివేసింది ప్రతిమ.

"మనదేశంలో హిందీ తర్వాత తెలుగు మాట్లాడేవాళ్ళదే ఎక్కువ సంఖ్య. కాని, మన పత్రికల సంఖ్య తక్కువే. అంతేకాదు, కేవలం దినపత్రికలు, మేగజీన్లూ చదివి నేనూ చదువుతానని భుజా లెగరేసుకుంటాం మనం. కాని, మంచి పుస్తకాలు కొని చదవాలన్న కుతూహలం మనకు లేదు. ముఖ్యంగా, డబ్బుపెట్టి పుస్తకాలు కొని చదివేకంటే గప్‌చిప్‌గా ఊరుకోవటం నయం అని, అదొకవిధమైన పొదుపు అని మన ఆలోచన. చిన్నతనంనించీ ఈ పై పుస్తకాలు చదివే అలవాటు మనకు అలవడలేదు. కారణం_ బాలసాహిత్యం మనకు చాలా తక్కువ. ఇప్పుడిప్పుడే కొన్ని పుస్తకా లొస్తున్నయి. వయసుకు తగిన పుస్తకాలు మనకు లేవు. అందువల్ల ఎదిగే వయసులో, నవలలు, డిటెక్టివ్‌లు చదివితే పెద్దవాళ్ళు కోపగిస్తారు. అయినా, పిల్లలు వాటిని దొంగతనంగా చదువుతారు. ఆ విధమైన ఆసక్తి చివరికి మిగిలిపోతుంది. పెద్దయినతర్వాత నెలవారీ ఖర్చుల్లో పుస్తకాల కింత అని కేటాయించం. పుస్తకాలు అరువు తెచ్చుకుని చదవటంకూడ మనకు అలవాటు లేదు. ఇలా పుస్తకాలు తీసుకెళ్లేవాళ్ళనుగూర్చి రేడియోలో, వనితాలోకంలో, ప్రమదావనంలో పదేపదే చెపుతూంటారు. లైబ్రరీ లున్నాయి. మనం కోరిన పుస్తకం అక్కడ దొరుకుతుంది. కాని, తెచ్చిపెట్టేవాళ్లు కావద్దూ? ఇన్ని ఇబ్బంది లుండబట్టి, పుస్తకాలు కొనటం శుద్ధ దండుగ అన్న ఆలోచన మనలో బలంగా నాటుకున్నందువల్లా మనకు పఠనాసక్తి లేదు. పాశ్చాత్యదేశాలలో తక్కువ

ధరలకు పుస్తకాలు అందరికీ అందుబాటులో ఉండేలా చేస్తారు. పుస్త కాల ప్రతులు లక్షలలో అచ్చువేస్తారు. మనకు రెండువేలు వేస్తే మూడేళ్ళకుగానీ అమ్ముడు పోవు. అందుకని మనదేశంలోకూడ తక్కువ ధరలో పుస్తకాలు అచ్చువేసి అందజేస్తున్నారు. ఈ ఇంటింటా గ్రంథాలయం ప్రణాళికలో మనం కట్టే డబ్బుకంటే ఎక్కువ ఖరీదు గల పుస్తకాలు మన కందుతాయి. డబ్బు కట్టగానే ఇంటి కొస్తాయి పుస్తకాలు. అదొక లాభం మనకు. వీళ్ళే తక్కువ ధరలో - పాకెట్ బుక్స్ అంటారు - వాటిని వేయబోతున్నారు. నిన్ననే డబ్బు కట్టాను. నెలనెలా తప్పక డబ్బు పంపాలి."

ఇంత విన్నతర్వాత రత్నానికి తనుగూడ ఆ ప్రణాళికలో చేరా లనిపించింది. తనకీ పుస్తకాలు చదవాలన్న కోర్కె ఇప్పుడిప్పుడే కల్గుతూంది.

"నేనుకూడ కడ్తాను."

"కట్టుగానీ - ఇద్దరం వేరువేరు పుస్తకాలు తెప్పించుకుందాం. అది ఇద్దరికీ లాభం."

ఎండ ఎక్కేకొలది ప్రతిమకు మగత హెచ్చింది. అలా వెళ్లి పడుకుంది. రత్నం ఇంగ్లీషు మేగజీన్లలో బొమ్మలు చూస్తూ కూచుంది. ఆ తర్వాత చదవనికథలుంటే పత్రిక తీసుకుంది. ఇంతలో మధ్యాహ్న మైంది.

తను ఇంటికెళ్లాలి. రిక్షా మాట్లాడింది ప్రతిమ. ఇల్లు చేరేదాకా గుబులు గుబులు మంది. అదీ ఇదీ చూసుకునేసరికి వెంకటేశ్ వచ్చేశాడు.

భార్య ఐదు రూపాయలు ఇంటింటా గ్రంథాలయంవారికి పంప మంటే వెంకటేశ్ నమ్మలేకపోయాడు. మనిషి చంద్రమండలంలో కాలుమోపాడన్న వార్త అందించినా నమ్మేసేవాడే- ఏ అనుమానా ల్లేకుండా. తన భార్యారత్నం ఇలాంటి కోర్కె కోరుతుందని తా నెన్నడు ఊహించలేకపోయాడు.

రత్నాన్నిగూర్చిన అంచనా తను తప్పుగా వేసుకున్నాడేమో!

ఆమెలో నిగూఢంగా ఉన్న కోర్కెలను సరైన మార్గంలో వ్యక్తం చేయలేక ఇన్నాళ్ళు ఆగిందేమో! తను ఆవేశంలో ఆమె చదువుకో లేదని విసుక్కొని, బాధపడి, అశాంతికి లోనయ్యాడేమో!

ఆమె కోర్కె అతనికి ప్రమోదం కల్గించింది. జాగుచేస్తే మనసు మార్చేసుకుంటుందేమోనని అదేరోజున యం.ఓ. పంపిం చాడు. ప్రశంసించటానికి, విమర్శించటానికి టైంలేదు!

# 18

ఆ సాయం సంధ్యా కాంతిలో పిల్ల గాలులకు తల లూపుతున్న బంతి పువ్వుల్ని చూస్తూ కూచుంది ప్రతిమ. ఆ చల్లగాలిలో విలీన మైన తెలిమంచు చెక్కిళ్ళను తాకి చక్కిలి గింతలు పెడుతూంది. భర్త రాక కోసం నిరీక్షిస్తూ కూచుంది.

అప్పటికి వారం రోజులైంది. ప్రతిమను చూసి పోదామని వెంకటేశ్ కూడా వచ్చాడు.

"ప్రతిమా - కులాసా?" అంటూ పలుకరించాడు.

ఆమె "ఆ" అంటూ సన్నగా నవ్వింది. ఆ మనోజ్ఞమైన చిరు నవ్వుచూసి తన్మయు డయ్యాడు మహీధర్.

"ఇదిగో సామాను. లిస్ట్ ప్రకారం తెచ్చాము."

సంచులు గదిలో పెట్టి వచ్చారు. సర్దుకోటానికి ప్రతిమ వెళ్ళింది. కాని పుస్తకం పెన్సిల్ పట్టుకొచ్చి కూచుంది.

"ఆ. తేవటంకాదు. ఆ ఖరీదులన్నీ చెప్పండి."

మహీధర్ విసుక్కున్నాడు. "నీతో ఇదేగోల. టీ నీళ్ళయినా ఇవ్వవు. లెక్కా డొక్కా కావాలి నీకు. ఏ దెంతైతేనేం! అన్నీ సరుకోక."

"ఆ పాటి మర్యాద తెలుసులెండి. ఇద్దరూ తోడు తోడుగా వెళ్ళారు కదా - హోటల్ ముఖం చూడకుండా వస్తారా!"

"చూశామే అనుకో - రెండోసారి పుచ్చుకోకండా ఉంటాని కదేం విషంకాదే! ఏం రా - వెంకటేశ్?"

"ఔననుకో - కాని ప్రతిమను మళ్లీ తొందర పెట్టటం దేనికి?"

"తొందరే ముం దన్నయ్యా? చిటికెలో తెస్తాను."

ఆమె నలాపోనిచ్చి గార్డెన్ చెయిర్‌లో కూల బడ్డాడు.

"అబ్బ. నాకు తాగాలని లేదు."

"మరెందు కంత ..."

"ష్ .... అదోవంక. వెళ్ళి పోయిందిగా! కాసేపు హాయిగా కూచో వచ్చు. అదుగో లిస్ట్. ఖరీదులు తెచ్చిన కొలతలు చెప్పమం టుంది. దేని ధర ఎక్కిందె - ఏది తగ్గింది చూస్తుంది. అప్పటికి 'దలాల్ స్ట్రీట్' తన అజమాయిషీలో సాగుతున్నట్టు! తెమ్మంది - తెచ్చాను. ఆ వివరా లెందుకు? ఎవడికి జ్ఞాపకం! అయ్యో - ఈ ఏల కులు చచ్చువి అంటుంది - అది పుచ్చుదీ వాపసివ్వ మంటుంది. దాన్లో దూరిచూసి తెచ్చానా? అందుకే టీ కావాలన్నా. ఆ తర్వాత ఏ తలనొప్పో అంటాను."

వెంకటేశ్‌కు అందులో తప్పేం కన్పించ లేదు. ఎందుకు అంత విసుగు? - అనుకున్నాడు.

ప్రతిమ అన్నట్లే చిటికెలో టీ తెచ్చింది.

"చాలా బాగుం దమ్మా. ఈ సువాసన!" వెంకటేశ్ చప్ప రిస్తూ అన్నాడు.

"క్రోకో టీ అంటారు. అమ్మ పంపింది," అంటూ పుస్తకం అందుకుంది, "ఈనెల ధరలె లావున్నాయో?"

"ఏం - మారుస్తావా?"

"మీదంతా చోద్యం. తెలుసు కుంటే తప్పా?"

"తెలుసుకోక పోతేయేం?"

"వాడుకగా తెచ్చే దుకాణం ప్రతిమా - ధరల్లో మార్పుం డదు." వెంకటేశ్ అన్నాడు.

"అదే నేను చెప్పేది. ధరల్లో మార్పుండదు గానీ- వాడు మన వాళ్ళేగదా అని ఎక్కువ వేసేస్తాడు -"

వెంకటేశ్ నోరు బంద్ అయింది.

"నిన్న అమ్మ దగ్గర కెళ్లాను. అప్పుడే బజారునించి వెచ్చాలు తెప్పించింది. రాసుకున్నాను. వీడెంత మోసం చేశాడో తెల్సుకో వచ్చు. చెప్పండి."

నే ఓడిపోయాను - అన్నట్లు ముఖంపెట్టి ఒక్కొక్కటే చెప్తున్నాడు. ప్రతిమ రాసుకుంది.

అంతా అయ్యాక నిస్సత్తువగా నీరసాన్ని చుట్ట బెట్టుకుని కాళ్లు చేరగిల వేసి కూర్చున్నాడు మహీధర్.

"చూశారా? ప్రతివస్తువు మీద పది - పదిహేను పైసలెక్కువ వేశాడు. కంట్రోలుధరల మీదగూడ పెచ్చు వేశాడు. ఈ ప్రకారం మనకు మొత్తం ఐదురూపాయల చిల్లర నష్టం."

"ఐతే నీ అభిప్రాయం ఒక వస్తువు కొనకముందు పది దుకాణాలు తిరిగి ధరలెలా ఉన్నాయో కనుక్కోమంటావా?"

"అదేం అక్కర్లేదు. కాస్త బుర్రచేత పనిచేయించి మాట్లాడితే అవే తెలుస్తాయి. క్రితంసారి ధరలు గుర్తుంచుకుంటే ...."

"చాలు చాలు - ఈ సారినించి నువ్వేవెళ్ళి తెచ్చుకో."

"ఏదైన చెప్తేచాలు ఈ అస్త్రం ప్రయోగిస్తారు." అంటూ చివాలున లేచి వెళ్ళింది.

మహీధర్ నవ్వాడు. ఎంతో హాయిగా విజయ గర్వంతో నవ్వాడు.

"నువ్వు కూడ ఈ అస్త్రాన్ని దాచుకుని ఉండు. వీలైనప్పుడల్లా ప్రయోగించు."

"ఆ అవసరం నాకు లేదు, మహీధర్!" అన్నాడు తనుగూడా నవ్వుతూ.

మహీధర్ చటుక్కున నవ్వటం ఆపుజేశాడు. గంభీర వదనంతో సూటిగా స్నేహితుడి వైపు చూస్తూ ఎంతో సీరియస్‌గా అన్నాడు: "నువ్వెంత అదృష్టవంతుడివిరా!"

"నీ అదృష్టానికి మాత్రం ఏం లోటు వచ్చింది?"

"నా అదృష్టానికేమీ లోటు లేదు....కాని వెంకటేశ్.... ఒక్కటి మాత్రం నిజం. కొన్ని విషయాల్లో మనకు స్వేచ్ఛ ఉండాలిరా....వాటి మీద విమర్శలుగాని, ప్రశ్నలుగాని ఉండకూడదు."

దాని అర్థం వెంటనే అవగతం కాలేదు. వెంకటేశ్‌కి.

ప్రతిమకు చెప్పి వెళ్లిపోయాడు.

దారిపొడుగునా ఆలోచనలు సముద్రతరంగాల్లా ఒకదాని తర్వాత ఒకటి తరుముకు వస్తున్నాయి.

తను వెచ్చాలుతెస్తే రత్నం ఏమీ అడగదు. ఫలానా వస్తు వెంత అని అడగదు. ఇక బాగా లేదని అసలే నోరు విప్పి అనదు. ఆ రోజు తనకు బాగా జ్ఞాపకం. ప్రక్కింటి ప్లీడరుగారి భార్య- పెరటి గోడ అవతల నుంచుని అడుగుతూంది:

"నాగరత్నం—నువ్వులనూనె ధర పెరిగిందట. నిన్న మీ ఆయన ఎలా తెచ్చారేమిటి?"

"నాకు తెలీదండీ!"

"ఏమిటమ్మా- అడగవూ?"

"లేదండి, నేను అడగను. ఆయన చెప్పరు."

"తెలుసుకుంటే మంచిది కదమ్మా!"

"ఏమోనండి, అవన్నీ నా కెందుకు?"

"అలా అంటావేమిటే? మరి డబ్బు సర్దుకోవటం...."

"అబ్బే! డబ్బు వాడటం అన్నీ ఆయనే చూసుకుంటారు. గుమ్మంలోకొచ్చిన పువ్వులు మాత్రం నా చేత్తో కొంటాను."

"సరేనమ్మా, నీ పద్ధతి నీది."

ఆ సంభాషణ విన్న వెంకటేశ్ హృదయం అసంతృప్తితో నిండిపోయింది. ఏదో కలవరపాటు.

"నిజమే. రత్నం ఏమీ పట్టించుకోదు. ధరలు తెలిస్తే కదా ఎప్పుడు ఏ వస్తువు పొదుపు చేయాలో తెలిసేది!

తనకు ఉల్లిపాయల పులుసు ఇష్టం. కాని, మొన్న రూపాయకి కిలో తెచ్చాడు. తాము ఇద్దరే కాబట్టి పొదుపు చేసినా కనబడదు. కాని, ముస్ముందు? జీతాలు సరిపోతాయా? నూనెల ధర కూడ

విపరీతంగా పెరిగిపోయింది. రెండు నెలలుగా మరో కిలో ఎక్కువ తెమ్మంటూంది. తెచ్చాడు. అంటే మరో ఎనిమిది రూపాయ లెక్కువన్న మాట. ఇరవై నాల్గు రూపాయలు నూనెకే అవుతుందని తెలుసా?

ఒకరోజు పనికట్టుకుని ఆమెకు ఖరీదులన్నీ చెప్పబోయాడు - కానీ రత్నం నవ్వింది. "నాకా లెక్కలు పత్రా లెందుకండీ?" అంటూ వెళ్ళిపోయింది.

ఏమిటి ఈ మనిషి? ఈమెకి వ్యక్తిత్వం అంటూ లేదా? యంత్రంలా అన్నీ చేసుకుపోతుంది. క్రొత్త విషయాలు తెలుసుకోవాలని గాని, నూతన పరిసరాలకు, పరిస్థితులకీ అనుగుణంగా మసలు కోవాలనిగాని జ్ఞానం లేదా? తను ఏది చేస్తే, తను ఏది తెస్తే దాన్ని హృదయ పూర్వకంగా అంగీకరించటమేనా? అన్నిటికి తలొగ్గి సాగి పోవటమేనా - అందులోనే ఆమె కానందం ఉందా?

అతని హృదయంలో ఏదో వెలితి చోటు చేసుకున్నది. రెండు మూడు రోజులవరకు అతడు రత్నం సాధారణ ధోరణిని గూర్చి ఆలోచిస్తూ గడిపాడు.

ఈ నాడు ప్రతిమ - మహీధర్‌ల మధ్య సంఘటన. వాళ్ళిద్దరు ఘర్షణ పడ్తుంటే ఎటూ తేల్చుకో లేకపోయాడు. కాని పురుష హృదయం మహీధర్‌నే సమర్థించింది. అంటే! ఒక్క ఊపున అతడి హృదయం చలించి పోయింది. అంటే, రత్నం ప్రవర్తనను పరోక్షంగా అంగీకరించా దన్నమాట.

ఆమె మౌనంగా ఉండటాన్ని అతడి హృదయం హర్షిస్తూం దన్నమాట! ఒకవేళ రత్నం ప్రతిమలా తయారైతే మహీధర్‌లా అంత యుక్తితో తను తప్పించుకో గలడు! ఓహో - ఇలా తయారయావా? అని ఆమెను కించపర్చి ఆమె హృదయాన్ని గాయపర్చ గలడు.

హొయలు చిందిస్తూ చన్నీటి తుంపర నెగ జిమ్ముతూ గల గల పారే కొండయేరు ప్రతిమ. హుందాగా, నిండుగా నియమిత మార్గాన ప్రవహించే నది లాంటిది రత్నం.

ఆ రెంటికి పోలిక ఒక్కటే - వాటికి ప్రాణం నీరు.

వీ రిద్దరికీ పోలిక ఒక్కటే - ఇద్దరూ సజీవులు - స్త్రీలు.

# 19

వెన్నెల రేయి వెన్నెల లొలికిస్తూ నవ్వింది ప్రతిమ. అలిగిన భర్త అలుక తీర్చటానికి ఏం చెయ్యాలా అని ఆలోచించింది. లాలనగా భర్త చుబుకాన్ని బట్టి త్రిప్పింది. ఆ చుబుకం కదల్లేదు.

"అబ్బ - ప్రతిమా!" అంటూ విసుక్కున్నాడు.

"నా పేరు ప్రతిమ - కానీ నాలో చైతన్యం - ఓ ప్రవంతిలా పారుతూంటే ఈ 'ప్రతిమ' ఉందే ఇది పాలరాతి ప్రతిమకన్నా అధ్వాన్నం. కఠినశిల." అంటూ బుంగమూతి పెట్టింది. చుట్టుకున్న ఎఱ్ఱ గులాబి రేకుల్లా ఉన్న ఆ పెదిమల్లోని లాలిత్యాన్ని - ఆ ఎఱ్ఱదనంలో విలీనమవుతున్న శీత కిరణాల్లోని మనోజ్ఞతనుచూస్తూ "ఆ - ఓడి పోయాన్లే -" అంటూ మౌన వ్రతాన్ని భంగం చేశాడు.

"మీకు చెప్పటం మర్చిపోయాను. ఓ విషయంగూర్చి చెప్పాలి మీకు. రత్నం పదినెకి చీర నచ్చిందనీ, అ మాత్రం తెలివి నాకు లేక పోయిందనీ చెప్పారే! అసలు ఆమెకి ఆ చీర ఎంత మాత్రం నచ్చలేదు."

"ఏమిటీ! నీతో చెప్పిందా?"

"ఆ- అసలు నచ్చకపోవటం కాదు. ఆ రంగంటేనే తనకి అసహ్యమట. పాపం- ఎంతో నిల్రదొక్కుకుని నచ్చినట్లు నటించింది. కట్టుకుంటుందనుకోండి. ఎల్లా ఉంటుంది? మీకిష్టంలేని డ్రస్ వేసుకో మంటే ఒకరి తృప్తికోసంమీరు వేసుకున్నా మీహృదయంలో అసం తృప్తి, కోపమే మిగుల్తాయి. పైపెచ్చు ఎప్పుడెప్పుడు దీన్ని తీసి పారేద్దామా అన్నంత అసహ్యమూ వేస్తుంది. మా చిన్నతనంలో మా తమ్ముడు ప్యాంట్ వేసుకోవాలనేవాడు. నాన్నగారు నిక్కర్లే కుట్టించే

వారు. ఇప్పుడప్పుడే నీకు పాంట్ కుట్టించను అనేవారు. పుట్టినరోజున పండుగ రోజునకూడ నిక్కర్లే వాడికి గతి. పాపం, అవే వేసుకుని తిరిగే వాడుగాని ఏదో వెలితి - తెచ్చికోలు ఆనందం ప్రదర్శించేవాడు. పైకి ఏమీ అనలేక సరదాగా ఉన్నట్టు నటించేవాడు. చివరికి ఫిఫ్త్‌ఫార్మ్‌లో ఉండగా అమ్మ దగ్గర గోలచేశాడు. అమ్మ నాన్నని ఎలాగో ఒప్పించి కుట్టించింది.... మరి మీరు తెచ్చిన చీరకట్టుకుని అంతర్యంలో అలా ఫీలవుతూ బాహ్యంగా ఎంతో ఆనందాన్ని నటించటం నాకు చేతకాదు. అలా నటించానే అనుకోండి. మీకు నచ్చుతుందా- దాన్ని అంగీకరించ గలరా?"

మహీధర్ నిశ్చేష్టుడై చూస్తూ కూచున్నాడు.

ఆ ప్రశ్నకు జవాబు అంత సులభంకాదు. ప్రతిమను అటువంటి పాత్రగా ఊహించాడు. ఆమె ముఖంలో ప్రతిఫలిస్తూన్న ఆనందం పరిపూర్ణత చెందినట్లులేదు. ఎంతో బావుంది- అని మెచ్చుకుంటున్న మాటలు హృదయంలోంచి రావటంలేదు. పెదాలనించి పొడి పొడిగా జారిపడుతున్నాయి. అబ్బ - తాను అది భరించలేడు.

"ఉహూ- నువ్వు నీ మనసులో మాట చెప్పావు. అదే నాక్కా- వలసింది."

ప్రతిమ ముఖం తేజోమయమయింది. తెల్లాగులాబీ పువ్వులా వికసించిం దామె ముఖం. వారి మధ్యనున్న అడ్డుగోడ పడిపోయి నట్లయింది. తాము పరస్పరం అర్థంచేసుకున్నారు- అదిచాలు.

"రత్నకు నిజం చెప్పటానికి ధైర్యంలేదు. వాళ్ళిద్దరూ ఆ విధ మైన జీవితంలోనే ఆనందం పొందుతారు. ఆమె యథార్థంచెబితే అంగీకరించలేని మనసు వెంకటేశ్‌ది. అందుకని ఈ రహస్యం మన ముగ్గురిమధ్యనే ఉండిపోనీ. వెంకటేశ్‌కు చెప్పకు."

నిజమేననుకుంది ప్రతిమ. ముగ్ధ మోహనమైన చల్లనిరేయి. వెన్నెలలో మెరిసిపోతున్న ఆమె కళ్ళల్లోకి తరచి తరచి చూశాడు మహీధర్. ఆ వెలుగు తనను ఏ మనోజ్ఞ లోకాల్లోకో లాక్కువెళుతున్నట్లు భావించాడు. ఆ కళ్ళలో నిక్షిప్తమైన ఆనందం అతడి హృదయంలో అంతులేని ఆనందాన్ని నింపింది.

# 20

సంక్రాంతి వచ్చింది.

రకరకాల పువ్వులు- పంచ రంగుల పూలు కులుకుతున్నాయి. ముద్దబంతి పువ్వులు అరుణభానుని కాంతిలో వింత వెలుగు లీనుతూ ఎంతో రమణీయంగా ఉన్నాయి.

వీధులనిండా ముగ్గులు. అది వీధికాదేమో అన్నట్లు అందంగా ఉన్నాయి. ఆ ముత్యాల ముగ్గులలో గొబ్బెమ్మలు. సందడిగా హడా విడిగా తిరిగే యువతులు. అంతవరకు శ్రమించిన పశువులు విశ్రాంతి తీసుకుంటున్నాయి. వాటి మెడలలోని మువ్వలు సన్నటి శబ్దం చేస్తున్నాయి. గోధూళి వేళ అంటే ఏమిటో తెలియని కాలం అది.

వెంకటేశ్ - రత్నం పల్లె కెళ్లారు.

రత్నం పుట్టింట చిన్నపిల్లే అయిపోయింది. ఆమె ఆనందం క్రొత్తమెరుగులు దిద్దుకుంది.

కాని, ప్రతిమ - మహీధర్‌లు వెళ్లి చూడటానికి ఎవ్వరూ లేరు. అమ్మ నాన్న అదే ఊళ్ళో ఉండబట్టి - వారిని తరచు చూస్తున్న కారణంగా అక్కడి కెళ్ళినా మార్పు లేనట్లే ఉంది.

"ప్రతిమా! మా అమ్మను నాన్నను చూసి వస్తాను. వాళ్ళ ధోరణి ఎల్లా ఉందో చూసి, నిన్నూ తీసుకెళ్తాను," అన్నా డొక రోజున.

ఆలోచన సబబుగానే ఉన్నట్టు తోచింది. ప్రతిమను వాళ్ళ పుట్టింట్లో విడిచి తానొక్కడే రాజమండ్రి వెళ్లాడు.

పండుగ హడావిడిలో ఇల్లంతా సందడిగా ఉంది.

"మామయ్యొచ్చారు" అంటూ పిల్లలు కేకలేశారు. తల్లి తండ్రి

అక్కలు, బావలు- అందరు ఇవతలి కొచ్చారు. బండి దిగుతున్న మహీ ధర్‌ను చూసి వాళ్ళ హృదయాలు ఆనందంతో నిండిపోయాయి. మరు క్షణంలో ఆ అమ్మాయి ఏదీ? అనుకున్నారు, ఎవరికి వాళ్ళే.

తల్లి - తండ్రి మాత్రం రాకపోవడమే మంచిదైంది అను కున్నారు. దగ్గర కూచోబెట్టుకుని ఎన్నో ప్రశ్నలు వేశారు. ఒక్క రైన మాట వరసకయినా ప్రతిమను తీసుకు రాలేదేం? అని అడగలేక పోయారు. తన తెగింపును మర్చిపోయి, మన్నించి, తనను సాద రంగా ఆహ్వానించి, ప్రతిమను తీసుకురాలేదేం? - అని అడుగుతారనీ, అప్పుడు ఇంకోసారి తీసుకెళ్ళవచ్చనీ అనుకున్నాడు. ముఖ్యంగా ప్రతిమ గర్భవతి అన్న చల్లని కబురు వాళ్ళకి చెప్పాలనుకున్నాడు. తల్లి ఎంతగానో ఆనందిస్తుం దనుకున్నాడు. కాని, వాటిలో ఒక్కటీ జరగలేదు. ఏదో దిగులు, నిరాశ, నీరసం చుట్టుకున్నాయి. టైం చూసుకున్నాడు. సరిగ్గా తను వచ్చి రెండుగంట లయింది. కాఫీ విషంలా అనిపించింది. టిఫిన్ మింగుడు పడలేదు.

"వెళ్లొస్తాను" అని లేచాడు.

తల్లి నిర్ఘాంత పోయింది. తండ్రి గంభీరంగా ఉండిపోయాడు.

"అదేమిట్రా? భోజనమైనా చెయ్యకుండా వెడతానంటున్నావు! ఎక్కడికి?"

"ఎక్కడికేమిటి? ఇంటికి - గుంటూరు."

"పోనీ, రెండు రోజు లుండి వెళ్ళకూడదూ?"

"మిమ్మల్ని చూడాలని వచ్చాను. చూశాను. వచ్చిన పనైంది." ఈ పరిసరాల్లో ఉండలేను అన్నట్లు చూశాడు.

"నీ ఇష్టం. ఇది నీ ఇల్లు. నిన్ను రమ్మనలేదు. కనుక పొమ్మన టాని కాధారాల్లేవు. కాని, నువ్వు అప్పుడప్పుడు వచ్చి వెళ్ళటాని కభ్యంతరం లేదు. యథేచ్ఛగా రావచ్చు, పోవచ్చు." తండ్రి కంఠం కొద్దిగా కంపించింది.

ఔను. తను ఒంటరిగానే వచ్చి చూసి వెళ్లాలి. అంటే- ప్రతిమకు ఆ ఇంట్లో స్థానం లేదు. ఛీ - అనుకున్నాడు. పళ్లూ, మిఠాయిల బుట్టను పిల్లలు అప్పుడే ఖాళీ చేశారు. అందరికి పేరు పేరున వెళ్లొస్తానని

చెప్పాడు. ఏంమాట్లాడాలన్నా సంకోచమే. తల్లి తండ్రి మౌనముద్ర వహించి నుంచున్నారు.

"మీరు నన్ను దూరం చేసుకున్నా నా బాధ్యతల్ని నేను మర్చిపో లేదు," అంటూ తల్లి చేతిలో ఓ కవరు పెట్టి విసవిసా నడిచి వెళ్ళి పోయాడు.

తండ్రి హుందాగా నడిచి గదిలోకి వెళ్ళినా - అక్కడ అతడి హృదయం అనిర్వచనీయమైన బాధతో విలవిల్లాడి పోయింది.

కన్నీరు తుడుచుకుంటూ భార్య గదిలోకి వచ్చింది.

"ఆరు వందల రూపాయ లిచ్చి వెళ్లాడు." ఆమె కంఠం రుద్ధ మైంది.

"వా డల్లా ఎందుకెళ్ళాడో తెలుసా?" మెల్లగా అడిగాడు. అతని కంఠం జీరపోయింది.

"ఆఁ." అంటూ ఆమె పొర్లివచ్చే దుఃఖాన్నాపుకుంటూ కళ్ళు తుడుచుకుంది. అంతకంటే ఏమి చేయటానికి శక్తి లేదు కనుక.

"అలా తెగ తెంపులు చేసుకుని వెళ్లాడాడుగాని, ఈ మమతా బంధాలను త్రెంపుకుపోలేకపోయాడు. పోనీండి - అప్పుడప్పుడు వచ్చి నా కళ్ళబడ్తే అదే చాలు."

"అంతే - అంతే - కాలేజికి వెళ్లాడనుకుందాం. సెలవలకి వచ్చి వెళ్తూంటాడు."

ఆ విధంగా భ్రమపడటం అసంభవమే అని వారికి తెలుసు. అలా అనుకోటం తమను తాము మోసపుచ్చుకోవటమే అవుతుంది. ఈ ఆత్మవంచన వారిని మరీ క్రుంగదీస్తూంది.

అవతల బోలెడు పనులున్నాయి. డబ్బు అల్మారాలో పడేసి బరు వెక్కిన హృదయంతో ఆమె బైటికి నడిచింది. ఎంత ప్రయత్నించినా ఆమె ఆలోచనలు కొడుకునించి విడివడి రాలేకపోతున్నాయి. మనసు తెరిపిపడక కొట్టుమిట్టాడుతూ యాంత్రికంగా, ఇంట్లో పనులు చేసుకు పోతూంది. అంతకన్నా ఏమిచేయటానికి అశక్తురాలు కనుక - కోడల్ని గూర్చి ఎన్నో విషయాలు తెలుసుకోవాలన్న కోర్కెల ఉచ్చుల్లోంచి

బైటబడేసరికి కొడుకు వచ్చి ఆ ఉచ్చులను మరికాస్త బలంగా వేసి వెళ్ళిపోయాడు. క్షుభిత హృదయంతో భర్త ముఖంలోకి చూడలేక ఎవరూ చూడకుండా కళ్ళు తుడుచుకుంటూ తన పనుల్లో నిమగ్నమైంది ఆమె.

# 21

మహీధర్ రిక్షా దిగుతుంటే భ్రమానుపడి చూస్తోంది ప్రతిమ. ప్రక్కన ఉన్న తల్లి నుద్దేశించి మెల్లగా అంది: "అమ్మా, అప్పుడే వచ్చేశారు - దాని అర్థం?" ఆమె భర్త కెదురెళ్ళింది. పల్చటి హాస రేఖ ఆమె పెదిమలపై తారట్లాడింది.

"మీరు త్వరగా వచ్చేశారు. నా మనసు కుదుట బడింది."

సుచిత్రాదేవి గబగబ బైటికొచ్చింది. కూతురు అన్న మాటల అంతరార్థం గ్రహించి అందుకుంది. "నిన్నంతా కడుపులో మంట అంటూ ఒకటే గోల. అది మామూలే అమ్మా అంటే వినదు. మీ కోసం ఎదురుచూస్తూ కూచుంది. రండి .... అక్కడ అంతా కులాసాగా ఉన్నారా?"

పొడి పొడిగా ఏదో సమాధానం చెప్పి ప్రతిమతోపాటు గదిలో కెళ్ళాడు మహీధర్. ఆమె లోపలికెళ్ళింది. భర్త ఏకాంతంగా దొరక గాన్నే అతణ్ణి అల్లేసుకుంది ప్రతిమ. "మీరు త్వరగా వచ్చేశారు. నాకెంతో హాయిగా ఉంది."

ఆమె తలను ఆప్యాయంగా నిమిరాడు. "నన్నుగూర్చి తాపత్రయ పడ్డారు. నా బాగోగులు చూశారు. కాని, నీ విషయం ఎవ్వరూ ప్రస్తావించ లేదు. వాళ్ళకు నా మీద కోపం పోలేదు ప్రతిమా! అందుకని అక్కడ - నీకు స్థానంలేదని గ్రహించి, వెంటనే వచ్చేశాను."

ప్రతిమ నవ్వింది. ఆ నవ్వు పన్నీటిజల్లులా, చల్లచల్లగా కురిసే

తుషారబిందువుల్లా నవచైతన్యాన్ని జాలువారుస్తూ అతడి బాధకు ఉప శమనం కల్గించింది.

"ఐతే - వాళ్లు ఈ కొద్దికాలంలోనే అన్నీ మర్చిపోయి. మిమ్మల్ని క్షమిస్తారనుకున్నారా? మీ పిచ్చి - పోనీలెద్దురు - మీకు నేను - నాకు మీరు ఉన్నారు. చాలదూ?" అంది అతని కళ్ళలోకి ఆరాధనా పూర్వకంగా చూస్తూ.

ఆ కళ్ళలోని అనురాగపు లోతుల్నిచూసి ప్రపంచాన్నే మర్చి పోయాడు మహీధర్.

సంక్రాంతి పండుగ రోజులన్నీ ఆనందంగా గడిచిపోయాయి. ప్రతిమ - మహీధర్ వారం రోజులు రావుగారింట్లో గడిపి ఇంటి కొచ్చారు.

ఆ వేళ బోలెడు పోస్ట్ వచ్చింది. ఎన్నో ఉత్తరాలు - ఉత్తరా లతోపాటు శుభాకాంక్షలు తెలియజేస్తూ పంపిన గ్రీటింగ్ కార్డులు ఎన్నో అందాయి.

అందులో ఒక్క ఉత్తరం ప్రతిమ కెంతో ఆనందాన్ని కల్గిం చింది.

పెద్ద మామయ్య కొడుకు - అంటే కర్నల్ మిశ్రా కొడుకు. మెడ్రాస్‌లో ఒకమ్మాయిని చూడటానికి వెళ్తున్నాట్ట. ఆమె ఎం.ఎస్.సి. చేసి న్యూట్రిషన్‌లో రిసెర్చి చేస్తోందిట ఇజ్జత్‌నగరులో. పెళ్లిచూపులు మెడ్రాస్‌లో నట. వెళ్ళేటప్పుడు గాని, వచ్చేటప్పుడు గాని ఇటు దిగి వెళ్తాట్ట. అమర్‌నాథ్ రాసిన ఉత్తరం సాంతం చదివి భర్త కందించింది.

"మన ఇంటికి ఫస్ట్ గెస్ట్ అన్న మాట. చిన్న పార్టీ చేద్దాం. అతని గౌరవార్థం. అన్నట్లు పెద్ద కర్నల్ కొడుకు. తల్లి జర్మన్ లేడీ. మహా గీరగా ఉంటాడేమో!"

"ఏమో.. ఎప్పుడో ఒక్కసారే చూశాను. బహుశః మన పెళ్ళి మీ పెద్దల అంగీకారంతో జరగలేదని నేనంటే మామయ్యకు అత్తయ్యకు అమర్‌కు, శాంతికి, కాంతికి కూడ అదోహలాంటి జాలి. వాళ్ళు అమ్మకు ఎప్పుడు రాసినా నన్నుగూర్చి ఎన్నో విషయాలు రాయమంటుంటారు."

వారం రోజుల్లో ఎప్పుడో ఒక రోజు రావచ్చు. అమ్మ దగ్గర దిగుతాడో- తమ ఇంట్లోనే దిగుతాడో తెలీలేదు. ఇంట్లో ఏ వస్తువు గూడ కొరత లేకుండా అన్నీ తెప్పించింది.

నాల్గు రోజులు తలిదండ్రులతో అత్త మామలతో సరదాగా గడిపి వచ్చారు వెంకటేశ్ రత్నంలు.

ఇంటి నించి తెచ్చిన పిండి వంటలను ప్లాస్టిక్ బాగ్‌లో సర్ది ప్రతిమకు పంపించింది రత్నం. ఆ సాయంత్రం సుచిత్రాదేవి గారింటి కెళ్ళి ఆ దంపతుల ఆశీర్వాదా లందుకుని వచ్చారు.

రెండు రోజులు గడిచిపోయాయి.

సాయంత్రం ప్రతిమ కుందనపు బొమ్మలా తయారై భర్త కోసం నిరీక్షిస్తోంది. గుమ్మంలో కారాగితే- ఆ శబ్దం సుపరిచితంగా తోచి, గబగబ బైటి కెళ్ళింది.

నాన్నగారు, అమర్, మరో స్త్రీ కారు దిగారు.

"అరె! ఎప్పుడొచ్చారు? ఏమిటి కథ!" అంది ఓరగా నూతన వధువు చిహ్నాలతో అమర్‌ను అనుకుని నుంచున్న ఆ నూతన వ్యక్తి కేసి చూస్తూ. ఆమె చిరునవ్వు చిందించింది. ఆ చిరునవ్వులోని స్వర్గరామణీయకాన్ని చూసి అమర్ కూడ చిరునవ్వు నవ్వుతూ ఆమె చేతినందుకుని ప్రతిమ చేతిలో వుంచుతూ అన్నాడు: "పది గంటలకు దిగాము. బాగా అలసిపోయాము."

"ఔను. బాగా అలసిపోయి వుంటారు. పెళ్ళి చూపులకు వెళ్ళి ఏకంగా పెళ్ళే ముగించు కొచ్చావు. రండి!" అంటూ లోపలికి దారి తీసింది.

"మీ ఆయనేడమ్మా, ఇంకా రాలేదా?" అన్నారు రావుగారు.

"లేదు నాన్నా!" అంటూ అందరినీ సుఖాసీనులను చేసింది. సంభాషణ ఆంగ్లంలో నడుస్తోంది.

"పెళ్ళిచూపులకని వెళ్ళాను, నేను ఆమెని ఇంటర్వ్యూ చేస్తే- ఆమె నన్ను ఇంటర్వ్యూ చేసింది."

"తిక్క కుదిరింది. అక్కయ్యా - బాగాజేశావు." అంటూ ప్రతిమ కిలకిల నవ్వింది.

"నన్నేమడి గిందో తెలుసా?"

"ఏం? యుద్ధంజేసి చూపమందా?" ఆశ్చర్యానంతా పొందు పర్చిం దా ముఖంలో.

అమర్, అనూరాధ, రావుగారుకూడ పకపక నవ్వారు.

"ఆ విధంగా అడినట్లయితే - మరి యుద్ధం చేయటానికి ప్రతి పక్షం అంటూ ఒకటుండాలి కదా! నువ్వేఉందు అనేవాడిని."

"పోనీలే - అక్కయ్య ఒళ్ళంతా సరిగానే ఉంది .... ఆ .... ఏ మడిగిం దేమిటి?"

"పెళ్ళికి ఒప్పుకుంటే - ఆ పెళ్ళిపెద్ద హంగామాతో జరగాలా? అని. రెండోది - తను తనవి అనదగ్గ వస్తువులతోతప్ప పెద్ద దహేజ్ ఏమీ తేనంది."

"ఆ .... " అంటూ ప్రతిమ తన చూపుడు వ్రేలును అందంగా ముక్కుమీద వేసుకుంది.

అంతలోకి మహీధర్ రావటంతో, పరిచయాలు అవీ పూర్తి అయ్యాయి. మహీధర్ ముఖం కడుక్కొచ్చి కూర్చున్నాడు.

ప్రతిమ ఫ్రిజిడీర్‌లో ఉంచిన పళ్లూ, ఫలహారాలు సాసర్లల్లో సర్దుతూంటే అనూరాధ అందరికీ అందించింది. మంచినీళ్లుతెచ్చి పెట్టింది.

"మీరు చాల మిస్ చేశారు," అంది ప్రతిమ సంభాషణ పునః ప్రారంభిస్తూ - భర్తతో.

టూకీగా అంతా చెప్పింది - "ఆ .... అమర్! ఇక కంటిన్యూ చెయ్యి" అంది ఓ జీడిపప్పు నోట్లోవేసుకుని.

అంతలోనే వెంకటేశ్, రత్నం వచ్చారు. మరోసారి పరిచయా లయ్యాయి.

"ఈ వేళ త్వరగా ఇంటి కొచ్చానమ్మా, మీ వదినె ప్రతిమను చూసి చాల రోజులైందంటే తీసుకొచ్చాను."

రెండోసారి సంగతి సందర్భాలు చెప్పింది.

ఆంగ్లంలో సంభాషణ పునః ప్రారంభించారు.

అమర్ చటుక్కున ఆగి "బహెన్‌కు అంగ్రేజీ ....?"

"రాదు." రావుగా రన్నారు.

"తో హిందీమే ...."

"రాదు. మనం చెబుదాంలే" అన్నారు రావుగారు.

ఆ రెండు జవాబులు "రాదు" - "రాదు" - ములుకుల్లా గ్రుచు కున్నాయి వెంకటేశ్ హృదయంలో.

"అమూల్యమైన దహేజ్‌తోనే వస్తున్నావు. నా కింకేమీ అక్కర్లేదన్నాను." అన్నాడు అమర్.

"ఏమిటో -" అనుకుంటూనే ఎవరికివారే ప్రాజ్ఞులైనట్లు వికసించిన ముఖాలతో సర్దుకున్నారు.

"ఔను - తనకుతానే వచ్చేస్తూంటే ఇక నీకేం కావాలి?"

"వెంటనే అంగీకరించి రిజిస్టర్ మేరేజి చేసుకున్నారా?" ఆసక్తితో అడిగింది ప్రతిమ.

"వెంటనే కాదు. ఒక రోజంతా తీరికగా మాట్లాడుకున్నాము. మేము పెరిగిన వాతావరణాలు వేరు. మనదంతా ఓ విధమైన కాస్మాపాలిటన్ జీవితం. మన కుటుంబంలోనే ఇన్నిరకాలవాళ్ళ మున్నాము. మా అమ్మకు ఎటువంటి స్త్రీ కావాలో నాకుతెలుసు. అంతే కాదు- నాకు మా అమ్మలాంటి గుణం గలది భార్య కావాలని ఉండేది. అది సైకలాజికల్‌గా సహజమే - ఏమంటారు అంకుల్? వీళ్ళకుటుంబంలో ముగ్గురు విద్యాధికులు. ఒకరు ఎం. ఏ. మేథమేటిక్స్. అక్కడే - మద్రాస్‌లో లెక్చరర్‌గా ఉంటున్నారు. రాధ చెల్లెలు లిటరేచర్ ఆనర్స్ చేస్తోంది. రాధ యం. యస్‌సి. అయింది. రిసెర్చ్ చేస్తూంది-ట్రేస్ ఎలిమెంట్స్ మీద. వీళ్ళందరికి ఉన్నత విద్య నభ్యసింప జేసింది వీళ్ళతల్లిగారు. అంటే మామగారు లేరన్నమాట. ఇటువంటి పరిస్థితుల్లో మేమనుసరించిన మార్గమే సబబుగా తోచింది. వాళ్ళమ్మగారు టీచర్‌గా పని చేస్తున్నారు. సరేననిపించుకుని వెళ్లి పెళ్ళి చేసుకున్నాను. పెళ్ళయినటు యింటికి వైర్ ఇచ్చాను. వాళ్లూ కంగ్రాచులేషన్స్ - బ్లెసింగ్స్ వైర్ చేశారు."

"పోనీలే. అత్తయ్యరక్తం కాస్త ఒంట బట్టింది. వాళ్లలా పెళ్లిచేసుకుని వైర్ పంపావు."

రాధ అంతవరకు మౌనం దాల్చిం దల్లా భర్త అంతటితో ఆపు జేయటంతో నిరుత్సాహపడింది.

"అంతే కాదు. మా చెల్లికింకా రెండు సంవత్సరాల చదువు ఉంది. ఒక సంవత్సరం అన్నయ్య చదివిస్తే మరోసంవత్సరం మేము చదివిస్తామని అమ్మకు మాట ఇచ్చారు."

"ఓ!" అంటూ అర్థవంతంగా తల ఊపారు.

వెంకటేశ్‌కు అంతా ఏదో వింతగా ఉంది. ఇంతకీ రాధ ఎవరు? పిల్ల- పిల్లాడు ఉంటే ఇక పెళ్ళికి ఏమీ ఆటంకాలు పెట్టని సంఘం ఒకటుందా? ఉంటే, అది సురలోకమే అవుతుంది. అందరు అమర్ లాంటి వాళ్ళయితే ఆడపిల్లల వివాహం అనేది ఒక సమస్యే కాదు.

"నేను- రాధ ఒక్క విషయంలో సరి సమానులం."

"ఏమిటో?" ప్రతిమ అడిగింది.

"ఇద్దరం ఉత్తర ప్రదేశ్ వాళ్ళం. వీళ్ళ నాన్నగారు వ్యాపార రీత్యా వచ్చి మెద్రాస్‌లో స్థిరపడి పోయారుట. పదేళ్ళ క్రితం పోయారు. ఆమె చదువుకున్నారు కాబట్టి పని చేసి పిల్లల్ని చదివించారు."

"మీరు చాల అదృష్టవంతులు. నాన్నగారు లేనిలోటు తీర్చి మిమ్మల్ని ఇంత వారినిగ జేశారు. ఆమె ఆత్మ స్థయిర్యం ఎన్న దగింది," అంటూ రావుగారు మెచ్చుకున్నారు.

రాధ కళ్ళలో లీలామాత్రంగా కన్నీటి చారలు స్పష్ట మయ్యాయి.

"మీరు అంత దూరం వెళ్లి పని చేస్తున్నా రెందుకు?" మహీధర్ అడిగాడు.

"మొదటి నించీ నాకు రిసెర్చ్ చేయాలనే అభిలాష ఉండేది. ఇజ్జత్ నగర్‌లో ఇంటర్వ్యూలో సెలెక్ట్ అయ్యాను. అది నా అదృష్టమే. ఉద్యోగాలు దొరకని కాలంలో నాకు అతి సులభంగా ఉద్యోగం దొరికింది. ట్రేస్ ఎలిమెంట్స్ మీద వర్క్ చేస్తున్నాను."

ఆమె అనర్గళంగా, చక్కని ఉచ్చారణతో ఆంగ్లంలో మాట్లాడుతుంటే విన సొంపుగా ఉంది.

తన పనిని గూర్చిన వివరా లందిస్తూంటే ఆమె ముఖంలో ప్రతిఫలిస్తున్న ఆనందం- ఎదుటివారు తను చెప్తున్న విషయాల్ని

గ్రహించటానికి తగిన శక్తి గలవారని, దానిపై శ్రద్ధ వహించి వింటున్నారని తెలుసుకున్నప్పుడు ఆమె హృదయం సంతృప్తితో నిండిపోయింది.

"....మన దేహానికి కొన్ని ఎలిమెంట్స్ అత్యవసరం. ఇనుము, మెగ్నీషియం, రాగి లాంటివి. అవి సూక్ష్మమైన పరిమాణాల్లో ఉండాలి. అవి లోపిస్తే వచ్చే జబ్బులు, లేక అవి లోపించిన కారణంగా దేహంలో కల్గే మార్పులూ కనుక్కోవాలన్న మాట........" ఆమె చెప్తుంటే రావుగారు దీక్షగా వింటూ తల ఊపుతూ కూచున్నారు.

ఆమె మాటలు అందర్నీ ఆకట్టుకున్నవి.

"బేటీ - మరి పెళ్ళయింది కదా! నీ రిసెర్చిమాటేమిటి?" అడగవలసినప్రశ్న అడిగేశారు రావుగారు.

ఏం జవాబు వస్తుందోనని కుతూహలంగా ముందుకువంగి ఎదురు చూస్తున్నారు.

రాధ భర్తవైపు అనురాగపూరిత దృక్కులు పరిచింది.

"ఈ పెళ్ళి నా ఆదర్శాన్ని అణగార్చివేయదు. ప్రస్తుతం నేను ఉన్నచోటనే ఉంటాను. వారికి దగ్గరే," అంది.

అందరూ చూపులు మార్చుకున్నారు.

"అత్తయ్య ఏమంటుందో!" తనసంశయాన్ని వెలిబుచ్చింది ప్రతిమ.

"అమ్మ ఉబ్బొంగిపోతుంది ........" కాసేపు ఆగి అమర్ పకపక నవ్వాడు. "మీరంతా ఒక విషయం గ్రహించ లేదు- మీకు తోచ లేదు. మేము ఉత్తరసరిహద్దు ప్రాంతాలలో 'ఙెరైన్'లో రోడ్డువేసే కొద్ది దానివెంట పోతుంటాము. నా వెంట రాధ రాలేదు. అదీ సంగతి."

"గుడ్ - అటు నీకు ఆమెను తీసుకెళ్ళటానికి వీల్లేదు. ఇటు రాధకు తన రిసెర్చి వదులుకోటానికి వీల్లేదు. బావుంది, బావుంది. రాధ అంతరాత్మ ముల్లులా గుచ్చుతూ ఉండదు- అటు నీకూ అంతే."

"అమర్! రాధ ఇక్కడుందని నీకెలా తెలుసు?"

"రాధ ఇక్కడ మెద్రాస్‌లో ఉందని నాకు తెలీదు. నా ఫ్రెండ్స్ బెర్కెలీలో ఉన్నారు. వాళ్ళు చెప్పారు. వాళ్ళమ్మగారి అడ్రస్ ఇచ్చారు. ఆమెకు రాశాను. సెలవు మీద వస్తూందని, నన్ను రమ్మని రాశా రామె. వెళ్లాను. వచ్చాము."

"అందుకే మేరేజేస్ ఆర్ మేడ్ ఇన్ హెవెన్" అన్నారు, రావు గారు ఛలోక్తిగా.

"మామయ్య ఎలా ఉన్నారు?"

"ఆయనకేం? బాగా స్వాస్థ్యం చిక్కింది. నిన్ను తలుచుకుంటూంటారు. మీ పేరెంట్స్ ఇన్‌లా ఎల్లా ఉన్నారు?"

"వాళ్ళక్కడ - మేమిక్కడ క్షేమంగానే ఉన్నాము."

"వాళ్ళింకా మనసు మార్చుకో లేదన్నమాట!"

"ఊహు. మార్చుకుంటారనికూడ అనుకోను," మహీధర్ ఖచ్చితంగా అన్నాడు.

"మా తాతగారుకూడ అలాంటి వారే కాని, మారిపోతున్నారు."

ప్రతిమ చల్లగా నవ్వింది.

"ఔనౌను. ఇరవైతొమ్మిది సంవత్సరాలు పట్టింది."

"కాలమే మారుస్తుంది. అంత పెసిమిజం పనికిరాదు." అమర్ సీరియస్‌గా అన్నాడు.

"మీ ఇంట్లో కథ అంతటితో ఆగలేదుగా! ప్రతి ఒక్కరు వారికనుగుణమైనరీతిగా జీవితాల్ని దిద్దుకుంటూ భాగస్వాముల నెన్నుకున్నారు. అంతేకాదు-మీరు తిరిగే సొసైటీ వేరు. వీటన్నింటికీ ప్రాధాన్యం ఇవ్వరు." అంది ప్రతిమ.

"ఔనేమో" అన్నట్లు తలూపాడు అమర్.

రావుగారు ముసి ముసి నవ్వులు నవ్వుతూ అన్నాడు:"గోడమీది పిల్లిలా వ్యవహరిస్తారు మామగారు. కొడుకులపైన, కోడళ్ళపైన, అల్లుళ్ళపైన వారికి మమత లేదుట! కాని, మీరంతా ఉన్నారే....అంటే

మనవళ్లు, మనవరాళ్లు - వాళ్లకోసమే మాతో సంబంధం నిలుపుకున్నట్లు వ్యవహరిస్తారు. ప్రతి పర్యాయం ఈ మాట నొక్కి చెపుతూంటారు. అదే తెలుగులో అంటారు - అసలుమీదికంటే వడ్డీమీద - పాలకంటే మీగడమీద మక్కువ ఎక్కువ అని!"

సంభాషణ ఈ విధంగా సాగుతుంటే వెంకటేశ్ పక్కవాటుగా రత్నంకేసి చూశాడు. ఆమె ఈ సంభాషణలో పాల్గొనటం లేదు సరిగదా మాట్లాడే వ్యక్తులవైపు కూడా చూడటం లేదు. ప్రక్కనే ఉన్న బుక్ రాక్‌లోంచి ఏవో మేగజీన్స్ తీసుకుని తిరగేస్తూంది. ఎంతో దీక్షగా ఆ పుస్తకాల్లోకి చూస్తూంది.

"నాల్రోజు లుంటున్నారుగా!" రాధవేపు తిరిగి అడిగింది ప్రతిమ.

"రోజులే? రేపు వెళ్లిపోతున్నాము."

"అదేం వీల్లేదు. రేపొక చిన్న పార్టీ ఏర్పాటు చేశాము."

"అప్పుడే చేసేశారా?"

"ఓ....అంతా సిద్ధం....మీ రేమీ అభ్యంతరం చెప్పటానికి వీల్లేదు." మహీధర్ నిష్కర్షగా అన్నాడు.

వధూవరు లొకరిముఖా లొకరు చూసుకున్నారు.

ఆమె ముసుగు సర్దుకుంటూ భర్తతో అంది: "ఒక్క రోజే - కాని రిజర్వేషన్ అంతా తారుమారౌతుంది. ఆ పైన ప్రయాణం అంతా కష్టం."

"ఔను - ఆ సంగతి మర్చేపోయాను." అమర్ వీలుపడదన్నట్లు చూశాడు.

ప్రతిమ ఒప్పుకోలేదు. అమర్, రాధలు అంగీకరించక తప్ప లేదు.

ఆ నాటికి అంతా సెలవు తీసుకుని ఎవరిళ్ళకు వారు బయలు దేరారు. రావుగారు వెంకటేశ్‌ను, రత్నంని వారింట్లో విడిచి వెళ్ళి పోయారు.

# 22

రత్నం ఎంతో కులాసాగా మాట్లాడుతూంది. వెంకటేశ్ భార్యను పరీక్షగా చూశాడు. ఆమెలో ఏ విధమైన వికారభావం కనిపించలేదు. ఆ రెండు గంటలసేపు మూగ బొమ్మలా కూచుని వచ్చినందుకు ఏ విధమైన అసంతృప్తిగాని, కోపంగాని, విసుగుగాని లేదు. తనను అలా ఇరకాటంలో పడేసినందుకు భర్తమీద విరుచుకు పడలేదు. పరిస్థితులను - తటస్థపడే సంఘటనలను సమ్యక్ దృష్టితో చూడగల ఈమె వ్యక్తిత్వం ఏమిటి! ఆమె హృదయాంతరాళంలోకి తను ఎన్నటికీ చూడలేదేమో! అవగాహన చేసుకునే జ్ఞానం తనలో లోపించింది. కానీ - ఆ రోజు తనకు సంతృప్తికరంగా లేదు. భార్యలోని లోటుపాట్లు వాళ్ళంతా వ్రేలెత్తి చూపినట్లయింది. తెలుగుతప్ప ఏ భాషా రాదు - పదిమందిలో తిరగటాని కర్హత లేదు; కూపస్థ మండూకం లాంటి జీవితమే ఆమెకు సరి! కానీ, తను ఆమెను మార్చటానికి ప్రయత్నించాడు - ప్రయత్నిస్తున్నాడు. రేపు పార్టీలో దృష్టిబొమ్మలా.... అంతరాత్మ విరగబడి నవ్వింది. ఆ విసురుకు వెంకటేశ్ చలించిపోయాడు.

'ఏమిటోయ్ పిచ్చిపుల్లయ్య, ఇంగ్లీష చదువు రావాలా! షోగ్గా పది మండిలో తిరిగితేనే సభ్యత అనుకున్నావా? నీ సరదాలకు ఆమె ఆటంకంగా నిలబడటం లేదే! గుంభనంగా, ముచ్చటగా, కూచుంటుంది. రేపు పార్టీకి తీసుకెళ్ళ కూడదనే అనుకుంటున్నావా? చిన్న పిల్లలా ఎంత సరదా పడిపోతూందో చూడు. ఆమెకు ఏం తక్కువైంది? ఆమె ఉత్సాహాన్ని, ఉప్పొంగి పోతూన్న ఆనందాన్ని సమూలంగా ధ్వంసం చేసి ఏం ఒడిగట్టుకుంటావు? సుతిమెత్తనైన ఆమె హృదయాన్ని గాయపరిచి ఏం సాధిస్తావు?.... పోనీ, తీసుకెళ్లవే

అనుకుందాం; అక్కడ జంటలు జంటలుగా తిరుగుతున్న దంపతులు చూసి నువ్వు బాధపడవూ? ఆనందమంతా అసంపూర్తిగానే మిగిలి పోదూ?'

భోజనానికి పిలుపు వచ్చేసరికి, ఆ అంతరాత్మ ఘోష అప్పటికి మానింది.

దీర్ఘాలోచనలో మునిగిపోయి మెల్లగా లోపలి కెళ్లాడు. అతని పరధ్యానాన్ని పారద్రోలుతున్నట్టు గాజుల గలగలలు, సన్నజాజులు వెదజల్లుతూన్న పరిమళాలు, స్నిగ్ధ మందహాసంతో లీలామాత్రంగా సంచలించే పెదిమల్లోని వంపులు - రాగరంజిత కపోలకాంతులు ప్రకాశిస్తూ అతన్ని వాస్తవంలోకి లాక్కువచ్చాయి. అన్నం కలుపుకోవటం ఆపుజేసి తదేకంగా తనవేపుచూస్తూన్న భర్త చూపుల్లో చూపు కలిపి, మృదువుగా నవ్వింది.

"అలా చూస్తారేం? క్రొత్తగా ఉన్నానా?"

"ఊఁ....రోజుకి రకం కొత్తదనాన్ని పుంజుకుంటున్నావు. రా ...ఇద్దరం కూచుని భోంచేద్దాం"

ఆమె కూడా వడ్డించుకుంది. ఇద్దరూ భోంచేస్తుంటే అక్కడ జరిగిన సంభాషణనంతా వివరంగా రత్నానికి చెప్పాడు.

"ఇల్లాంటివి కథల్లో కలిపిస్తారనుకున్నాను. నిజంగానే జరుగుతాయా?....ఇంద్రజాలంలో చూసినట్లుంది. ఆయన వెళ్లటం- మాట్లాడటం, ఒకరి సమస్యలొకరికి చెప్పుకుని రాజీపడటం, పెళ్ళి చేసుకురావటం, చాల తమాషాగా లేదూ! వాళ్ళమ్మగారికి నయాపైసా ఖర్చు లేదన్న మాట! మనం చూస్తున్న పెళ్ళిళ్ళకూ దీనికీ ఎంత తేడా!" అంది. ఓ మహత్తరసత్యం గోచరించిన దానిలా ఆమె ముఖం దీప్తిమంత మయింది.

"అమర్‌గారిలాంటి వారే అందరు మగాళ్ళూ అయితే ఆడ పిల్లల గన్న తలిదండ్రులు ఏ చీకూ, చింతా లేకుండా ఉండొచ్చు. చివరికి సొంత బావైన మీరు కూడా మావాళ్ళ దగ్గిర అమాంబాపతు ఆరువేల దాకా గుంజారు."

వెంకటేశ్‌కి ఉడుకుమోత్తనం హెచ్చింది. "పోనిలే

నేనిమ్మన్నానా? మీ నాన్న ఇస్తే పుచ్చుకున్నాను. నిన్ను తీసుకోలా మారు మాట్లాడకుండా...."

"—ఝూమ్మని" అంటూ కిలకిల నవ్వింది.

దాంతో వెంకటేశ్ కూడ నవ్వేశాడు

ఏమిటో ఈమె మనస్తత్వం! ఏమీ తెలియని అమాయికురాలి లానే మసల్తూ- నోట్లో వేలు పెడ్తే గూడా కొరకటం చేతకానంత అర్భకురాలుగా వుంటూ- ఒక్క విసురు విసిరింది. వడిసెలలో రాయి సూటిగా- తిన్నగా వచ్చి తనకు బాగానే తగిలింది.

ఇవన్నీ మనసులో సుళ్ళు తిరుగుతూంటే కొత్తగా పౌరుషం ఎక్కుపెట్టింది.

"నువ్వు చదుకున్న చదువుకు ఆరు వేలు తీసుకున్నా. నువ్వు కూడ ఆ రాధలా, ప్రతిమలా చదువుకుని ఉన్నట్లయితే చక్కగా నయా పైసా ఖర్చు లేకుండా పెళ్ళాడేవాణ్ణి."

"ఔనౌను- అప్పటికి రేటు కూడ పెంచేవారే!" అని నవ్వుతూ లేచిపోయి చెయ్యి కడుక్కుంది.

వెంకటేశ్ కళ్ళు నిప్పులు కురిశాయి. ఏదో అనబోయాడు. రత్నం కిలకిల నవ్వుతూ వచ్చి ఆ చేత్తోనే భర్త నోరు మూసింది.

"కోపంతో మాట్లాడకండి. ఇవ్వాళ నా కెంతో సంతోషంగా ఉంది. వాళ్ళ పెళ్ళి ముచ్చట, అదే నాకెంతో ఆనందాన్నిచ్చింది. ఇలాంటి పెళ్ళిళ్ళు, ఇంత హృదయ వైశాల్యంతో వారు ఒకరి నొకరు అర్థం చేసుకుని ప్రవర్తించిన పద్ధతీ చూస్తే- అసలు జరుగుతాయా అన్న అనుమానం పటాపంచలై పోయింది. వాళ్ళిద్దర్నీ మళ్ళీ మళ్ళీ చూడా లనిపిస్తోంది. మీరంతా మాట్లాడుకుంటుంటే ఒక్క ముక్క గూడ బోధపడక నా పాటికి నేనేదో పుస్తకం చూస్తూ కూచున్నా. వాళ్ళిద్దర్నీ రేపు, ఈ దృష్టితో చూస్తే మనసు సంతృప్తితో నిండి పోతుంది."

అంతసేపూ ఆమె చేయి అతని నోటి మీదనే ఉంచింది. ఆఖరి పదం అని, చేయి తీసేసింది.

"ఐతే రత్నం! మా ముచ్చట్లు నీకు అర్థమైతే బావుండేది.

ఆ సంభాషణలో పాల్గొనాలని నీకు అనిపించలేదా ?" ఆశగా ఆమె కళ్ళలోకి చూశాడు.

రత్నం మెల్లిగా నిట్టూర్చింది. అంతలోనే ముఖాన్ని ఆవరించిన చీకటి నీడలు తొలగిపోయి ప్రశాంతమయింది.

"అప్పు డనిపించలేదు. అందని దాని కర్రలు జూచి ప్రయోజనం ఏమిటి ? పరిస్థితికి లొంగిపోవటం అలవాటు చేసుకున్నాను. అటువంటి భావన నాకెన్నడూ కలుగలేదు. భగవంతు డెవరి కెంత రాపిపెట్టాడో అంతేనని నాకు తెలుసు. నేను పుట్టిన పల్లెటూళ్ళో, పెరిగిన వాతావరణంలో నా కింతకన్నా ఏమీ అబ్బదు. అక్కను అసలు బడికే పంపలేదు. నన్ను కనీసం ఐదో క్లాసు వరకన్నా చదివించారు. అయ్యో- నేను ఇంకా ఎక్కువ చదువుకోలేదే, అది రాదే, ఇది రాదే అన్న బాధ నాకు లేదు. చినిగిపోతే ముడేసుకుని ఆ చీర కట్టుకోవటమే చూశానుగాని, పని గట్టుకుని సూది దారం తెచ్చి కుట్టుకోవటం చూడలేదు. ఇక నాకు మిషను కుట్టటం ఎలా వస్తుంది ? అందుకే వాటిని గురించి అట్టే ఆలోచించను. ఏదో- నాకు శ్రమ లేకుండా, మీ మనసుకు కష్టం కలక్కుండా, జీవితం వెళ్ళబుచ్చితే చాలు- ఏమంటారు ?"

ఈ విధమైన సంకుచిత జీవితంతోనే బ్రతగ్గల నేర్పుంది — అనుకుని, వెంకటేశ్ నిరుత్తరుడయ్యాడు.

వెంటనే నోటిమాట రాక మంచి నీళ్ళు త్రాగుతూ కాలయాపన జేశాడు.

రత్నం మాటల్లోని యదార్థత మెల్లమెల్లగా ఇంకి బుర్రలో పనిజేస్తూంది. ఆమె చెప్పేదే నిజంలా అనిపిస్తూంది. ఇంతమాత్రానికి తను మాటమాటకి మనఃక్లేశాన్ని కోరి తెచ్చుకోవటంలో అర్థంలేదు. వట్టి తెలివితక్కువతనమే అవుతుంది.

రత్నకు ఏ బాధాలేదు. ఎదుటివారు ఆమెను కించపర్చి చిన్న చూపు చూడటం లేదు. కేవలం తనే- తన మనస్సులో చెలరేగుతున్న అదో విధమైన ఆరాటాన్ని, అసంతృప్తిని అణచుకోలేక తీరని వ్యథను తెచ్చిపెట్టుకుంటున్నాడు.

"మాట్లాడరేం!" అంటూ లేచి నుంచుంది.

"అంతే - నువ్వన్న దాన్లో ఎంతేనా సత్యం ఉంది. నీతో ఏకీభవిస్తున్నాను," అన్నాడు.

"రేపు ప్రతిమ నన్ను త్వరగా రమ్మంది."

"అలాగే....మరి ఏం చీర కట్టుకుంటావు?" ఆసక్తితో అడిగాడు. అతని కంఠంలో తొణికిన లాలిత్యాన్ని గ్రహించి, విస్ఫారిత నేత్రాలతో క్షణం అతడి కళ్లలోకి చూసింది.

"ఆ చీర- మీరు నాకు, ప్రతిమకు తెచ్చారే-అది....మీకిష్టమేనా?"

"గుడ్,ఆ చీర నువ్వు కట్టుకుంటే పదేపదే చూడాలనిపిస్తుంది."

రత్నం అతనికి వినపడకుండా, ముఖం చాటు చేసుకుని తెచ్చుకున్న దగ్గులో నిట్టూర్పుని, తన అయిష్టతనను దాచుకుంది.

పోనీలే- తన ముఖం తనకు కనబడదు. కట్టుకున్న చీర తన మీద ఎలా అమరుతుందో తనకు తెలీదు. అదీ ఒకందుకు మంచిదే అయింది అనుకుంది.

భర్త పక్కమీద వాలాక ఒకసారి అలమర తెరచి చీర బైటికి తీసింది. విద్యుద్దీప కాంతిలో వన్నెలు చిందిస్తూంది చీరె. మెల్లగా చేత్తో రాపింది.

'ఆయనకు ఈ చీర ఇష్టం. నాకూ ఇష్టమే. ఇకమీదట ఇష్టపూర్వకంగా కట్టుకుంటాను,' అనుకుంది.

# 23

మరునాడు పార్టీకి వెళ్ళారు. రత్నను కాస్త ముందుగానే పంపాడు.

ఆ చీరలో దిగుతూన్న రత్నను కళ్ళింతింతలు చేసుకుని మరీ చూసింది ప్రతిమ.

"రత్నా ...." అంటూ రెండు చేతులు భుజంమీద వేసి ఎగా దిగా చూసింది.

"ఈ చీర నీ మీద ఎంతో అందంగా ఉంది."

రత్న చిరునవ్వు నవ్వింది. ఒకసారి చీర వంక చూసుకుంది.

"ప్రతిమా! .... ఈ చీర - ఈ రంగూ అంటే నాకూ ఇష్టం పుట్టింది. ఇక ఫరవాలేదు."

"అంతేలే. వాళ్ళ కానందం కల్గించటమే మన ముఖ్యోద్దేశం."

ఇద్దరూ లోపలికి నడిచారు.

ఆ కొద్ది సేపటిలో ప్రతిమ మనసులో ఒకే ఆలోచన చొర బడింది. రత్న వ్యక్తిత్వం ఒకరి ప్రభావంలో మలచబడుతూంది. అది అంత సున్నితమైనదీ, లొంగిపోయేదీను. అంతరాంతరంలో ఈ మార్పువల్ల ఆమె కేవిధమైన బాధా ఉండదు. తన్నుతాను పరీ క్షించుకోవటానికిగాని, తనలోగల్గిన మార్పును గూర్చి న్యాయా న్యాయాలు విచారించు కోవటానికిగాని ఆమెకు తోచదు. తోచినా ప్రయ త్నించదు.

వాళ్ళిద్దరూ అన్నీ సర్దుతూ పనులు పూర్తి చేయక ముందే రాధ, సుచిత్రాదేవి, రావుగారు, అమర్ దిగారు. రాధ అలం కరణలోని ప్రత్యేకత రత్నాన్ని ఎక్కువగా ఆకర్షించింది. నూతన వధువు అనిపించేలా వస్త్రధారణ - అలంకరణఉన్నా అతిగా పోకుండా హృదయ సౌందర్యాన్ని ప్రతిఫలించే ముఖవర్చస్సులో ఆమె అప్పుడే విచ్చుకున్న పుష్పంలా భాసిస్తూంది.

ఎరుపు బెనారస్ పట్టుచీరమీద బుటాపని జేసిన చీర - అదే రంగు బ్రొకేడ్ రవికె, మంచి ముత్యాల జూకాలు, కంఠానికి బిగించి కట్టిన రెండు వరుసల ముత్యాలు, దానికున్న ముత్యాలూ - పచ్చలూ పొదిగిన పతకం, చేతులకు బంగారు మురుగులు, వాటిమధ్య ఎరుపు గాజులు మెరుస్తున్నాయి. ఆమె చేతులు కదిలిస్తూంటే విద్యుద్దీప కాంతిలో అవి స్ఫురత్ చంద్రికలు ప్రసరిస్తుంటే రత్నం ఆమెనించి కళ్లు తప్పించుకోలేక పోయింది.

రాధ వచ్చి రత్నం ప్రక్కనకూర్చుని మందహాసం చేసింది.

రత్నం అంతకన్నా ఏమి చేయలేక ప్రతిమందహాసం చేసింది.

రత్నాన్ని చూస్తూ రాధ ఏదో రిమార్క్ చేసింది.

"ఓహ్ - రత్నం! అక్కయ్య ఏమంటున్నదో తెలుసా? నువ్వట-స్వచ్ఛమైన అందానికే ప్రతిరూపంట. భగవంతుడు ఓ బొమ్మను చేసి స్వయంగా రూపురేఖలు దిద్దాడట. ఈ చీర నీకు ఎంతో బాగా నప్పిందంటూంది."

రత్నం సిగ్గుతో మొగ్గయి పోయింది.

"నాదేమిటి, నేనేమిటి ? వదినె దేవకన్యలా ఉంది!"

సుచిత్రాదేవి తర్జుమా చేసింది. అందరూ నవ్వుకుంటూ సరదాగా కబుర్లు చెప్పుకుంటున్నారు. రావలసిన వారంతా టైమ్‌కు ఒకరొకరుగా చేరుతున్నారు.

అనుకున్నట్లు ఐదు గంటలకు అందరూ వచ్చేశారు. అంత కరెక్టుగా అంతా టైమ్‌కి రావటం రత్నం కెంతో ఆశ్చర్యం కల్గించింది. దాదాపు నలభై జంటలు వచ్చారు. అందులో ఒకరిద్దరు తప్ప మిగిలిన వాళ్ళందరూ వెంకటేశ్‌ను ఎరుగున్నవాళ్లే. అందరూ "బుఫే"లా నుంచుని కబుర్లు చెప్పుకుంటూ- ఆడా మగా కలిసి గుంపులు గుంపులుగా జేరి తినటం - ఆ అనుభవమూ రత్నకు కొత్తదే. ఎందుకైనా మంచిదని సుచిత్రాదేవికి దగ్గరగా నిలబడి కొద్దికొద్దిగ తింటూ అందర్నీ గమనిస్తూంది. రత్నానికంత కష్టం అనిపించలేదు. ఎందుకంటే, చాలామందికి తెలుగు వచ్చు. అంతా తెలుగువాళ్లే - ఏ నలుగు రైదు గురో తప్ప. అందరూ రత్నం ఉనికి గుర్తించి, పలకరించారు. ఆమెకూడ సందర్భాన్నిబట్టి జవాబిచ్చింది. ఏం కొంపముంచుతుందో నని వెంకటేశ్ అప్పుడప్పుడు భార్యను గమనిస్తూనే ఉన్నాడు. ఆమె తినటం మర్చిపోయినట్లు అందర్నీ చూస్తుంటే అతడికి కోపం వచ్చేది. ఆమె ఏదో కల్పించుకుని మాట్లాడా లనుకునేవాడు. ముళ్ళ మీద నుంచున్నంత ఇబ్బంది పడిపోయాడు. రాత్రి ఎనిమిది గంటల వరకు పార్టీ సాగింది. ఆ తర్వాత ఒక్కొక్కరుగా సెలవుతీసుకుని వెళ్ళిపోయారు.

రత్నంకి అదంతా స్వాప్నిక జగత్తులా తోచింది. వచ్చినవా ళ్ళందరూ తనకుగూడ చెప్పి ఆప్యాయంగా పలుకరించి వెళ్ళారు.

సంస్కారం అంటే అల్లా ఉండాలి. ఏ నలుగు రైదుగురో మాత్రం టిక్కుటాక్కుమంటూ, అంటీ అంటనట్లు మసలి వెళ్ళిపోయారు. బహుశః చాల ధనవంతులై ఉంటారు. లేదా- ఏదీ లేకపోయినా గర్వం కావలసినంత ఉన్నవాళ్ళేమో! లేక, బాగా చదువుకున్నవాళ్ళేమో! ఏది ఏమైనా వాళ్ళ ప్రవర్తనకు రత్నం ఏమీ చిన్నబోలేదు.

వాళ్ళు తనను పలుకరిస్తే తలమీద కిరీటం పెట్టినట్లేమీ కాదు; పలుకరించకపోతే తను నష్టపడిం దేమీలేదు.

ఆ నాల్గు గంటలూ ఆనందంగా గడిపి మధురానుభూతికి లోనైన హృదయంతో - ఉల్లాసంగా - సంతృప్తితో సెలవు తీసుకుంటున్న రత్నంకేసి చూసి ఆశ్చర్యపోయాడు వెంకటేశ్. తనుకూడ అందరికీ చెప్పి రిక్షా ఎక్కాడు.

రిక్షాలో వాళ్ళిద్దరూ వెంటనే మాట్లాడుకోలేదు.

నాగరక ప్రగతి పథంలో తగిన రీతిని పయనించాలన్న కుతూహలంతో తనే తప్పటడుగు వేస్తున్నాడేమో! ఏవేవో లేనిపోని తలంపులతో భార్యను గూర్చి అసంతృప్తిపడ్తూ కోరికోరి అశాంతిని తెచ్చి పెట్టుకుంటున్నాడేమో! ఈనాడు ఎంత ఆనందంగా గడిచింది. ఆమెవల్ల తనకే విధమైన తలవంపులు కలుగలేదే! తన భయసంశయాలకు, అనుమానాలకు ఆధారాలే లేవు. రత్నం తనకు చేతనైన విధంగా తన అడుగుజాడల్లో నడిచేందుకే ప్రయత్నిస్తోంది-అది చాలు.

అడుగు జాడల్లో అనుకోగానే ప్రతిమ గుర్తొచ్చింది. ఔను. రత్నం భర్త అడుగు జాడల్లో వెన్నంటి నడిచే వ్యక్తి. ఆమె స్వతంత్రంగా ఏమీ చేయలేదు. అశక్త. కానీ—

ప్రతిమ భర్త ప్రక్కన అతడితో సమానంగా అడుగు వేయగల శక్తిమంతురాలు-అంత ప్రజ్ఞ గలది. ఆమే కాదు- రాధకూడ అలాంటిదే.....అలా అని చూస్తే సుచిత్రాదేవి....ఇంకా ఎందరు లేరు!

వారితో రత్నని పోల్చటం అసందర్భం. ఎవరికి వారు వారి వారి పరిధులలో విజయవంతులు కాగల శక్తి సంపన్నులు- అది చాలు అనుకున్నాడు.

"పార్టీ చాలబాగా జరిగింది కదూ? దాదాపు ఐదువందలైందిట."

"అయింది. రాధగారు, అమర్‌గారు చాల ఆనందించారు...."
ఆనాటి పార్టీ కబుర్లు చెప్పుకుంటుంటే రిక్షా సాగిపోయింది.

# 24

చైత్రమాసం చొరబడక ముందే కోయిల శ్రావ్యంగా పాడుతుంది. తెల్లవారిలేచి మావి చివురులను కోపి నోట్లోవేసుకుంది. మామిడి వగరు- ఆ వాసన ఆమెకెంతో నచ్చింది. క్రితం రాత్రి కోయక వదిలేసిన చాటు మాటున వున్న మల్లె మొగ్గలు నిండా విచ్చుకుని సౌరభాలు వెదజల్లు తున్నాయి.

పుంస్కోకిల గొంతెత్తి పాడింది.

"ఇక లేవండి, కోయిలమ్మ పాడేస్తూంది- లెమ్మనమంటోంది." రత్నం భర్తను లేపుతూ అంది.

"ఏమన్నావు?"

"అదుగో! వినబడటం లేదూ? కోయిలమ్మ కూస్తూంది."

"రత్నం!....ఆ కూసేది కోయిలమ్మకాదు. కోయిలయ్య అని తెలీదూ?" అతడి ముఖంలో ఏదో బాధ తారట్లాడింది. రత్నం నవ్వింది.

"కోయిలయ్య అని తెలుసు. అంతా అంటున్నారని నేనూ అన్నాను. సినీమా పాటల్లో గూడ కోయిలమ్మ అంటారుగా" బాగానే సమర్థించుకున్నది.

"అదే. పాడేది గండు కోకిల అని తెలుసు-ఐనా అమ్మా, తల్లీ అంటారు దాన్ని-ఏం చేద్దాం! అది మన ఖర్మ!"

"మరీ....ఏమండీ! - నాకిదో అనుమానం. మరి చిలకా గోరింకల్లాగ అంటారే- ఆ రెండూ అంత అన్యోన్యంగా కలిసి మెలిసి వుంటాయా....మనలాగా!" అంది వచ్చే నవ్వు ఆపుకుని రెప్పలు అల్లల్లాడిస్తూ.

"ఉహూ," అన్నాడు చప్పగా.

"ఆఁ" అంది కళ్లు రెండూ ఇంతింత చేసుకుని. "అదేమిటి?"

"ఆ రెండు వేరువేరు తెగలకు చెందిన పక్షులు. అలా కలిసి ఉంటానికి వీల్లేదు. ఉండవు. ప్రకృతికి విరుద్ధం."

"అయితే, అంత ఇదిగా- చిలకా గోరింకల్లా ఉంటారని వాడు కలో కెల్లా వచ్చిందీ?"

"ఎప్పుడో అన్నారు. తెలియక ఆ తర్వాత వాళ్లంతా కూడా అంటున్నారు. తెలిసి కూడా మనం అంటున్నాం. మన ఖర్మ-అంతే!" అంటూ దుప్పటి విసరి పారేసి లేచికూచున్నాడు.

"పోనీ, తెలిసిం తర్వాత మార్చుకోరాదూ? లేకపోతే వాడటం మానరాదూ?"

వెంకటేశ్ భార్య ముఖంకేసి వింతగా చూశాడు. ఏమిటి ఇవ్వాళ రత్నం ఇలా మాట్లాడుతూంది! మారుతున్న చిహ్నాలా ఏమిటి?

వెంకటేశ్ చివాల్న లేచి ఆమె భుజాలను గట్టిగా పట్టుకుని- "ఇవ్వాళ సినిమా కెళ్ళాలనుంది. వస్తావా?" అన్నాడు. రత్నం భర్త దురుసుతనానికి ప్రథమంలో ఆశ్చర్యపడింది. తర్వాత తమాయించు కుని అంది: "వస్తాను - ఏం సినిమా?"

"ఓ - ఇంగ్లీషుది."

ఆమె కనుబొమలు సన్నగా ముడివడినై. అంతలోనే వీడి పోయినై. "అలాగే - ఏదయితేనేం! మీప్రక్కన కూచుని తోలుబొమ్మ లాట చూసినట్లు చూసివస్తాను."

"భేష్.... నువ్వు నా అభీష్టానికి అనుగుణంగా మారావు? ఇంగ్లీషు కాదులే- తెలుగే. ఇకమీదట హాయిగా వెళ్లొచ్చు - నువ్వు మారావు," అంటూ ఆమెను ఊపేశాడు.

"అబ్బబ్బ -" అంటూ ముద్దుముద్దుగా మందలించి లోపలి కెళ్ళిపోయింది.

ఆవేళ రత్నం సుచిత్రాదేవి ఇంటి కెళ్ళింది. వెంకటేశ్ ఒంట్లో కులాసాగాలేక 'ఫ్లూ' చిహ్నాలు కనబడితే మూడు గంటలకంతా ఇంటి కొచ్చాడు. తాళంతీసి మంచినీళ్లు తాగి పడుకున్నాడు. నిద్ర పట్టలేదు.

ఒళ్ళంతా నొప్పులు. అలా కళ్ళు మూసుకున్నాడు. ఎంత సేపలా గడి పేదో!....ప్రక్క ఇంట్లోంచి మాటలు వినబడుతున్నాయి. వారి గదికి ప్రక్క ఇంటివారి గదికి అట్టే దూరం లేనందువల్ల మాటలు స్పష్టంగా, బిగ్గరగా వినబడుతున్నాయి. ముఖ్యంగా ఏదో ఘర్షణ పడ్తున్నారల్లే వుంది. అందుకే కాస్త స్థాయి హెచ్చించి మాట్లాడుకుంటున్నారు.

వారి స్వరాలు గుర్తించాడు. ప్లీడరు శ్రీపతి, ఆయన సతీమణి అనసూయమ్మ, ఇద్దరు కొడుకులు వాదించుకుంటున్నారు. అనసూయమ్మ గుంటూరు కాలేజిలో లెక్చరర్‌గా పనిజేస్తూంది. రేపో మాపో రిటైర్ అవబోతుంది. శ్రీపతికి అట్టే ప్రాక్టీసు లేదు. వయసు మీరినందువల్ల "వృద్ధాప్యపు అనారోగ్యం" అతణ్ణి అంటిపెట్టుకున్నది. కొడుకులిద్దరికీ, కూతుళ్ళు ముగ్గురికీ పెళ్ళిళ్ళు చేసేశారు. వారికిగూడ సమస్యలంటూ ఉంటాయా అని విస్తుపోయాడు వెంకటేశ్.

"ఆ లైఫ్ ఇన్‌స్యూరెన్స్ మెచ్యూర్ అయివచ్చిందా! ఒక్క మాట నాతో చెప్పకుండా పొలంకొన్నారు మీ నాన్న! ఆవలి భాగంలో రెండు అలమరలు పెట్టించమన్నారుట అద్దెకున్నవాళ్ళు. ఓ - పెట్టిం చేస్తానని మాట ఇచ్చేశారు. ఏం మాటలా? వాళ్ళిచ్చే వంద రూపాయలకు ఇన్ని వసతులు కల్పించలేమని తెకీమని చెప్పలేరు. వాళ్ల దగ్గర మొహమాటం మరి. అటువేపు గోడ పెట్టించారు. చూశారా! పది అడుగుల ఎత్తు కట్టించారు. ముఖాలు కనపడకుండా మధ్యగా ఆరడుగుల గోడైతే సరిపోదూ! వాళ్లేమో దెబ్బలాడుకున్నారట. అటు వాళ్లు మాట్లాడితే ఇటు వాళ్లు వినకూడదట. అందుకని కట్టించమనగానే పదడుగుల ఎత్తు- పదిగజాల పొడవు పెట్టి గోడ కట్టించారు మీ నాన్న. ఏం కన్సిడరేషన్ మరి! ఒక్క మాట నాతో అన్నా రనుకున్నారా! పోనీ, నా సలహా పొందారనుకున్నారా? ఆ బుర్రకేంతోస్తే అంతే. నా మనసు నొప్పించే పన్లు చేస్తే ఆయనకు తృప్తి."

"అదికాదు అన ...."

"ఏదికాదు? ఒక్కమాట నాతో చెప్పారా? రేపు ఈ ఇంటిని ఒకరే అద్దెకు తీసుకోవాలంటే ఆ అడ్డుగోడ ఎంత ఆటంకం! దాన్ని పడగొడ్తారా? వాళ్ళకు పిలవకపోతే ఇల్లు విడిచి వెళ్ళిపోతారు. అంతే

గాని, అడిగిందల్లా కట్టిస్తూ, డబ్బు దండుగ చెయ్యటం ఏమిటి?"
ఆమె కంఠం రుద్ధమైంది.

"నాకు తెలుసు. ఇదేం మొదటిసారి కాదు. మొదటినించీ ఇంతే. నా సలహా ఎప్పుడు పాటించారు? మీదంతా మొండితనం - నా మాటే పట్టించుకోరు. నాకుగానీ, నామాటకి గానీ పిసరంత గౌరవం లేదు. నాకంటే ఆ మొరటు ఇల్లాండ్రే నయం. వాళ్ళంటే వారి భర్తల కెంత గౌరవం! మీరేం గౌరవిస్తున్నారు! అసలు నా ఉనికినే విస్మరిస్తూంటే? చదువుకోకుండా ఇళ్ళల్లో కూచుని హాయిగా కాలం వెళ్ళబుచ్చే గృహిణే నయం- అన్నివిధాల భర్త అనురాగానికి పాత్రురాలవుతుంది. రెక్కలరిగిపోయేలా శ్రమించి పనిజేసి సంపాదించి పోస్తున్నా నన్ను ఇంత హీనంగా చూస్తారు. ఎప్పుడూ ఉండేదేగా! కొత్తఏముందీ?" అంటూ ముక్కు బుర్రున చీదేసింది.

"అమ్మా .... ఎందుకమ్మా, అల్లా బాధ పడ్తావు? మహా అయితే నాల్గువందలు ఖర్చు. ఎప్పటికీ ఉండే గోడ అది .... "

"చాలుచాలు - మీ రిద్దరూ మాకెంత పంపుతున్నారో కాస్త ఆలోచించుకోండి. మీ నాన్నగారు రెండు చేతులా ఆర్జించేటప్పుడు నా సంపాదనతో కలిసి మనకెంతో హాయిగా, ఇబ్బంది లేకుండా, సలక్షణంగా కాలం గడిచేది. అప్పటికి పదిరెట్లు ఖర్చు లెక్కువైన ఈ సమయంలో మేం ముసలి వాళ్ళమై పోయాం; రాబడి తగ్గిపోయింది. పెళ్ళిళ్లు, పురుళ్లు, పండుగలు- అన్నీ ఇప్పుడే వస్తున్నాయి. ఎంత వెనకేసినా ఇప్పుడు చాలనట్టే ఉంటూంది. అప్పటికన్నా ఇప్పుడు ఖర్చు లెంత పెరిగాయంటావు? అల్లాంటప్పుడు నాల్గువందలు వృథాగా ఖర్చు చేయటంలో అర్థం ఏమిటి? రేపు చిన్నామె పురిటి కొస్తూంది. అల్లుడు అసలే కోపిష్ఠి. మర్యాదలన్నీ ఒక్కటి పొల్లు పోకుండా జరిపి పంపాలి. ఏదైనా వస్తువు కొనిపెట్టాలి, ఆ పుట్టే పిల్లాడికి. ఇవన్నీ మర్చిపోతే ఎలా?"

"అందుకనే ఒక్కమాట చెప్తాను వినండి. మీరిద్దరూ మా దగ్గరుండండి. ఇల్లంతా అద్దె కిచ్చేద్దాం."

"వచ్చి మీ దగ్గరుండాలా?" అనసూయమ్మ నవ్వింది. "మా చెయ్యీ, కాలూ బాగున్నంత వరకు ఎవరి దగ్గిరికీ పోబోవటం లేదు. మీరు డబ్బు పంపినా, పంపకపోయినా మేం మాత్రం ఈ ఇల్లు విడిచి కదలబోము. అంతేకాదు- నువ్వూ, నీ భార్య మమ్మల్ని పరామర్శించే టంతవరకు మేం పరాయి ఇంట్లో ఉన్నట్లుగా ఉండాలి. మాకు స్వేచ్ఛ ఉండదు. అలవాటైన పరిసరాలను, మనుష్యుల్నీ వదిలి రావటం శుద్ధ తెలివి తక్కువ తనమే అవుతుంది. మా అలవాట్లు మీకు నచ్చవు. మీవి మాకు నచ్చవు. మీరు పెద్దయిన తర్వాతగాని దీని అర్థం మీకు బాగా బోధపడదు మీకు."

"నీవు మరీ చోద్యంగా మాట్లాడుతుంటావమ్మా! అందరు తలి దండ్రులు కొడుకుల దగ్గర ఉండటం లేదూ?"

"వాళ్ళకి వేరే ఆధారాం లేనందువల్ల, ఒకరి అండదండ అవ సరం కాబట్టి ఉంటారు. ఏముంది? తెల్లవారి లేస్తే వంటింటి కుందే ల్లాంటి జీవితం గడుపుతారు. వంటా వార్పూ—పిల్లలకు జడలుకూడ వేస్తారో లేదో—పూజలు మినహా వాళ్ళకి ఇతర వ్యాపకాలేముంటాయి? కొడుకు అన్నీ తెచ్చి పడేస్తాడు. ఆమె వంట చేస్తుంది. ఆ జీవితాని కామె మొదటినించీ అలవాటుపడి ఉంటుంది. కొడుకేం చెబితే అదే శిరోధార్యం. ఏది చెబితే అది చేస్తూ అలా పడి ఉంటుంది. ఆ తల్లికి వ్యక్తిత్వం అనేది ఒకటి ఉంటుందా అని! మరో రకం తల్లి అత్తగారి దర్జాతో కోడల్ని సాధిస్తుంది. కానీ, నాకెలా వీలవుతుంది? నాకు వంటా వార్పూ ఒక్కటే కాదు- ఇతర వ్యాపకాలున్నాయి. పై పుస్తకాలు చదవాలని, రెడ్‌క్రాస్ సెంటర్స్‌కు వెళ్లాలని, పదిమంది స్నేహితు లతో ముచ్చటలాడాలని, పిల్లలకి చదువు చెప్పాలని, అక్కడికి- ఇక్కడికి తిరగాలని ఉంటుంది. ఇవన్నీ సహించగలరా మీరు? 'మీకెందుకమ్మా—హాయిగా కూచోక' అంటారు. అలా నాకు వీలు కాదు. కాస్త స్వాతంత్ర్యం మాకూ కావాలి. మీ దగ్గరచేరి దాన్ని చేజేతులా వదులుకోలేము. మేము రాము. మీరు నిశ్చింతగా వెళ్లండి."

కొంతసేపు ఎవరూ మాట్లాడలేదు.

అనసూయమ్మ పునః ప్రారంభించింది: "ఆడపిల్లలకు పెళ్ళిళ్ల

యిన్నై. వస్తూ పోతూ ఉంటారు. మీ మెహర్బానీ మీద ఆధారపడ క్కర్లేదు. వాళ్ళకు వీలైనన్నాళ్ళుంటారు — మర్యాదజేసి పంపటానికి ఇక్కడ మాకు వీలుంటుంది. మీ దగ్గరకొస్తే-ఏమో- అన్నింటికీ మీ అనుమతి కావాలి-పిల్లలు స్వేచ్ఛగా రావటానికి వీలుండదు."

"అమ్మా - క్రొత్తగా మాట్లాడుతున్నావే. అందరూ అలాగే ఉంటారు. మీ దగ్గర కొచ్చినంత స్వేచ్ఛగా మా దగ్గరకీ వస్తారు. ఇందులో అనుమతించటానికి - అనుమతించక పోవటానికీ ఏముంది? మీ కిష్టమైనట్లు మీరు అన్నీ జరిపి పంపవచ్చు."

"ఏమో, మాకు రావటం ఇష్టంలేదు. మొదటినించీ ఒక విధ మైన స్వేచ్ఛాజీవితాని కలవాటు పడిన వాళ్ళం. అదొక తృప్తి మాకు. మీ దగ్గరకొస్తే మీ దగ్గర పడుండాలి- అక్షరాలా ఒదిగి పడుండాలి బాబూ!"

"నిజమేరా. మీ అమ్మ ఎంతో దూరదృష్టితో మాట్లాడుతూంది. ఆవిడకు ప్రతి విషయంలో జోక్యం కల్గించుకోవడం ఇష్టం. ఇంటి వ్యవహారాలు మొదలు, ఇంటి రిపేర్ల వరకు ఆమె సలహాలకు కొదువ లేదు. ఆమె బుద్ధి కుశలత గమనింప దగ్గది. అందుకని ఆ సలహాలు శిరోధార్యాలైనప్పటికి- ఏదో....ఎన్నోసార్లు ఆమె మాటలను లెక్కించే వాడిని కాను. నా నిర్లక్ష్యాన్ని సహించలేక నాతో పోట్లాడినా అందులో ఆనందం ఉంది. కాని, ఒరేయ్- మీతో ఎక్కడికని వేగ గలదు? మీ స్వ విషయాల్లో జోక్యం కల్గించుకోక పోయినా, సదుద్దేశంతో మీ మంచి కోరి ఏదైనా సలహాయిస్తే మీరు పాటించకపోతే మా మనసు చివుక్కుమంటుంది. వేళ కింత అన్నం మాత్రమే కాదురా మాక్కా వలసింది! మాకు తగిన జీవిత వ్యాపకం మీ దగ్గర ఉండకపోవచ్చు. అందువల్ల మీకు, మాకు అశాంతి తప్ప మిగిలేది ఏమీలేదు. అందు కని మీరు మీ ఇండ్లలో, మేము మా ఇంట్లో సుఖంగా ఉందాం. అంతే!"

"ఐతే రామంటారు?" ఒక కొడుకు కంఠం ఖంగుమంది.

"ఒరేయ్-రేపు నీ కొడుకు నిన్ను కూడా ఇదే ప్రశ్న వేస్తాడు. ఆనాడు నువ్వు ఏం జవాబు చెబుతావో_అదే జవాబు నేను చెబుతున్నాను- రాము. రాము. రాము!"

"మా స్నేహితుల తలిదండ్రులు లక్షణంగా వాళ్ళ దగ్గిరే ఉంటున్నారు." ఒక కొడుకు విసుగుతో అన్నాడు.

ఆమె చల్లగా నవ్వింది.

"అంటే- వాళ్లు సమస్తమైన భారం కొడుకుల మీదవేసి విశ్రాంతగా, అదోహ విధమైన తటస్థ జీవితం గడుపుతున్నా రన్నమాట. ఆ విధంగా మనసు మార్చుకోవటంలోనే ఉంది కిటుకంతా. ఒరేయ్- అది మాకు చేతకాదు. మాకు ఆ విధమైన గప్-చిప్ జీవితాలతో సమన్వయం కుదరక బాధపడి అశాంతికి లోను కావలసివస్తుంది. అందుకని రాము."

మళ్లీ కాసేపు ఎవరూ మాట్లాడలేదు.

తండ్రి ఎత్తుకున్నాడు: "ఈ విధంగానే గడిచి పోనివ్వండి. ఏ కాలో చెయ్యో పడి, అస్వస్థతతో అవస్థపడే సమయంలో వచ్చి తీసుకెళ్ళండి. ఇప్పటినించీ మీ దగ్గరుండి ఆ చావు కోసం వెయిట్ చేయటం ఏం బావుండదు, అస్తమానం అదే గుర్తొస్తుంది."

"ఏం మాటలు నాన్నా అవి!" అన్నాడు ఒకబ్బాయి.

"ఇక పెన్షన్ తీసుకోగానే చావుకు వెయిట్ చేస్తున్నట్టు లెక్కేమిటి? చాల విపరీతంగా మాట్లాడుతున్నారు."

"మరి మా పనులన్నీ అయిపోయినై. భగవంతుడు ఈ గడ్డమీదవేసి లక్షణంగా జీవించండర్రా అని ఆరోగ్యం- యౌవనం-అర్ధాంగిని, పుత్రులనిచ్చి చల్లగా చూపినా, మించి పోయిన తర్వాత- నా దగ్గరకు పయనం కావటానికి తయారుగా ఉండు- అంటాడు. మరి అప్పటినించి సిద్ధపడి తయారుగా ఉండాలిగా! చావెప్పుడొస్తుందో ఆలోచించటం తప్పంటారా?"

అనసూయమ్మ నవ్వింది.

"అంత భయం దేనికి? పదండి. హాయిగా పడుకుని రేపొద్దున్న ప్రయాణమౌదురుగాని. అన్నట్లు చెరొక మూడొందలు పంపండి."

ఆ తర్వాత మాటలు విన్పించలేదు.

అంతా నిశ్శబ్దం.

వెంకటేశ్ కి ఎంతో ఆశ్చర్యంగా ఉంది.

ఇటువంటి సమస్యలు తమ కుటుంబాలలో ఎప్పటికీ రావు.

తన తండ్రి తల్లికి తెలియకుండా ఎన్నో పనులు చేస్తూం టాడు. పొలం పనుల విషయాల్లోనేమి, ఇంటికి సంబంధించిన విష యాల్లోనేమి ఆయన స్వతంత్రంగా వ్యవహరిస్తూంటాడు. ఆయన సమీక్షాకారిత్వాన్ని ఆమె ఎప్పుడూ విమర్శించదు. ఊకొట్టి ఊరుకుం టుంది. తనకు చెప్పలేదని విచారించదు. భర్త తనను నిర్లక్ష్యం చేస్తున్నా డనుకోదు. తనను గౌరవించటంలే దనుకోదు.

చటుక్కున అనసూయమ్మ స్థానంలో ప్రతిమ ప్రత్యక్షమైంది.

రేపు ప్రతిమగూడ ఇలాగే తయారౌతుందేమో! ప్రతిమ పట్టు బట్టి చదువు పూర్తిచేస్తే ఊరికే ఇంట్లో కూచోదు. ఉద్యోగం చేస్తా లంటుంది. వీళ్ళిద్దరిలాగానే మహీధర్, ప్రతిమ తయారవుతారు. ప్రతి విషయంలో ఇలాగే ఘర్షణ పడ్తారు. పడినా ఆనందమే. సమ ఉజ్జీల మధ్య ఘర్షణ బాగానే వుంటుంది. వాదించుకుని, తర్జన భర్జనలతో సతమత మవటంలో అర్థం ఉంది.

తన తల్లిలాంటిది రత్నం. మౌనంగా అన్నీ వింటుంది. అన్నిటికీ ఊకొట్టి ఊరుకుంటుంది. ప్రస్తుతానికి వారికి ఏ సమస్యలు లేవు. కాని, పోనుపోను ఈ జీవితంలో ఎన్ని సమస్యల నెదుర్కో వాలో! తను ఒక్కడే వాటిని పరిష్కరించగలడా! అంత శక్తి సామర్థ్యం తనకుందా! "టూ హెడ్స్ ఆర్ బెటర్ దాన్ వన్," అన్నారు - అందులో ఎంతేనా సత్యం ఉంది.

అనసూయమ్మ మాటల్ని పదేపదే మననం చేసుకున్నాడు. నిజమే. ఒకవిధమైన జీవిత విధానాని కలవాటుపడిన వాళ్ళను నూతన పంథా త్రొక్కమంటే ఎన్నో అనుమానాలు వస్తాయి. రేపు తన తల్లిని తన దగ్గరకు రమ్మంటే పరుగులమీద వస్తుంది. పొలాలు చూసుకో టాని కిద్దరల్లుళ్ళున్నారు. తల్లికిగాని, తండ్రికిగాని అట్టే బాదరబందీ లేదు. తనువాళ్ళను రమ్మనాలేగాని - చక్కగా వచ్చి ఉంటారు. చటు క్కున రావుగారు, సుచిత్రాదేవి అతని మనోవీథిలో మెదలారు. వాళ్ళుకూడా అంతే. రేపు కొడుకు రమ్మనమంటే వెళ్ళరూ!

తనకు అమ్మా నాన్నలు దగ్గరే ఉండాలనే కుతూహలం ఉంది, కొన్ని సంవత్సరాలకైనా అది తప్పక ఫలిస్తుంది. కానీ, మనసులో

ఏవేవో ఆలోచనలు - ఆ కకావికలన్నీ తుడిచిపెట్టి నిద్ర కుపక్ర మించాడు.

రత్నం వచ్చేసరికి భర్త ఇంట్లోనే ఉండటం ఆమె కెంతో ఆశ్చర్యం కల్గించింది.

తలుపు తీసిన భర్తకేసి స్థాయిపడి చూస్తూ నుంచుంది.

జరిగిన విషయం చెప్పాడు. హమ్మయ్య అనుకుంది. ఆ సాయంత్రం మెల్లిగా చెప్పాడు - ప్రక్క ఇంట్లో జరిగిన విషయాన్ని గూర్చి.

రత్నం కనుబొమలు చిట్లించింది. "ఆ అనసూయమ్మగా రెప్పుడూ అంతే. మన కాళ్ళమీద మనం నుంచోవాలంటుంది. అప్పటి కామె ఎవరికాళ్ళమీద నుంచున్నట్లు? ఏదో ఒకమాట పట్టుకుని ఎప్పుడూ భర్తతో ఘర్షణ పడ్తుంది. ఆమె ఔనంటే ఆయన కాదంటాడు; ఆయన ఔనంటే ఆమె కాదంటుంది. ఏమిటో - హాయిగా వెళ్ళి కొడు కుల దగ్గ రుండక."

వెంకటేశ్ మౌనంగా అంతా విన్నాడు.

ప్రతిమ కీ సంగతి చెబితే ఏమంటుందో అతడు ఊహించ గలడు: "ఔనుమరి, అనుభవంమీద సలహా ఇస్తే పాటించక్కర్లేదూ! పెడచెవిపెడ్తే ఏమనాలి? ఆమె సలహాలకు విలువ ఇవ్వకుండా అగౌ రవపర్చి, ఆయన ఏం పొముకుంటాడు? అంతమాత్రానికి మామూలు గృహిణికి, ఆమెకూ ఏం భేదం వుంది? ఒక వయసు దాటాక మామూ లుగా తల్లి కొడుకుమాట వింటుంది. కాని, ఇలాంటితల్లులు పెద్దయిన తర్వాత కొడుకులు తమ మాట వినకపోతే బాధపడ్తారు. అందుకని హాయిగా వేరుగా వాళ్ళకు నచ్చినచోట విడిగా ఉండటమే శ్రేయ స్కరం." అంటుంది- "మా అమ్మ నాన్నకూడా చచ్చినా ఒకరిదగ్గర కెళ్ళరు. అవసరంవస్తే తప్పదనుకో" అంటుంది కూడా.

ఔను - తనకు తెలుసు - రావుగారు, సుచిత్రాదేవుల మనః ప్రవృత్తి. విజ్ఞానజనిత స్వేచ్ఛ అది.

ఇక అట్టే మాటలు పెంచలేదు వెంకటేశ్. వేడి వేడి పాలు త్రాగి పడుకున్నాడు.

రత్నం మొట్టమొదటి రవికె పూర్తిచేసింది. అందంగా, కనబడీ కనబడని చేతికుట్టుకేసి గర్వంగా ఒక్కసారి చూసుకుంది.

ఆమె ముఖంలో అనిర్వచనీయమైన ఆనందం ప్రస్ఫుట మైంది.

# 25

ప్రతిమకు పురిటి రోజులు దగ్గర కొస్తూంటే రత్నకు కోరికలు ఎక్కువై పోతున్నాయి. ఈ కబురు తెలిసిన ఆప్తులంతా ఎంతో ఆనందించారు. రత్నం తండ్రివచ్చి చూపి వెళ్లాడు.

తను తండ్రి కాబోతున్నాడని ఉప్పొంగి పోయాడు వెంకటేశ్. ప్రతిమకు ఎందులో తీసిపోయింది రత్నం అనుకున్నాడు.

ఆ రోజు సాయంత్రం అందరూ సుచిత్రాదేవి ఇంట్లో సమా వేశ మయ్యారు.

ప్రతిమని హాస్పిటల్‌కు తీసుకెళ్లాలని నిశ్చయించారు. రత్నకు అదేదో ఎబ్బెట్టుగా తోచింది. తల్లిదండ్రు లుండగా - లక్షణంగా ఇంట్లో పురుడు పోసుకోక ఇదేమిటి?- అనుకుంది.

ఇద్దరూ ఏకాంతంగా మిగిలినప్పుడు మెల్లగా అంది -

"అదేమిటి ప్రతిమా - ఇక్కడే పోసుకోరాదూ!"

"హాస్పిటల్ అయితే డాక్టర్లు, నర్సులూ ఎప్పుడూ దగ్గరుం టారు. ఏదైనా అవసరం పడ్తే అన్ని వస్తువులు దగ్గరుంటాయి. అదే మంచిది. ఇంత బిల్లు అంటారు - చెల్లించి బైట పడొచ్చు."

"ఓహో" అనుకుంది రత్నం.

ఆ తర్వాత ఒకనాడు ప్రతిమ పండులాంటి కొడుకును ప్రస వించింది. మహీధర్ ఆనందాని కవధుల్లేక పోయాయి.

"ఇంటికి కబురందజెయ్యి" అని వెంకటేశ్ సలహా ఇచ్చాడు.

"వద్దులే. వాళ్ళకు కావలసింది నేనొక్కణ్ణే. కొడుకు పుట్టాడని రాస్తే - ఓహో ఆస్తికోసం ప్రాకులాట అనుకుంటారు. ఇప్పటి ఆస్తిఅంతా నాన్నగారి సంపాదనే. వార్ని మెప్పించటానికి ప్రయత్ని స్తున్నా ననుకుంటారు. రాయనుగాక రాయను" అన్నాడు.

నిజమేనేమో అనుకున్నాడు వెంకటేశ్.

కాని, వెంకటేశ్ ఊరుకోలేదు. ఓ కార్డు రాసి పడేశాడు.

".... నేను మీకు ఈ శుభ సమాచారం తెలుపు తున్నానని మహీధర్‌కు తెలీదు," అన్న ముక్క కూడా రాయటం మరువలేదు. ఉత్తరం రాసిన వారానికిగూడ అటునించి మహీధర్‌కుగాని, వెంకటేశ్‌కు గాని ఉత్తరం రానందువల్ల మహీధర్ ఆలోచనే సబబైందని ఊరుకున్నాడు.

స్నానం చేయించిన రోజున రత్నం అక్కడే ఉంది. సరదాగా గడపి ఆ రోజు సాయంత్రానికింటి కొచ్చింది.

రాత్రి భర్త దగ్గర చేరి ప్రారంభించింది: "చూశారా, ఆసుపత్రిలో బిల్లు మహీధర్ అన్నయ్యే ఇచ్చాడు!" ఆమె ముఖంలో ఎంతో ఆశ్చర్యం.

"మరి ఎవరివ్వా లనుకున్నావు?"

"అదేమిటండీ! బాబాయిగా రివ్వాలి కదా!"

"ఆయన కట్టలేదేమో - మహీధర్ కట్టాడు."

"అంతేకాదు - ప్రతిమ ఇరవై ఒకటవ రోజునే వాళ్ళింటికి వచ్చేస్తుందట."

"ఔను. ఎంతకాలమని పుట్టింట్లో ఉంటుంది?"

"అదికాదు. ప్రతిమకు - అన్నయ్యకు వాళ్ళుతప్ప నా అనేవా రెవ్వరు లేరుగా. అందులోనూ, మొదటి కాన్పు. చక్కగా తీసుకెళ్ళి

పురుడుపోసి, మర్యాదలు జరిపించి, బాల సారె అదీ చేయించి మూణ్ణెల్లయినా ఉంచుకోకుండా పంపేస్తుంటే నాకేదోలా ఉంది."

"అంటే- రేపు నిన్ను మామయ్యవాళ్లు తీసుకెళ్లి అలా జరిపించి పంపాలని ఆశగా ఉందా?"

"ఆదేమిటి! ఇదేం నిన్న మొన్నటి ఆచారంకాదుగా? లోకంలో జరుగుతున్నదే! అమ్మావాళ్ళూ అలాగే, అన్నీ జరిపించి పంపుతారు."

"సరే - మీవాళ్లకు అంత తాహతుంది కాబట్టి అన్ని లాంఛనాలూ జరిపి పంపుతారు. లేనివాళ్ళైతే ఎంత కష్టం చూడు. పెళ్లిచేసి పంపటానికే నానా హైరానా పడ్తుంటారు. మళ్లీ పురిటికని తీసుకెళ్లి బోలెడు ఖర్చుల్లో పడటం ఎంత అవివేకం?"

"అంటే మొదటి పురుడుకూడా అత్తారింట్లో పోసుకోవాలనా మీ రనేది!"

"ఔను మరి. ఇది కేవలం భార్యా భర్తలకు సంబంధించిన విషయం. ఒకవేళ పుట్టింట్లో అన్ని సదుపాయా లుంటాయని పంపినా ఖర్చులు మనమే భరించుకోవాలి. అందులో అర్థం ఉంది."

"ఏమో - నా కవన్నీ నచ్చవు. హాయిగా అమ్మదగ్గరైతే అన్నీ బావుంటయి."

"ఔను - కాదనను. మరి ప్రతిమకు కాస్త బలం వచ్చేవరకు అక్కడుంటుంది. తర్వాత వచ్చేస్తుంది. మనలోనే ఈ పద్ధతిగానీ, ఉత్తరాదిన పురుడు పోయటం- దాని తాలూకు ఖర్చులన్నీ అత్తగారివే. అప్పటికిగాని తెలిసిరాదు_ ఒక్క_ పురుడు పోయాలంటే ఎంత ఖర్చయ్యేది. అందుకే గప్‌చిప్‌గా గర్భిణీ అయిన భార్యను పుట్టింటికి తరుముతుంటారు మహానుభావులు. అక్కడివాళ్లు ముప్పు తిప్పలు పడి పురుడుపోసి, ఉన్నా లేకపోయినా, అప్పో సప్పో చేసి ఖర్చు భరించి చల్లగా భార్యను- పాపను పంపుతారు. ఇక వీళ్ళ కేంతెలుస్తయి అక్కడి కష్టాలు, సాధక బాధకాలు? ఏడాది తిరక్కముందే మళ్లీ పుట్టింటికి తరుముతుంటారు."

"మీ ధోరణి నాకేం నచ్చలేదు."

"పోనీయ్. అందులో ఏముంది? అవసరం పడింది. అమ్మా నాన్నల సాయం తీసుకుంది ప్రతిమ. ఖర్చులు తామే భరించారు. హాయిగా వెళ్లి పోతుంది తనింటికి. వాళ్ళమ్మగారివైపు పద్ధతులనే అనుసరిస్తుంది ప్రతిమ. అవే చాలా మంచి పద్ధతులు? .... చూడు రత్నం! ప్రతిమకు ఏం కష్టం లేకుండా పెళ్లయింది. కాని, చెల్లెలికి అవుతుందా? ఎంత కట్నం కావాలంటారో- ఎవరొస్తారో అని పిన్ని ఎప్పుడూ ఆందోళన పడ్తూంటుంది. పదివేలు లేకపోతే సుమారైన సంబంధం దొరకదని ఆమె ఆరాటం. కొడుకుని చదివించాలి. వాళ్ల ఖర్చులు వాళ్లవి."

"ఔననుకోండి. కాని, వాళ్ళు అన్నయ్యచేత ఖర్చు పెట్టించటం నాకేమీ నచ్చలేదు."

వెంకటేశ్ నవ్వాడు - హాయిగా బిగ్గరగా నవ్వాడు.

"అదీ సంగతి. అన్నయ్యకి ఖర్చయిందని బాధ. పోనీ, రేపు నిన్ను పంపకపోతే!"

రోషంతో తలెత్తింది రత్నం: "పంపకండి. అమ్మను పిలిపించితే అన్ని సమస్యలూ తీరుతై. ఆమె ఉన్న న్నాళ్ళుండి వెళ్లిపోతుంది. అక్కడ లేడీ డాక్టరుకూడ లేదు. నేనిక్కడే ఉంటాను."

వెంకటేశ్ నోరు తెరచుకుని మరీ విన్నాడు.

అమ్మో - రత్నం గడుగ్గాయే. ఏదో విచిత్రానుభూతితో చిరునవ్వుతో మౌనం వహించాడు.

అంతవరకు భిన్నమైన అభిప్రాయాలను గూర్చి చర్చించుకుంటూ సామ్య మనేది మిగలదని భ్రమపడ్డాడు. కానీ, రత్నం అతడి పాటకు సరిగా తాళం వేసింది.

"ఏం, భయ పడ్తున్నారా?" ఎగతాళి ధ్వనించే స్వరంతో అడిగింది. వెంకటేశ్ పకపకా నవ్వాడు.

"నాకేం భయం రత్నా! నిన్ను ఆ పల్లెకు పంపటం నాకూ ఇష్టంలేదు," అన్నాడు.

ఆ గదిలో ఫాన్ శబ్దం తప్ప మరే శబ్దం లేకపోయింది.

# 26

మళ్ళీ ప్రతిమ చదువు ప్రారంభించింది. ఈ ఏడాదైనా తప్పక పరీక్షకు పోవాలని ఆమె గట్టి పట్టుదలతో ఉంది. మహీధర్ ఆమె అభిప్రాయాన్ని కెదురు చెప్పడు. బాబు ఆరోగ్యంగా ఎదుగుతూంటే ప్రతిమ చదువు సాఫీగానే సాగుతోంది.

ఒకనాడు మాటవరుసకు వెంకటేశ్ అడిగాడు:

"పాసయ్యాక ఏం చేద్దామని?"

ప్రతిమ ఠకీమని జవాబు చెప్పింది: "పనిచేస్తాను."

"అదే నా కిష్టంలేదు." మహీధర్ ముక్కుమీద కోపం చిటపట లాడింది.

ప్రతిమ చల్లగా నవ్వింది.

"ఇంత శ్రమపడి చదివింది ఊరికే ఇంట్లో కూర్చోటానిక్కాదు. హాయిగా-పనిజేస్తే మూడొందలు చేతిలో పడ్తాయి."

"ఔనౌను. కడిగి నీ చేతిలో పోస్తారు వాళ్ళు."

"డబ్బుకు తగ్గపని ఉంటుందనుకోండి. ఐనా అదొక ఆనందం, సంతృప్తి. ఏది కావాలన్నా మిమ్మల్ని దేవిరించాలి. ఏ దడగాలన్నా భయమే, ఎల్లాంటి జవాబొస్తుందోనని. బాబుకూడ పుట్టాడు. ఖర్చులో ఒక మెట్టు పైకెక్కాము. అలాంటప్పుడు ఏది కావాలన్నా సూక్ష్మంగా ఆలోచించాలి. డబ్బు సరిపోతుందా లేదా అన్నది మరో గడ్డు సమస్య. అంతగా ఆలోచించుకున్న తర్వాత పోనీలెద్దూ అని అడక్కుండానే ఊరుకుంటాను. కాని, అన్నయ్యా! నేను కూడ సంపాదిస్తే యీ కష్టమే ఉండదు. ఆయన్ను అడగవలసిన పనిలేదు. ఆర్థిక స్వాతంత్ర్యం ఉంటే, అంతకన్నా కావలసిందేముంది? ప్రతి విషయానికి మిమ్మల్ని అడగ

వలపిన్న ఆవశ్యకత ఉండదు. హాయిగా కావలసినవి కొనుక్కోవచ్చు. నేనుకూడ నోరువిప్పి డబ్బు విషయం మాట్లాడటానికీ, సలహా యివ్వటానికీ ఆస్కారముంటుంది. నేను సంపాదించకపోతే, అన్నిటికీ నోరు మూసుకుని కూచోవాలి. ధైర్యంగా మాట్లాడటానికి గూడ వీలుండదు. నాదంటూ కొంత డబ్బుంటే ఎంత హాయి!"

"చూడు వెంకటేశ్! ఎలాంటి భేదాలు చూపుతుందో? తన డబ్బు-నా డబ్బు అట- మన డబ్బు అనాలిగాని. అప్పటికి నువ్వు సంపాదనాపరురాలివైతే నీ డబ్బంతా వేరుగానే అట్టిపెట్టుకో!"

ప్రతిమ హాయిగా నవ్వింది.

"అప్పుడే ఉక్రోషం చూశారా! మన డబ్బు అని ధైర్యంగా అనగల్గేటట్లు మీది నాది కలిసి ఉంటుంది. ఇంతవరకు మీ ఒక్కరిదే కాబట్టి అది మీదే అన్నమాట. నాదిలేంది మనది ఎక్కడినించి వస్తుంది!"

"చూశావా-ఎలా మాట్లాడుతూందో!" ఫిర్యాదు చేశాడు.

"చదువుకున్న వాళ్ళ భావాలిలాగే ఉంటాయేమో.... పోనియ్. పరీక్ష పాసయి పనిలో జేరటానికి కనీసం రెండేళ్లు పడ్తుంది. నిశ్చింతగా ఉండు."

"అంతవరకు ఈమెగారు నన్ను ఏమీ అడగరు కాబోలు!" కనుబొమ లెగరేసి ఓరగా భార్య వైపు చూశాడు మహీధర్.

"ఔను - ఏమీ అడగను.... ఇంతకాలం నా కోసం - కేవలం నా కోసం ఏవైనా అడిగానా మిమ్మల్ని?"

మహీధర్ ఆలోచించాడు. "లేదు" అన్నాడు.

ప్రతిమ ముఖం ప్రఫుల్లమైంది."ఇంకేం.... యూ ఆర్ సేఫ్!" అంటూ నవ్వింది.

పౌర్ణమి చంద్రుడు ఆమె ముఖ వికాసం చూసి బుద్ధిగా మబ్బు చాటుకి మళ్ళాడు.

ఆ లేలేత వెన్నెల్లో కూచుని చందమామ రాక కోసం చూశాడు. పృథ్వినంతా చల్లని తెల్లని శోభతో ముంచెత్తే ఆ శశివదనం నీలి మేఘాలమాటునించి మెల మెలగా బహిరతమైంది.

"ప్రతిమా! చందమామను చూస్తూంటే ఏమనిపిస్తూంది?" ఉన్న ట్లుండి వెంకటేశ్ ప్రశ్నించాడు.

ప్రతిమ ముఖం చందమామ వైపు కెత్తింది. తదేకంగా చూస్తూ అంది: "....ఆ కొండలు ఎలా ఉంటాయో? ఆ సీస్ (seas) ఏమిటో? ....అంత చక్కని వలయాకారంలో ఉండే ఆ గుండ్రని లోయల్లాం టివి ఏమిటో? మొట్టమొదట రష్యన్లు అడుగు పెట్తారో- అమెరికన్లు అడుగు పెడ్తారో! మనకు కనబడని ఆవలివైపు ఏమేమివుందో? చంద్ర మండలంలో అడుగుపెట్టి తిరిగివచ్చే ప్రప్రథము డెవరో? అక్కడినించి చూస్తే భూగోళం ఎంత అందంగా ఉంటుందో? కొన్ని సంవత్సరాల అనంతరం ఫారిన్ కంట్రీకి వెళ్లినట్లు మూన్‌కు వెళ్లటం మామూలు అయిపోతుందేమో....గాలిగాని,వాతావరణంగానిలేని చంద్రమండలంలో మనిషి దిగితే ఆ విచిత్రానుభూతి అనుభవించాలే గాని చెబితే మనకేం తెలుస్తుంది? ఇక్కడినించి చూస్తే అందంగా, ధవళ కాంతుల్ని వెద జల్లుతూ ప్రేమికుల కాపుడై, చల్లగా చూస్తాడు. కాని అక్కడో...."

ఆమె ధోరణికి వెంకటేశ్ విస్తుపోయాడు. మహీధర్ కూడ ముఖం పైకెత్తి ఆ గుండ్రని చందమామ కేసి చూస్తున్నాడు.

ఇక సెలవు తీసుకుని బాబు బుగ్గ గిల్లి టాటాచెప్పి ఇంటి ముఖం పట్టాడు వెంకటేశ్.

ఇల్లుచేరే సరికి రత్నం బైట కుర్చీలో కూచుని ఉంది. గేట్ తీసుకుని లోపలి కెళ్లాడు.

"నిన్ను తీసుకు రాలేదేమని అడిగింది ప్రతిమ. ఇవిగో!" అంటూ రంగుదారాలు, తెల్లగుడ్డ అందించాడు.

ఆమె అందుకుని లోపలి కెళ్లింది.

వా రిద్దరూ భోజనంచేసి వచ్చేసరికి చందమామ బాగా పైకి వచ్చాడు. పుచ్చపువ్వులాంటి వెన్నెలలో సన్నజాజి పూల నెత్తావులు. సిత కిరణాలు ఆ పూవుల ధవళిమలో విలీనమై వింతగా ప్రకాశిస్తు న్నాయి. చందమామవేపు దృష్టి సారించి, "రత్నా! చందమామలో ఆ మచ్చలు చూడు - ఏం గుర్తొస్తున్నాయి? చందమామనుచూస్తే నీ కేమనిపిస్తోంది?" అన్నాడు. అతడి పెదిమలమీద దరహాస రేఖ.

రత్నం తల పైకెత్తింది. "ఆ మచ్చలు - అవీ చూస్తుంటే అమ్మ చిన్నప్పుడు చెప్పిన ముసలమ్మ, మనవడి కథ గుర్తొస్తూంది - ఇంకా....ఎంత చక్కగా, కుందేల్లా వుంటుందా మచ్చ!"

రత్నం అపుడే స్తే నిరాశపడి పోయాడు -

"అంతేనా రత్నా! అంతేనా? చంద మామను చూస్తే నీకేమీ అనిపించదూ!" ఆమె వేపు తరచి తరచి చూశాడు.

రత్నం కళ్లు తారకల్లా ప్రకాశించాయి. ఆమె కపోలాల సిగ్గులో చంద్ర కిరణాలు పరావర్తనం చెందుతున్నాయి. ఆ ఆకర్ణాంత విశాల నేత్రాలు మనోజ్ఞంగా చలించాయి. స్నిగ్ధంగా మందహాసం చేస్తూ మృదువుగా అంది:

"మీరు గుర్తొస్తారు. మీరు నా సమీపంగా ఉండాలనిపిస్తుంది."

వెంకటేశ్ దిగ్భ్రాంతుడై కొన్ని క్షణాలవరకు ఏమీ మాట్లాడ లేక పోయాడు. తర్వాత హాయిగా నవ్వాడు. పెద్ద భారం దిగిపోయినట్టు, తెగని సమస్యలు తీరిపోయినట్లు తేలికగా నవ్వాడు.

ఆ నవ్వుకి అర్థం ఏమిటో రత్నం గ్రహించలేకపోయింది. తన జవాబే ఆ నవ్వుకు కారణ మనుకుని సిగ్గుల మొగ్గయిపోయింది.

వెంకటేశ్ ఆమె చేతిని గట్టిగా పట్టుకుని కళ్లు మూసుకున్నాడు. తను ఇక ఎన్నటికీ రత్నం విషయంలో బాధపడనవసరం లేదు. ప్రతిమ జవాబు మహీధర్‌కు నచ్చింది. తను కోరిన జవాబు రత్న ఇచ్చింది. మహీధర్‌కు - ప్రతిమ చక్కగ కుదిరిపోయింది. వారు ఒకరికోసం మరొకరు సృష్టింపబడ్డారు.

తనకు రత్నం సరిపోయింది. తన నైజాని కనుగుణంగా ప్రవర్తించే రత్నం తన కోసమే సృష్టింపబడింది.

తను రత్నాన్ని చదివించి ప్రతిమ అంతటిదాన్ని చేయలేడు- కాని, తన ప్రయత్నంలో కృతకృత్యుడయ్యాడు, కృతార్థుడయ్యాడు. ఇకపైన ఆమె చదువుకోలేదనిగాని, అధునాతనంగా వుండదని గాని, పూర్వకాలం అలవాట్లన్నీ పుణికి పుచ్చుకున్న పల్లె పిల్ల అనిగాని విచారించి మనఃక్లేశాన్ని కోరి తెచ్చుకోనవసరం లేదు.

'రత్న- ప్రతిమ స్త్రీలు. వారి వారి గృహ జీవితాల్లో వాళ్ళు కృతకృత్యులయ్యారు'—అనుకున్నాడు వెంకటేశ్.



# ఇప్పటివరకూ వచ్చిన
# ఎమెస్కో పాకెట్ పుస్తకాలు

1. దిండుక్రింది పోకచెక్క-విశ్వనాథ సత్యనారాయణ (నవల) (Reprint)
2. బ్రతికిన కాలేజి-పాలగుమ్మి పద్మరాజు (నవల)
3. సాక్షి-ముళ్ళపూడి వెంకటరమణ (సినిమా స్క్రిప్టు)
4. గ్రహణం విడిచింది-ద్వివేదుల విశాలాక్షి (నవల)
5. విచిత్రకమనీయం-చలం (హాస్య, వ్యంగ్య కథలు)
6. పిడికెడు ఆకాశం-గొల్లపూడి మారుతీరావు (నవల)
7. హౌస్‌సర్జన్-కొమ్మూరి వేణుగోపాలరావు (నవల) (Reprint)
8. నిరీక్షణ-ఉన్నవ విజయలక్ష్మి (నవల)
9. కాశ్మీరపట్టమహిషి-పి. గణపతిశాస్త్రి (నవల)
10. ఆత్మబలి-సి. ఆనందారామం (నవల)
11. సుఖంకోసం-వీరాజీ (నవల)
12. బంధమూ, అనుబంధమూ-పి. వి. కృష్ణమూర్తి (నవల)
13. స్వీట్‌హోం-ముప్పాళ రంగనాయకమ్మ (నవల) (Reprint)
14. నూరు శరత్తులు-మంజుశ్రీ (నవల)
15. కోనేరూ, సెలయేరూ-వాసమూర్తి (నవల)
16. ఇదే దారి-బలివాడ కాంతారావు (నవల)
17. బుద్ధుని జాతక కథలు-శ్రీ శివశంకరస్వామి (కథలు)
18. అహం-అనర్థం-ముద్దంశెట్టి (నవల)
19. స్వయంవరణం-మహీధర రామమోహనరావు (నవల)
20. అదృష్టచక్రం-హరికిషన్ (నవల)

21. వక్రగతులు-ఇతర కథలు-మధురాంతకం రాజారాం
22. గిరీశం ది గ్రేట్; సెకండ్ స్టెప్-వడ్లమన్నాటి (వ్యంగ్యరచన)
23. సామాన్యుడి కామన-హితశ్రీ (నవల)
24. ప్రాణాంతక ప్రణయం-వి. యస్. అవధాని (నవల)
25. శ్రుతితప్పిన రాగం-పి. వి. రాజమన్నారు (నవల)
26. చిట్లీ చిట్లని గాజులు-విశ్వనాథ సత్యనారాయణ (నవల)
27. దైవమిచ్చిన భార్య-చలం (నవల)
28. రత్నకంబళం-రేవనూరి శమంత (నవల)
29. వారధి-ద్వివేదుల విశాలాక్షి (నవల)
30. అపరాజిత-వాకాటి పాండురంగరావ్ (కథలు)
31. పూల తెరలు-కోమలాదేవి (నవల)
32. అది ప్రశ్న, ఇది జవాబు-అవసరాల రామకృష్ణారావు (నవల)
33. ఇద్దరం ఒకటే-వీరాజీ (నవల)
34. కల్యాణ ఘడియ-అద్దేపల్లి వివేకానందాదేవి (నవల)
35. ప్రేయసి: ప్రియంవద-ఉషశ్రీ (జంట నవలలు)
36. దరిజేరిన ప్రాణులు-ఇల్లిందల సరస్వతీదేవి (నవల)
37. హారతి-కొమ్మూరి వేణుగోపాలరావు (నవల)
38. వెన్నెల కాచేసింది-గొల్లపూడి మారుతీరావు (నవల)
39. సరళీస్వరాలు-నందుల సుశీలాదేవి (నవల)
40. మంచుపల్లకి: మరితొమ్మిది-శ్రీపతి (కథలు)
41. దుఃఖితులు-రంధి సోమరాజు (నవల)
42. చైత్రపూర్ణిమ-పి. గణపతిశాస్త్రి (కథలు)
43. బ్రతుకుజోడు-ఏ. లక్ష్మీరమణ (నవల)
44. సిపాయి కూతురు-కొవ్వలి లక్ష్మీనరసింహరావు (నవల)
45. కొత్త నీరు-డి. కామేశ్వరి (నవల)
46. లేడీ డాక్టర్-నండూరి విఠల్ (నవల)
47. పూదోటలో గంటుముళ్ళు-గంటి (శిఖా) వెంకటరమణ (నవల)
48. జీవితదృశ్యాలు-మంజుశ్రీ (నవల)
49. లావణ్య-మాలతీచందూర్ (నవల)
50. ఆరాధన-యద్దనపూడి సులోచనారాణి (నవల) (Reprint)
51. సౌదామని-విశ్వనాథ సత్యనారాయణ (నవల)

52. కన్యాశుల్కం-గురజాడ అప్పారావు (సాంఘిక నాటకం)
53. జీవితాదర్శం-చలం (నవల) [(Reprint)
54. చీకటి కడుపున కాంతి-సి. ఆనందారామం (నవల)
55. ఇంతకీ నే నెవరు?-కపిల కాశీపతి (నవల)
56. మనుషులు, మనసులు-పవని నిర్మల ప్రభావతి (నవల)
57. వెలుగులో వెలది-గంధం యాజ్ఞవల్క్య శర్మ (నవల)
58. పెళ్లి చెయ్యకుండా చూడు-కొడవటిగంటి (కథలు)
59. కవిద్వయము-నోరి నరసింహశాస్త్రి (నవల)
60. సంఘంచేసిన మనిషి-పోలాప్రగడ సత్యనారాయణమూర్తి (నవల)
61. అచలం : చంచలం - రేవనూరి సువర్ణ (నవల)
62. చీకటిదారి : చిన్నవదినె-కె. రామలక్ష్మి (నవలికలు)
63. రాజశేఖర చరిత్ర-కందుకూరి వీరేశలింగము (నవల)
64. నల్లరేగడి-పాలగుమ్మి పద్మరాజు (నవల)
65. ఏటిఒడ్డున సీటిపూలు-కొలిపాక రమామణి (నవల)
66. మహానగరంలో స్త్రీ - లత (నవల)
67. చిలకమర్తి ప్రహసనములు-చిలకమర్తి లక్ష్మీనరసింహము
68. మైదానం-చలం (నవల)
69. హోట్‌హోం-శార్వరి (నవల)
70. ఆనావీలర్-జీవనరాగం-సారీస్ (రెండు నవలికలు)
71. 1968 కథానికలు-సంకలన:పతంజలి, మురళీధర్ (కథలు)
72. పుణ్యభూమి-బలివాడ కాంతారావు (నవల)
73. చేదునిజాలు-పరిమళా సోమేశ్వర్ (నవల)
74. చిత్రకారుడి భార్య-మురయా (నవల)
75. రామానుజుని ప్రతిజ్ఞ - పి. రాజగోపాల నాయుడు (నవల)
76. దూతమేఘము - విశ్వనాథ సత్యనారాయణ (నవల)
77. హరివిల్లు - ద్వివేదుల విశాలాక్షి (నవల)
78. కొత్త ఇల్లు - తాళ్లూరు నాగేశ్వర రావు (నవల)
79. ముత్యాలపందిరి - పోరంకి దక్షిణామూర్తి (నవల)
80. గద్వాలచీర - పన్యాల రంగనాధరావు (నవల)
81. మేఘాల మేలి ముసుగు - మాలతీ చందూర్ (నవల)
82. గణపతి - చిలకమర్తి లక్ష్మీనరసింహము (నవల)

83. బ్రతుకు బొంగరం - రావులపాటి సీతారాంరావు (నవల)

84. శారదరాత్రులు - వేదుల శకుంతల (నవల)

85. స్నేహబంధం - అంగర వెంకటసత్యనారాయణరావు (నవల)

86. హంపీ కన్యలు - చలం (నవల)

87. కథాంజలి (విద్యార్థిసాహితి)

88. నిశ్శబ్ద సంగీతము - సి. ఆనందారామం

89. తొణకిన స్వప్నం - తొలగిన స్వర్గం - రేవనూరి శమంత (రెండు నవలికలు)

90. కంఠాభరణము - పానుగంటి లక్ష్మీనరసింహరావు (సాంఘిక నాటకం)

91. నాటకాల రాయుడు-గొల్లపూడి మారుతీరావు (సినిమా స్క్రిప్టు)

92. త్రిశంకుడి స్వర్గం - మధురాంతకం రాజారాం (నవల)

93. మల్లిక - పణతుల రామచంద్రయ్య (నవల)

94. ప్రేమించు ప్రేమకై - కె. రామలక్ష్మి (నవల)

95. మనిషి - నండూరి విఠల్ (నవల)

96. బుద్ధిమంతుడు - ముళ్ళపూడి వెంకటరమణ (సినిమా స్క్రిప్టు)

97. మాతృమందిరము - వేంకట పార్వతీశ్వరకవులు (నవల)

98. రెండవ అశోకుడి మూణ్ణాళ్ళపాలన-పాలగుమ్మి పద్మరాజు(నవల)

99. ఆత్మీయులు - యద్దనపూడి సులోచనారాణి (సినీ నవల)

100. ఒకే పాటకు రెండు రాగాలు - కొమ్మూరి వేణుగోపాలరావు (నవల)

1970-జనవరి విడుదల

101. లలితాపట్టణపురాణి - విశ్వనాథ సత్యనారాయణ (నవల)

102. చిల్లర దేవుళ్లు - దాశరధి రంగాచార్య (నవల)

103. దాంపత్యాలు - కోమలాదేవి (నవల)

104. హాస్యసంజీవని - కందుకూరి వీరేశలింగము (ప్రహసనాలు)

తెలుగు పుస్తక ప్రపంచంలో
హెచ్. ఎల్. పి. కొత్తవెలుగు!
అందులో ఇది మరీ సరికొత్త మలుపు






"ఇంటింటా స్వంత గ్రంథాలయం" ప్రణాళిక




పాఠకుల సౌకర్యానికై సరికొత్త మార్పులు!
సరికొత్త సదుపాయాలు!! సరికొత్త పద్ధతి!!

సరిగ్గా సంవత్సరానికి, సొంతానికి, సంసారపక్షమైన ఒక చిన్న గ్రంథాలయం కూర్చుకోడానికి ఘనమైన ఉపాయం హెచ్. ఎల్. పి. —అదే ఇంటింటా స్వంత గ్రంథాలయం ప్రణాళిక:

ఏమి చేయాలి? ఏమేమి వస్తాయి?

మీరు చేయవలసిందల్లా ఒక్కటే:

నెల నెలా రు. 7-50 చొప్పున వరాసాగ్గా 12 నెలలు కట్టండి. అంతే. అంతకుమించి మరేం చేయక్కర్లేదు.

ఇక చూచుకోండి దాని ఫలితం.

(1) మీరు కట్టే ఆ మొత్తం రు. 90 కు రు. 136 ల ఫలితం ముడుతుంది. ఫక్తు రు. 100 లకు దేశంలో పెద్దపెద్ద సంస్థలన్నీ ప్రచురించిన సుమారు 3,500 ఉత్తమ తెలుగు పుస్తకాలు, 400 కు పైబడి ఇంగ్లీషు పుస్తకాల (Jaico & Orient Paper Backs) జాబితాలనుండి మీయంతట మీరుగా ఏరి కోరుకునే మంచి పుస్తకాలు వస్తాయి.

(2) రూ. 20 లకు పైగా విలువ చేసే పది పుస్తకాలు - మా ఉచిత పుస్తకాల పెద్ద జాబితానుండి మీ అంతట మీరుగా ఎన్నుకునేవి- అదనంగా, ఉచితంగా వస్తాయి.

(3) రూ. 6 లు ఖరీదుచేసే మా మాసపత్రిక 'పుస్తక ప్రపంచం' సంచికలు ఆ 12 నెలలూ మీకు మా ఖర్చుతో వస్తాయి.

(4) వీటన్నిటికీ ప్యాకింగ్ రవాణాలకు దాదాపు రు. 8-50 దాకా అయ్యే ఖర్చులు మేమే భరిస్తాము.



(5) రు. 1-50 ఖరీదుచేసే మా పెద్ద క్యాటలాగు వేరే ఉచితంగా వస్తుంది.



అంటే - ఈ రూపేణా మీరు కట్టే మొత్తానికి పైన - అందులో సగానికి సగం అదనంగా వస్తుంది. దీన్నే గనక లెక్కగడితే మీకు సగానికి సగం (50 శాతం - 50%) లాభమన్నమాట.



ఇక ఇవి అందే విధానం :



మొదటి నెల చందా రు. 7-50 కట్టగానే -

(1) మీరు ఏరి కోరుకునే 4 ఉచిత పుస్తకాలూ,

(2) ఆ నెల 'పుస్తక ప్రపంచం' పత్రికా,



(3) 3,500 తెలుగువీ - 400 పైగా ఇంగ్లీషు పుస్తకాల జాబితాలున్న కేటలాగులూ,





(4) మీ ఖాతావివరాలు మీకై మీరు వ్రాసిపెట్టుకోవ దానికి రికార్డు పుస్తకమూ - వెంటనే అంది తీరుతాయి.

6 నెలలు చందా కట్టేసరికి?

మా తెలుగు, ఇంగ్లీషు పుస్తకాల క్యాటలాగుల్లోనుంచి మీరు ఏరి కోరుకునే రు. 45 ల పుస్తకాలూ, మరో 3 ఉచిత పుస్తకాలూ అందుతాయి.



12 నెలలు పూర్తి కాగానే ?

మరో రు. 55 ల పుస్తకాలూ, మరో 3 ఉచిత పుస్తకాలూ అందుతాయి.



ఈ 12 నెలలూ - నెలనెలా 'పుస్తక ప్రపంచం' పత్రిక మీ యింటికి విధిగా వచ్చి వాలుతుంది.



పైవాటి కయ్యే పోస్టేజీ, రవాణా ఖర్చులన్నీ మేమే భరిస్తాము.



గడువు పూర్తయ్యాక మా లేమిటి ?



12 నెలలూ పూర్తిచేస్తే మీకు కొన్ని యావజ్జీవిత సదుపాయాలు కలుగుతాయి.

(1) యావజ్జీవితమూ మా పంపిణీ పుస్తకా లన్నిటి పైనా 10% కమీషన్; రు. 20 లకు పైబడ్డ ఆర్డర్లకు అదనంగా రవాణా ప్యాకింగ్లు ఉచితం.

(2) అవసరమైనప్పుడు రు. 50 లు మించకుండా పుస్తకాలు నెలదాకా అరువుమీద మా వద్ద తీసుకోవచ్చు.

(3) 'పుస్తక ప్రపంచం' చందాలోకూడా 10% తగ్గించబడ్తుంది.

(4) ఉత్తరోత్తరా వచ్చే పెద్ద,చిన్నా కేటలాగులన్నీ ఉచితం.

(5) "ఇంటింటా స్వంత గ్రంథాలయాలు" ఇంట గల వారి పేర్లు ఛాయాచిత్రాలతో సహా, పలువురికి ఉపయోగించగల విధంగా తీర్చిదిద్దిన సువర్ణ గ్రంథంలో నమోదుచేయబడుతాయి.

పోతే, ఎప్పుడైనా ఏదైన అవాంతరం వస్తేనో? లేక అసలు మానేస్తేనో?

మీకేం నష్టముండదు. చందాదార్లులు ఒకవేళ ఎప్పుడైనా, ఏ కారణంచేతనైనా అర్థాంతరంలోనే చందా మానివేయతలిస్తే నిరాక్షేపణగా మానివేయవచ్చు, అప్పటికీ వారు కట్టిన సొమ్ము వారికి పుస్తకాల రూపంలో ముట్టితీరుతుంది. కాకపోతే ఈ లెక్కలో, వారికి అంతవరకూ పంపిన ఉచితపుస్తకాలూ, 'పుస్తక ప్రపంచం' సంచికల ధరా, రవాణా ఖర్చులు మినహాయిస్తాం.

నేడే మీరు చందాదారుగాచేరి-మీ 4 ఉచిత పుస్తకాలూ ఈ క్రింది పదింటినుంచి ఎన్నుకోండి :




F. 95. బ్రాహ్మణీకం-ఇతర కథలు : చలం

F. 96. సత్యరాజాపూర్వదేశయాత్రలు:(నవల) కందుకూరి వీరేశలింగము

F. 97. పొదుపు కథ : (నవల) కె. పి. బాబు

F. 98. ఏదిసత్యం, ఏదసత్యం : (నవల) పి. ఆనందారామం

F. 99. ఆడబ్రతుకు : (నవల) పురాణం సూర్యప్రకాశరావు

F. 100. సప్తవర్ణాలు: (నవల) పవని నిర్మలప్రభావతి
F. 101. కార్మిక స్వర్గంలో కళాప్రియుడు: (రవీంద్రుని కథలు)
అనువాదం : కె. వి. రమణారెడ్డి
F 92. **The Judge** · Tara Sanker Banarjee
F. 93. **He who Rides A Tiger :** Bhabani Bhattacharya
F. 94. **The whirlwind :** N. S. Phadke

చందాకట్టే విధానం :

(1) మా 10 ఉచిత పుస్తకాల జాబితానుంచి మీకు నచ్చిన 4 పుస్తకాలు ఎంచుకుని, క్రింది కూపనులో ఆ నంబర్లు గుర్తుపెట్టండి.

(2) పూర్తిచేసిన కూపనూ, మొదటి నెల చందా రు. 7-50 మనియార్డరూ-

"ఇంటింటా స్వంత గ్రంథాలయం" ప్రణాళిక,
ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్,
రాష్ట్రపతిరోడ్డు, సికింద్రాబాద్-అనే చిరునామాకు పంపండి.

(3) తరువాత నెలనెలా రు. 7-50 పంతున ఆయా నెల ఆఖరులోగా చందా మొత్తం రు. 90 పూర్తి అయేదాకా పై అడ్రసుకు పంపుతూ వుండాలి-అంతే.

ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్, రాష్ట్రపతి రోడ్డు,
సికిందరాబాదు వారికి—

అయ్యా, మీ 'ఇంటింటా స్వంత గ్రంథాలయం' ప్రణాళికకు నన్ను ఒక చందాదారుగా చేర్చుకొనగోర్తున్నాను. మొదటి నెల చందా రు. 7-50 లు మనియార్డరుద్వారా పంపినాను. తొలి విడత ఉచిత పుస్తకాలు నాలుగూ ఈ క్రింద గుర్తించిన (✓) నంబర్లవి పంపగోర్తున్నాను. మీ నిబంధనలకు బద్ధుణ్ణి.

[ ] F 95 [ ] F 96 [ ] F 97 [ ] F 98
[ ] F 99 [ ] F 100 [ ] F 101 [ ] F 92
[ ] F 93 [ ] F 94

పేరు ........................................ ఇట్లు,

చిరునామా ........................ ........................

ఊరు ........................ తేది ........................